# మా ప్రచురణములు

| | |
|---|---|
| ఈశ్వరసాక్షాత్కారము | రూ. 0_3_0 |
| శ్రీ త్రిపురాంతకేశ్వర శతకము | 0_4_0 |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2_0_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_8_0 |
| కల్యాణకుంజము | 1_4_0 |
| రాధారహస్యము | 1_4_0 |
| బదరీయాత్ర (3వ_కూర్పు) | 1_0_0 |
| మానవధర్మము | 1_0_0 |
| సిద్ధాంతకల్పవల్లి | 1_0_0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణవివేకానందులు) | 1_0_0 |
| సంకీర్తన మీమాంస | 1_0_0 |
| హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_0_0 |
| పద్మపురాణము (ఆదిమఖండము) | 1_8_0 |
| ,, (భూమిఖండము) | 2_0_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_0_0 |
| శ్రీరామనామ ప్రభావము | 0_6_0 |
| అష్టాదశశ్లోక గీత | 0_12_0 |
| భక్తితత్త్వము | 0_12_0 |
| పరమార్థతత్త్వము | 0_12_0 |
| కము | 0_12_0 |
| పంచకము | 0_12_0 |

సాధన గ్రంథ మండలి _ 58

# పద్మపురాణము

[భూమిఖండాంధ్ర వచనము]


అభినవగౌతమ, తర్క-వేదాన్త విద్యావిశారద
శ్రీ వేంకట భానోజీ రామర్సు ప్రభువర్య పోషిత
శ్రీ మరువాడ శంభన్న శాస్త్రి







ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి.

కాపీరైటు] 1953 [మూల్యము రు. 2_(

# సంపాదకీయము

పేరూరు సంస్థానాధీశ్వరులు శ్రీ వేంకట భానోజీరామర్సు ప్రభువులు మహోదాతలు. వీరు సత్రసంతానములను, కళాశాలలను స్థాపించి, చిరతరకీర్తి నార్జించినారు. వీరి తల్లిగారు శ్రీ తిరుమల వేంకటలక్ష్మీబాయమ్మగారు శ్రీకృష్ణ భక్తురాలు. నిరంతర శ్రీకృష్ణ పూజనమె ఆమె జీవిత పరమలక్ష్యము. శ్రీ తిరుమల వేంకట లక్ష్మీబాయమ్మ గారియు, శ్రీ వేంకట భానోజీ రామర్సు గారియు అహమహమికా పూర్వకమైన ఔదార్యాదులతో పేరూరు సంస్థానము అన్ని విధముల వాసికెక్కినది.

అభినవ గౌతములు, తర్క-వేదాంతవిద్యా విశారదులు, సకల పురాణ వేత్తలు, ధర్మశాస్త్రజ్ఞులు నగు శ్రీ మరువాడ శంభన్న శాస్త్రిగారు చిరకాలము నుండి వీరి యాస్థాన పండితులుగా నుండిరి. వీరివలన పురాణములలోకెల్ల మేటి యగు "పాద్మము" సంపూర్ణముగ విని శ్రీ తిరుమల వేంకట లక్ష్మీబాయమ్మ గారు శ్రీ శాస్త్రిగారిని సర్వజన సుగ్రాహ్యముగ వచనమున, ఆంధ్రమున తెనిగింపుడని కోరగా, శ్రీ శాస్త్రిగారు పద్మపురాణమును కమ్మని తేటతెనుగున ననువదించిరి. ఈ గ్రంథ ప్రకటనకు సంపూర్ణసహాకారము చేయ శ్రీ తిరుమల వేంకట లక్ష్మీబాయమ్మగారు వాగ్దానము చేయ శ్రీ రామర్సు ప్రభువులు తథాస్తనిరి.

శ్రీ శాస్త్రిగారి ఆశీర్వచనమున, శ్రీ సంస్థానాధీశ్వరుల యాదరణమున పద్మపురాణాంధ్రవచనములోని ఆదిమఖండము, బ్రహ్మఖండము మా సాధన గ్రంథ మండలిలో ప్రకటితములైనవి. ప్రస్తుతము భూమిఖండము ప్రకటిత మగుచున్నది.

కాని, తమ చేతిమీదుగ వ్రాసికొనిన భూమిఖండము సంపూర్ణముగ ముద్రింపబడి, పుస్తకరూపమున దమచేతికి రాకమునుపే శ్రీ శంభన్న శాస్త్రి గారు ది 24-8-1953 న అకస్మాత్తుగా మరణించుట తటస్థించినది. సుప్రసిద్ధ పండితప్రకాండములలో అగ్రేసరులగు శ్రీ మరువాడ శంభన్న శాస్త్రిగారి మరణము మమ్మేకాదు, యావదాంధ్రదేశమును తీఱని విషాదమున ముంచినది.

పద్మపురాణమును పూర్తిగా అనువదింతుననియు, ఇట్లే సంస్థానాధీశ్వరులు నా యందలి గౌరవమున ప్రకటించి విద్వత్కార కమలముల కందింతు

రనియు శాస్త్రిగారు నాతో ప్రత్యక్షముగా ననేకపర్యాయములు చెప్పుచుండెడివారు. అట్లే శ్రీ తిరుమల వేంకట లక్ష్మీబాయమ్మగారుకూడ, నాతో చెప్పియుండిరి.

అభినవగౌతములు, తర్క-వేదాంత విద్యావిశారదులు, పేరూరు సంస్థానాధీశ శ్రీ వేంకట భానోజీ రామయ్య ప్రభువర్య పోషితులు, అపర సరస్వతీ స్వరూపులు నగు శ్రీ మరువాడ శంభన్నశాస్త్రిగారు ప్రారంభించిన యీ పద్మపురాణాంధ్ర వచన రచనము ఇంతతో ఆగిపోక కొనసాగి, మిగిలిన ఖండములు గూడ సంస్థానాధీశ్వరుల సాహాయ్యమున అచిరకాలముననే వెలువడ గలవని విన్నవించుచు శ్రీకృష్ణపరమాత్మ శ్రీవారి కుటుంబమున కితోధిక ఆయురారోగ్య విజయైశ్వర్యాభివృద్ధు లొసగుగాక యని యాశించుచున్నాను.

శ్రీ శంభన్నశాస్త్రిగారి జీవితసంగ్రహమును అడిగినంతనే వ్రాసి యిచ్చి తమ గురువులందలి భక్తిప్రపత్తులను వెల్లడించుకొనిన శ్రీ మంథా గోపాలశాస్త్రిగారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

విజయ ఆశ్వయుజము
అక్టోబరు 1953

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
సంపాదకుడు : సాధన గ్రంథ మండలి.

—♦—



అభినవ గౌతమ

తర్క వేదాంత విద్యా విశారద

**శ్రీ మరువాడ శంభన్న శాస్త్రి**

శ్రీ గురుభ్యోనమః

బ్రహ్మశ్రీ "తర్క-వేదాంత విద్యావిశారద, అభినవగౌతమ"

# శ్రీ మరువాడ శంభన్నశాస్త్రిగారి

# జీవిత సంగ్రహము

ఈ మహాపండితులు సరియగు హూణశకః 1874 సంవత్సరం జూలై మాసమున స్వస్తిశ్రీ చాంద్రమాన భావ సంవత్సర ఆషాఢ శుక్ల నవమీ బుధవారమునకు స్వాతీనక్షత్ర చతుర్థచరణయుక్త వృశ్చికలగ్నమున షట్శాస్త్ర పారంగతత్వము నొందు గ్రహకూటమి గల శుభకాలంబున శ్రీ పేరూరు గ్రామ వాస్తవ్యులును జమీందారులు నగు జిల్లెళ్ళ వంశీయులగు ప్రభువులకు ముఖాసా గ్రామ మగు 'విలస' యను గ్రామంబున సన్మాని కుత్సస గోత్రీయులును, సాంబశివ పాదార్చనా రతులును శ్రీ రాజరాజేశ్వరీ లక్ష్మణాంబలను పేరూరు ద్రావిడ దంపతుల కీ పండితరత్న ముదయించెను. శ్రీ శంభన్నశాస్త్రి యను నామంబున సుప్రసిద్ధులగు వీరి కా జననీజనకులు సాంబశివ యని నామకరణంబు గావించిరి.

విద్యాభ్యాసము:-

వీరలు లిపిగ్రహణంబాదిగ కౌశల్యంబున బాలోచిత విద్య నభ్యసించి పంచమాబ్దంబుననే యుపనీతులై వేదాధ్యయనంబు చేయుచుండ శైశవంబుననే జననీజనకులు దివంగతులగుటచే గారాబంబున నాదరించువారలు లేక బహు కష్టంబుల నందుచు వైరాగ్యంబున మాతృమృతి ఖిన్నులై మునిగణాగ్రేసరుడగు నారదునిపోల్కి బంధవిముక్తిం బరమేశ్వరానుగ్రహంబుగ భావించి సద్గురుని సేవించి శాస్త్రముల నభ్యసింప పేరూరు గ్రామ వాస్తవ్యులును శ్రీ మంత్రా వంశసుధాబ్ధి నిశాకరులును చంద్రశేఖరాపరాభిధులగు శ్రీ చన్నయ్య శాస్త్రులవారిం బ్రణిపాతపూర్వకముగ బ్రార్థించి వారి యనుగ్రహంబున కావ్యనాటకాలంకార తర్క-ప్రకరణ గ్రంథములం దతి నిశిత పాండిత్యంబు నార్జించి పిదప న్యాయశాస్త్రమందలి యుద్గ్రంథముల నభ్యసింప విద్యానగరంబన విఖ్యాత విజయనగరం బేగి తత్సంస్థానాస్థాన విద్వాంసులును నిరుపమ న్యాయపాండిత్య ప్రతిభా సముల్లసితులు నగు శ్రీ గుమ్మలూరి సంగమేశ్వర శాస్త్రులవారి వలన దుర్బల దేహులైనను విద్యాభ్యాసనిరతిం గష్టంబులైన సుఖంబుగ సహించుచు

నెనిమిది వత్సరముల కాల మా శాస్త్రం బభ్యసించి వారి యాశీస్సుల నంది స్వదేశంబున కేతెంచి మరల పీఠికాపుర సంస్థానాస్థాన పండితప్రవరులును "తర్క కేసరి" బిరుదాంకితులు నగు శ్రీ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రులవారి సాన్నిధ్యంబున మరియు గొన్ని న్యాయశాస్త్ర గ్రంథంబులం జదివి పిదప ఆదిగురువులగు శ్రీ మంథా వన్నయ్య శాస్త్రులవారిం జేరి ప్రణమిల్లి వారిచే నాదృతులై వారివల్లనే శాంకర బ్రహ్మసూత్ర భాష్యాది వేదాంతగ్రంథములం జదివి రాజరాజేశ్వరీ కటాక్ష పరిలబ్ధ శేముషీ గరిమచే ననేకంబులగు శాస్త్రీయ గ్రంథంబులఁ బాఠప్రవచన సమర్థంబులుగ జేసి తత్కాలంబున ఉర్లాం, ఖాశింకోట, విజయనగరము, పిఠాపురము మొదలగు సంస్థాన పండితసభలందు పరీక్షా పూర్వకంబుగ ప్రభు పండిత బహూకృతులై ప్రతిష్ఠా పత్రంబుల నంది స్వగృహాగతులై కుటుంబ భరణ సమర్థంబగు నర్థం బార్జింప బహుభంగుల నూహించుచుండ—

## ఆస్థాన ప్రవేశము :—

శ్రీ పేరూరుగ్రామ వాస్తవ్యులును జమీందారులు నగు శ్రీ జిల్లెళ్ల రామోజీ భానోవారు శ్రీశాస్త్రులవారిం సమీపించి శ్రీశాస్త్రులవారిం బ్రణమిల్లి సత్కృతులం గావించి, మీవల్లన సకలపురాణార్థంబులం దెలియ నూహించుచుంటిని. మీగౌరవ పోషణాదికంబులు మాయాస్థానంబుననే జరుగగలవని సవినయంబుగ నుడువ తదాదిగ నా సంస్థానమునందే ప్రవేశించి పండితోత్తముల సన్నిధిని సకల పురాణార్థంబుల వారికి బోధించుచు, వారియనుగ్రహంబుననే పేరూరు గ్రామ సామీప్యంబున నుండు బుచ్చమ్మగ్రహారమున గృహనిర్మాణ మొనర్చి యందుండి ముకుంద పాదారవింద మరందాస్వాదన మోదితాంతరంగులైయుండు నాకాలంబుననే ప్రథమ ద్వితీయ కళత్ర భంగవ్యసనోపేతులైనను తద్వ్యసనంబు పాటించక దైవప్రేరణచే మరల గార్హస్థ్యంబు నొంది విద్యావ్యసనం బొకటియే గలిగి యనేకేతర దేశాగత శిష్యగణంబులకున్ను శ్రీ పరమహంస పరివ్రాజకులకును వారల యభీష్టానుసారంబుగ కనీసము పంచాశదావృత్తులైన ప్రస్థానత్రయాది పాఠకులై యాంధ్రదేశముననేగాక తీర్థాటనావసరంబున వారాణస్యాది పుణ్యక్షేత్రములకేగి యాత్రావిధుల నివర్తింపుచు తత్పురస్థులగు శ్రీ రాఖాల్ న్యాయ భట్టాచార్య, వామాచరణ భట్టాచార్య, శివకుమార సందేజీ మొదలగు పండితులతో న్యాయవేదాంత గోష్ఠిం సలిపి, స్వశాస్త్ర పాండిత్య ప్రౌఢిమమును వాదరూపంబున ప్రకటించి వారలచే సత్కృతులై స్వస్థానంబున కేతెంచిరి.

వేరొకప్పుడు శ్రీ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కాంచీకామకోటి పీఠాధిప చంద్రశేఖరేంద్ర సరస్వతీసంయమీంద్రుల ప్రేరణచే ముక్త్యాల గ్రామంబున బ్రహ్మసప్తాహ సభాస్థలి నఖిలపండిత ప్రవర సమ్ముఖంబున ప్రస్థాన త్రయం బొక్క యామంబులో పండితానందదాయకంబుగ మహోపన్యాసంబు గావింప, నాసంయమీంద్రు లమందానందంబున శ్రీశాస్త్రులవారి శాస్త్రానుభవంబును బహుభంగుల శ్లాఘించి సన్మానించిరి. ఈపండితోత్తమునకు విద్యా గౌరవప్రదానములకు చంద్రశేఖరులే ప్రధానకారణభూతులు. వీరల శిష్యప్రశిష్య వర్గం బసంఖ్యాకంబు. శ్రీవేదాంతం శేషాద్రిశాస్త్రిగారు, శ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రిగారు, శ్రీ నాదూరి కామేశ్వరశాస్త్రిగారు మొదలగు ననేకులుండిరి.

గ్రంథరచన:_

మరియు శ్రీశాస్త్రులవారి పాండిత్యము గీర్వాణ భాషయందేగాక యాంధ్రమున గూడ నసమానము. శ్రీరామోజీభానోవారి ధర్మపత్నియు వైదిక ధర్మనిరతయు నగు శ్రీ తిరుమల వేంకటలక్ష్మ్యంబగారొకప్పుడు శ్రీశాస్త్రులవారిం బ్రణమిల్లి శ్రీ వేదవ్యాస ప్రణీతంబగు పద్మపురాణంబు నాంధ్రీకరింపుడని ప్రార్థింప నట్లేయని సాహసంబున నాంధ్రీకరింప నుద్యమించి వార్ధక్యకృతంబగు నశక్తతచే తత్సంస్థానాస్థాన జ్యోతిర్విదులగు శ్రీ మంథా గోపాలశాస్త్రిగారిని రచనాలేఖనాదికములకు సహాయులుగా గొని యాపద్మపురాణమందలి యారు ఖండములలో మూడుఖండంబుల మృదుమధురశైలి నాంధ్రీకరించి వారిచే సన్మానితులగు విజ్ఞాన ఘనులు. బహూక్తులేల బహువిధంబుల నంతేవాసులందు ప్రచారముగల శాస్త్రాధ్యాపనమే శ్రీశాస్త్రులవారి విద్యావైభవ గౌరవంబుల ప్రకటించుచున్నయది. వీరి గురుపారంపర్యాగత విద్యాప్రౌఢిమము విబుధుల కెల్లరకు నెంతయు గ్రొత్త కాకపోవుటంజేసి యధికముగా వివరింప ననవసరంబని విరమించు చున్నాను.

—◆—

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణే నమః

# విజ్ఞాపనము

శ్రీమన్మహీమండల మండనాయమానంబైన భరతవర్షంబు నందలి భరత ఖండంబున నధీత నిఖిల వేదవేదాంగ భూసుర భాసురంబై పేరూరను ప్రఖ్యాతి గల గ్రామవరంబు సర్వజన విదితంబై భాసిల్లుచున్నయది. ఏతద్గ్రామ వాస్తవ్యులును శ్రీ జిల్లెళ్ళ వంశపయఃపారావార రాకాసుధాకరులును, నాశ్రిత బహుజన పోషణ నిరతాన్న దాన దాక్షిణ్యాది గుణగణ గరిష్ఠులును నగు శ్రీ వేంకట భానోజీ రామయ్యవారికి తల్లిగారును నిరంతర పురాణ శ్రవణ జనిత సర్వధర్మ జ్ఞానాన్వితలును సార్వకాలిక శ్రీకృష్ణధ్యాన పూజాద్యారాధన ప్రభావ జనిత చిత్తశుద్ధి సహితలును, ఆచరితానేక వ్రతదానాది ధర్మసంపన్నలును నగు శ్రీ తిరుమల వేంకట లక్ష్మీబాయమ్మగారొక్కనాడు నేను సంస్థానాస్థాన మంటప సుఖాసీనుండనై యున్న సమయంబున భవదుక్త పద్మపురాణ ధర్మంబులు సర్వజన సుగమ శ్రేయః ప్రాపకంబులు గావున నీ గ్రంథమును సులభశైలిని వచనముగ నాంధ్రీకరించిన లోకోపకారము కాఁగలదని పలికినఁ దద్వచనముల నాకర్ణించి సద్గురు కరుణాకటాక్షముచేతను, నిష్టదేవతా కటాక్షముచేతను లబ్ధంబైన ప్రతిభావిశేష విలాసముచే సాహసించి వారి యాజ్ఞను శిరసావహించి తమ కటాక్షమును నీశ్వరకృపావేశమును నున్నయెడల నట్టే కావింతునని చెప్పి యాదిమఖండము మొదలు పద్మపురాణార్థమును తెనుఁగున సుగమశైలిని వివరించితిని.

భక్తిజ్ఞాన వైరాగ్య నీతిబోధకములగు ఆర్ష సాంప్రదాయములతోఁ గూడిన అపూర్వవిషయములు గల గ్రంథములను ప్రకటించి ప్రచారముచేయుటయే ప్రధానాశయముగా గల సాధన గ్రంథ మండలి, తెనాలి వారు శ్రీ జమీందారుగారి సాహాయ్యమున నింతవరకు ఆదిమ, బ్రహ్మఖండములు ముద్రించినారు. నేడీ భూమిఖండముగూడ వెలువరించుచున్నారు. వీరి మండలి ఆంధ్రుల యాదరాభిమానము లందుఁగాక యని కోరుచుంటిని.

గుణదోష విమర్శకులైన సజ్జనులు మాత్సర్యమును విడిచి వాత్సల్యము నుంచి పద్మపురాణాంధ్రవచనమును జూచి యానందింతురు గాక యని ప్రార్థించుచున్నాను.

పేరూరు
24—6—53

అభినవగౌతమ, తర్కవేదాన్త విద్యావిశారద
**మరువాడ శంభన్నశాస్త్రి**

# విషయసూచిక



" శ్రీకృష్ణం మనసా ధ్యాత్వా శ్రీకృష్ణం సంప్రణమ్య చ
భూమికాంధ్రవచనం ప్రణీతం కృష్ణ తుష్టయే. "

శ్రీః

శ్రీరాధాకృష్ణ పరబ్రహ్మణే నమః

# పద్మపురాణము

## భూమిఖండము

శ్రీ చంద్రశేఖరం వందే, దక్షిణామూర్తి మవ్యయం
సంగమేశం శ్రీ నృసింహం, శ్రీపాదాన్వయ సంభవమ్.

### శివశర్మ, తనయుల పితృభక్తిని పరీక్షించుట

శౌనకుండు పితృభక్తిని దెలియజేయు మనిన సూతుం డిట్లనియె. భృగునందనా! నీవు విష్ణుభక్తులలో నగ్రగణ్యుం డవు. నీప్రశ్నము సకలలోక హితకరమయినది. పూర్వకాలం బున శ్రీరామ పరశురాము లిరువురుఁ బిత్రాజ్ఞను శిరమున వహించి సకలలోక శ్లాఘ్యమయిన కీర్తినిఁ బడసిరి. గాంగే యుండైన భీష్ముఁడు పితృభక్తిచేఁ బిత్రభిమతార్థ పరిపాలన మును జేసి స్వచ్ఛంద మరణలాభము నొందెను. ఈ యర్థం బునం దొక పురాతనేతిహాసంబు గలదు. దానిం జెప్పెద. సావధానమతిం జిత్తగింపుము.

పూర్వకాలంబునఁ బశ్చిమసముద్రతీరమందు ద్వారక యను నొక పురవరంబు గలదు. సర్వశాస్త్రార్థ కోవిదుండైన శివశర్మయను నొక బ్రాహ్మణుఁడు, యజ్ఞశర్మ, వేదశర్మ, ధర్మశర్మ, విష్ణుశర్మ, సోమశర్మ యను నైదుగురు పుత్రులతో

దత్పురవరంబున నివసించి యుండెను. శివశర్మయుఁ బుత్రులును, నిత్యాగ్నిహోత్రులు, తపోయోగ బలాన్వితులు. శమదమాది గుణయుతులు, సత్యసంధులు నైనవారు. ఈ కుమారులకుఁ దండ్రియందధిక భక్తికలదు. ఒకప్పుడు శివశర్మ కుమారుల పితృభక్తినిఁ బరీక్షింపవలెనని తలంచి, జ్యేష్ఠపుత్రుఁడైన యజ్ఞశర్మతో నిట్లనియె. మీతల్లి జ్వర సంతాపముచే దుఃఖించుచున్నది. ఏయుపాయముచేత నాలోచించినను నీదుఃఖమునకు నివృత్తి కనఁబడలేదు. ఈప్రకారము దుఃఖపడుటకంటె మరణమే శ్రేష్ఠమయినది. కావున నీవు శీఘ్రముగాఁ దీక్ష్ణఖడ్గముచే నీతల్లిని వధింపుము. పిమ్మట హస్తపాదాద్యవయవములను దునిమి నలుదిశలయందుఁ బడవేయుము. అట్లుచేసినగాని యీజ్వర సంతాపము పోదని చెప్పెను. తద్వచనముల నాకర్ణించి యతఁ డట్లుచేసి యథాదిష్టముగాఁ జేసితినని పితృపాదములకు నమస్కారము గావించి పలికెను. శివశర్మ తన తపోబలముచే నిట్లుకల్పించెను. ఇది మాయ యని యజ్ఞశర్మ యెఱుంగడు. తండ్రి యాజ్ఞను శిరమున వహించి యట్లుచేయుటే పరమధర్మమని తలంచి తల్లిని వధించెను. అటుపిమ్మట శివశర్మ రెండవ పుత్రుఁడైన వేదశర్మను బిలిచి నేను నిత్యకర్మములందు మిక్కిలి యాసక్తి కలవాఁడను గావున ధర్మపత్నీసహితుండనై నిత్యాగ్నిహోత్రాది కర్మముల నాచరింపవలెను. మీతల్లిని దీసికొనిరమ్ము. నేను సంసారసుఖాభిలాషిని విరక్తిఁజెందిన వాఁడను గాను. విహితకర్మముల నాచరింపనివాఁడు నరకదుఃఖములను బొందఁ గలఁడని చెప్పెను. ఆ వచనములను విని వేదశర్మ తనతల్లి

సమీపమునకుఁ బోయి యామెకు నమస్కారము గావించి తండ్రి చెప్పిన వాక్యములను దల్లితోఁ గ్రమముగా విన్నవించెను. అపు డామె యీ సర్వవృత్తాంతము నాకర్ణించి నీకు సామర్థ్యముగలదేని బ్రహ్మేంద్ర రుద్రాదిమరుద్గణంబులను నాకు సాక్షాత్కరింపఁజేయుము. నాయభీష్టమును నెరవేర్చితివేని నీజనకుని సమీపమునకు వెళ్ళెదను. లేనియెడల నిక్కడనే నివసించి యుందునని మందిరమధ్యంబున గూర్చుండి వేదశర్మతో నిట్లు చెప్పెను.

అప్పుడు వేదశర్మ తన తపోబలముచే దేవతలను స్మరించి; నమస్కరించి స్తుతిఁజేసి తల్లికి ప్రత్యక్షము చేయించెను. వారు ప్రత్యక్షమయి నీకునభీష్టమయిన వరము నొసంగెదము, కోరుమని వేదశర్మతోఁ జెప్పిరి. అపుడు వేదశర్మ మీరలు ప్రసన్నులరయిన యెడల నాకుఁ బితృభక్తిని దయతోఁ బ్రసాదింపుఁ డని ప్రార్థించెను. ఆ మాటను విని వారు నిరంతర పితృభక్తి నొసంగి యంతర్హితులయిరి. అటుపిమ్మట నాతని తల్లి నీకు ననవరత జనకభక్తివలె నాయందుఁగూడ భక్తి కలదేని తీక్ష్ణఖడ్గముచే నీ శిరమును ద్రుంచి నా కొసంగుమని కోరెను. ఆమాటను విని నే కృతార్థుఁడనైతినని భావించి వాడిగల కత్తిచేఁ దనకంఠమును దునిమి యామెకిచ్చెను. అపు డామె యా శిరంబును చేతఁబూని భర్తృసమీపమున కేఁగి యయ్యుదంతం బాద్యంతంబుగా విన్నవించె.

అపుడు శివశర్మ ధర్మశర్మయను పుత్రుని బిలిచి నీ తపోబలముచే వీనిని బ్రతికింపుమని చెప్పెను. సోదరులందరు వేదశర్మ మిక్కిలి కృతార్థుఁడని శ్లాఘించిరి. అనంతర మా

ధర్మశర్మ యమధర్మరాజును స్తుతిఁజేసి సాక్షాత్కరింపఁజేసి కొనెను. యముఁడు ప్రత్యక్షమయి, యో బ్రాహ్మణోత్తమా! నీ శమదమతపస్సత్యశౌచాది గుణంబులకు సంతసించి సాక్షాత్కరించితిని. నీ కభీష్టమయిన వరంబు నొసంగెద; వేఁడుమనిన; నా ధర్మశర్మ ధర్మమం దాసక్తిని; నానావిధ భోగములను, మోక్షమును, దయతో నా కొసంగి నా సోదరుఁడైన వేద శర్మను బ్రతికింపుమని వేడెను.

యమధర్మరాజు తద్వచనముల నాకర్ణించి యట్లు బ్రతికింపఁజేసి యంతర్హితుండై స్వపురంబున కరిగెను. అపుడు తల్లిదండ్రులును సోదరులును నీ వృత్తాంతమును జూచి యాశ్చర్యము నొందిరి. అటుపిమ్మట శివశర్మ పురోవర్తియు మహా మేధావియు నగు విష్ణుశర్మను బిలిచి నేను స్రక్చందనవనితాది భోగములయం దతితృష్ణ కలవాఁడను. సుందరాంగులయిన యువతులనుగూడి సుఖించు పురుషులు సుందరులయి యౌవన వంతులయి, యుండవలెను. వృద్ధుండును; వ్యాధిగ్రస్తుండును; సౌందర్యవిహీనుండును నగు పురుషుని జూచి; సుందరాంగు లయిన యువతీమణులు నిరాకరించెదరు. నేను నా భార్యతోఁ గూడ నమృతపానముఁజేసి, చిరకాలము సాంసారిక సుఖముల ననుభవించెదను. కాఁబట్టి నీవు శీఘ్రముగా నింద్రలోకమున కేఁగి దేవేంద్రునిఁబ్రార్థించి యమృతకలశమును దెచ్చి నాకిమ్మని యానతిచ్చెను. అపు డా విష్ణుశర్మ పితృశాసనమును శిరమున వహించి తన తపోబలముచే గగన మార్గమునఁ బోవుచుండెను.

అటుపిమ్మట దేవేంద్రుఁ డీ వృత్తాంతమును దెలిసికొని మేనకయను నప్సరస్స్త్రీని బిలిచి విష్ణుశర్మ స్వర్గలోకమునకు

వచ్చుచున్నాఁడు. నీవు గగనమధ్యంబునకుం జని నానావిధ శృంగారచేష్టలచే నతని మోహాక్రాంత చిత్తునింజేసి విఘ్నము నాచరింపుము. నా గృహమున కతండు వచ్చినయెడల దేవ భోగ్యమయిన నమృతమును బ్రార్థించి, కొనిపోవునని చెప్పెను. ఆ మాటను విని యా మేనక సర్వాభరణభూషితయై నందనవన మధ్యభాగమందలి యుయ్యెలనూగుచు, వీణాగానముఁజేయుచు దేవలోకమునకు బోవుచున్న విష్ణుశర్మకు విఘ్నము నాచరించు టకు నుద్యమించెను.

విష్ణుశర్మయు స్వర్గలోకమునకుఁ బోవుచు నామేనకను జూచెను. అటుపిమ్మట నామేనక విష్ణుశర్మ నవలోకించి యెదురుగావచ్చి యోమహాత్మా! బ్రాహ్మణోత్తమా; నీ వెక్కడికి బోవుచున్నావని యడిగెను. ఆమాటనువిని విష్ణు శర్మ మాతండ్రి యానతిచే నమృతకలశమును దెచ్చుటకై దేవేంద్ర సమీపమునకుఁ బోవుచున్నానని చెప్పెను. అపు డా మేనక యామాటను విని నీబ్రహ్మవర్చస్సును సౌందర్యమును జూచి కామాగ్నిచే మిక్కిలి సంతాపము నొందుచు, నీసమీ పమున కేతెంచితిని. రతికేళిచే నాకామాగ్నిని శమింపఁజేయు మని వేఁడెను. అప్పుఁడా విష్ణుశర్మ విశ్వామిత్రాది మునులు నీ సౌందర్యమును జూచి మోహితచిత్తులయి నినుఁగూడి రతి కేళిచే సుఖమునొందిరి. నే నటువంటి వాఁడనుగాను. శివశర్మ పుత్రుండనైనవిష్ణుశర్మనని చెప్పి వెడలిపోవుచుండెను. అవుడు మేనక నా ప్రయత్నమంతయు విఫలమాయెనని యింద్రునితోఁ జెప్పి యతని శాసనముచే నతిభయంకరంబులైన సింహశార్దూల

భల్లూకాది క్రూరజంతువులను సృజించెను. అవియన్నియు స్వకీయమైన తపోబలంబువలన నగ్నిచే దారుచయము భస్మమైనటుల దగ్ధంబులయ్యె. పిమ్మట దేవేంద్రుఁడును నతిభయంకర రాక్షస గణంబులను జవసత్వంబులుగల క్రూరసత్వంబులను మాయచేఁ గల్పించి విష్ణుశర్మకు ననేకవిఘ్నములను గలుగఁ జేసెను. ఆసమయంబున విష్ణుశర్మ తన తపోబలముచే సకల విఘ్నములను నశింపఁజేసి రోషారుణ లోచనుండై నేను నిజ ధర్మరతుండను మజ్జనకునియం దతి భక్తి కలవాఁడను. మహా మహుండైన మాతండ్రి యాజ్ఞచే జననమరణ నాశకంబును దేవత్వప్రాపకంబును నగు సుధాపూరిత కలశంబును నిను బ్రార్థించి, తీసికొని పోవఁదలంచి వచ్చితిని. నీవు నాకుఁ బ్రతికూలముగా విఘ్నము నాచరించితివి. కావున నిన్నధోలోక మునఁ బడవేసెదను. మఱియొక యింద్రుని నీలోకమున స్థాపించెదనని యత్యుగ్రుండై పలికెను.

అపుడు దేవేంద్రుఁడు మిక్కిలి భయపడి నీశమదము తపశ్శౌచ సంతోష నియమంబులచేతను తపోబలంబుచేతను పితృభక్తిచేతను సంతసించితిని. నీకు నేను దేవతలతోఁగూడ వశవర్తినయితిని. నీకు ముల్లోకములయందు నసాధ్యమయిన కార్యము లేదు. నీ కభీష్టమయిన వరము నొసంగెద వేడు మనిన నీ విపుడు వరమునిచ్చుటకయి వచ్చితివి గావున నేను సంత సించితిని. నీవు సుప్రసన్నుండవు కానియెడల మఱియొక యింద్రుని నీలోకమున స్థాపింపఁ బ్రయత్నించితిని. తపోధను లయిన బ్రాహ్మణుల యాగ్రహముచే బ్రహ్మవిష్ణ్వాదులైన

క్షేమము నొందజాలరని బ్రాహ్మణ మహిమమును బోధించి యచంచలంబైన పితృభక్తిని, నమృతకలశమును, దయతో నాకొసంగుమని వేడెను. దేవేంద్రుం డపు డతని తపోబలము నకు సంతసించి విష్ణుశర్మకు నమస్కారము గావించి కోరిన వరమొసంగి, పితృసమీపమునకు వీడ్కొలిపెను. అటుపిమ్మట విష్ణుశర్మ తండ్రి సమీపమునకు వచ్చి నమస్కరించి యో తండ్రీ! దేవేంద్రుని కడకేఁగి నా తపోబలముచే నింద్ర తత్పరి వారకృత విఘ్నములను నివారించి, సకలవ్యాధి నాశకరంబును, జరామరణ నాశకంబును నగు నమృతకలశంబును దెచ్చితి నని తండ్రితో విన్నవించెను. అపు డా శివశర్మ తన తనయుల నందఱఁ బిలిచి ప్రేమతో నిట్లనియె.

ఓతనయులారా! మీరలు పితృభక్తియుతులరు గావున నావాక్యమును బాలించితిరి. పూర్వజన్మార్జిత సుకృతముచేఁ దల్లిదండ్రులు, సుగుణవంతులయిన తనయులను బడయుదురు. తనయులకును నధిక పుణ్యముచేతనే యోగ్యులయిన తల్లిదండ్రులు లభించెదరు. మీకుఁ గావలసిన వరము నొసంగెద వేడుఁడనిన, సకల దుఃఖవర్జితంబును, సనక సనందనాది బ్రహ్మర్షి సేవితంబును నగు గోలోకమును మాకు లభింపఁ జేయు మని వేడిరి. పిమ్మట నాశివశర్మ మీరలు నాయను గ్రహముచేతను, తపంబుచేతను, పితృభక్తిచేతను, విగత కల్మషులరయి వైష్ణవలోకమును, బొందుఁడని యానతిచ్చెను. ఇట్లు శివశర్మ చెప్పినతరువాత నతని తపోబలముచే గోలోక నాథుండగు శ్రీకృష్ణుండు శంఖచక్రగదాపాణియై గరుత్మంతు

నధిష్ఠించి శివశర్మకు సాక్షాత్కరించి యిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు తపోబలయుతుండవు. నీతనయులందఱు శమదమాది గుణాన్వితులు. పితృభక్తియుతులు. కాబట్టి నీకు నేను స్వాధీనుండనైతిని. వైష్ణవ పదంబైన గోలోకము నిచ్చుచున్నాను. నీవు భార్యాపుత్రసహితుండవై గోలోకమును బొందు మనిన, దద్వచనముల నాకర్ణించి శివశర్మ నాతనయులలో నిపుడు నలుగురు వచ్చెదరు. సోమశర్మయను నైదవ బుత్రునితోను నాభార్యతోను గొంతకాల మీభూలోకమున నివసించి పిమ్మట గోలోకమునకు రాఁగలనని చెప్పెను. అపుడు నలుగురు పుత్రులును నింద్రనీల సమానవర్ణముగల వారును, శంఖచక్రగదాధరులును, దివ్యాంబరాభరణ భూషితులును, నగుచు దివ్యవిమానవరము నధిష్ఠించి రాధాకృష్ణునితోఁ గూడ గోలోకమున కేఁగి, తత్సమీపమున నివసించి శాశ్వత సుఖము నొందిరి.

అటుపిమ్మట శివశర్మ సోమశర్మకు నమృతకలశమునిచ్చి దీనిని జాగరూకుండవై రక్షింపుమనెను. నేను భార్యతోఁగూడఁ దీర్థయాత్రకు బోయెద నని చెప్పి బయలువెడలి గంగాది తీర్థములను సేవించి యనేక శివక్షేత్రములందు ధర్మపత్నీసహితుండై పదిసంవత్సరములు తీవ్రముగాఁ దపంబు నాచరించెను. అనంతర మా శివశర్మ తనమాయచే భార్యతోఁగూడ కుష్ఠరోగమును బూని స్వాశ్రమంబున కేతెంచెను. అపుడు సోమశర్మ జననీ జనకులను జూచి యెదురుగా బోయి వినయవినమితాంగుండై నమస్కరించి వారికుశలమును దెలిసికొని యిట్లు

నిరు. మీరు తపోబలముచే నింద్రాది దేవతలను దాసులవలె స్వాధీనము చేసుకున్నవారు. మీరలిరువురు శమదమ తప శ్శౌచాది గుణాన్వితులరు. మా తల్లి పతివ్రతాశిరోమణి. పతివ్రతలయిన స్త్రీలకు విధి విష్ణురుద్రులుకూడ భయపడు చుందురు. మీ రిరువురు నే పాపముచే కుష్ఠవ్యాధి నొంది దుఃఖించు చుండి రనిన, నపుడు శివశర్మ యెవరికైనఁ గర్మ ఫల మనుభవింపకఁదీరదు. కావున మా శరీరము నుష్ణోదక ముచేఁ బ్రక్షాళనముచేసి శోధింపుము. పితృభక్తి తత్పరుండవు గావున మమ్ములను సంరక్షింపుమని చెప్పెను అపుడు సోమ శర్మ వారిశ్లేష్మమూత్ర ఘురీషాదులను శోధించి; నదికిఁదీసికొని వెళ్లి యధావిధిగా వేదోక్తాఘమర్షణాదులచే స్నానముఁ జేయించి;పితృతర్పణాదినిత్యకర్మములను గావింపఁజేసి;సకర్పూ రాగరు చందనాదులచే మేను నలంకరించి మృష్టాన్నమును భుజింపఁ జేసి వస్త్రపుష్పాలంకృతంబైన శయ్యాతలంబునఁ బరుండబెట్టి పాదసంవాహనమును గావించు చుండెను.

అపు డతని జననీజనకు లిరువురు దుఃఖదాయకంబైన నిష్ఠురాలాపములచే దూరుచు సమంజసముగా మాకు సేవ చేయలేదని తిట్టుచుండెడివారు. ఒకప్పుడు కొట్టుచుండెడివారు. ఈ సోమశర్మయును బుత్రుండు కుత్సన తాడనములను సహిం చుచు, ననుదినం బీప్రకారమే సేవఁ జేయుచుండెను. ఇట్లు బహుకాల మతిక్రమించిన పిమ్మట నొకప్పుడు తనమాయచే నమృతము నపహరించి యా కలశమును దెమ్మనెను. ఆ కల శమునం దమృతము లేకపోవుటచే సోమశర్మ భీతుండై మహా విష్ణువు నారాధించి తపోబలముచే సుధాపూర్ణంబైన కలశం

బును దెచ్చి తల్లిదండ్రులకు సమర్పించి యీ యమృతపానముచే నారోగ్యము సంభవింపఁగలదు. అమృతము సకల వ్యాధులను దుఃఖములను నశింపఁజేయును. మీరిరువురు నీ యమృతము ప్రాశనము చేయుఁడని వినయముతో విన్నవించెను. అపుడతని తల్లిదండ్రు లిరువురు ప్రసన్నచిత్తులయి మహాహర్షముతో నీవాక్యమును బలికిరి.

పుత్రకా! నీవు మహాప్రాజ్ఞుండవు. కృతార్థుండవు. నీ శమదమతపశ్శౌచాదులచేతను, పితృభక్తిచేతను, గురుశుశ్రూషణముచేతను, మిక్కిలి సంతసించితిమి. నీవు గొప్పతపము నాచరించి యత్యున్నత పదము నొందఁగలవని యాశీర్వదించి సూర్యసన్నిభంబయిన దివ్యదేహమును ధరించి శ్రీ మహావిష్ణు ప్రేషితంబయిన నవరత్నఖచిత కాంచన విమానవరము నధిష్ఠించి యాదంపతు లిరువురు శ్రీ మహావిష్ణు లోకము నొంది సుఖముగా నుండిరి. అటుపిమ్మట సోమశర్మ యమనియమాన్వితుండును, బ్రహ్మతేజోయుతుండును, జితప్రాణుండును, జితేంద్రియుండును, జితాహారుండును నగుచు సమాధినిష్ఠాగరిష్ఠుండై యుండె. ఆతనికిఁ గాలమాసన్నమగు నాకసమయంబున దంష్ట్రాకరాళముఖులయిన దానవులు ఘోరశబ్దంబుల నుచ్చరించుచు నతిభయమును గలుగఁజేసిరి. మరణకాలమందే బుద్ధి యుండునో యాగతి సంభవించుఁ గావున రాక్షసభయాన్వితుండై మృతుండవుటచే హిరణ్యకశిపునకుఁ దనయుఁడై దానవయోనియందుఁ బుట్టెను. ఆతనయునకు హిరణ్యకశిపుండు ప్రహ్లాదుండని పేరుబెట్టెను. ఈ ప్రహ్లాదునకు నారదుండు మాతృగర్భమం దుండునపుడు మహావిష్ణుమహిమ

మును, భక్తిమార్గమును, బోధించెను. నారదోపదేశముచే బాల్యము మొదలుకొని విష్ణుకథా శ్రవణకీర్తన స్మరణ పూజా వందనాదులను సలుపుచు విష్ణుభక్తులలో నగ్రగణ్యుఁడయ్యెను.

విష్ణుద్వేషముచేఁ బ్రహ్లాదునియందు ద్వేషముకల వాఁడై హిరణ్యకశిపుండు దుష్టనిగ్రహతత్పరుండైన భగవంతునిచే నిహతుండయ్యె. పిమ్మట ఆశ్రితజన కృపాసాగరుండును భక్తార్తి భంజనుండును దీనరక్షకుండును శ్రీ మన్నారాయణావతారుండును నగు లక్ష్మీనరసింహుండు నీ భక్తికి నేను సంతసించితిని; అభీష్టమయిన వరము నొసంగెద వేడుమనిన, నిష్కామత్వము నొసంగుమని వేడెను. అపుడు లక్ష్మీసహితుండైన యానరకేసరి నీవు నిష్కాముండవైనను నొకమన్వంతరము పుత్రపౌత్రాదులతో సుఖముగా సుతలమున నివసింపుము. అటుపిమ్మట నదితికశ్యపులకుఁ దనూజుండవై జనించి యింద్రుండని వసుదత్తుండని యాఖండలుండని పాకశాసనుండనియు నామములచేఁ బ్రసిద్ధినొంది సురసిద్ధ సాధ్యయక్ష కిన్నర గరుడగంధర్వులు పొగడ మహర్షులచే నింద్రపదమందభిషిక్తుండవై చిరకాల మింద్రపదసుఖము ననుభవించి మోక్షసామ్రాజ్యము నొందఁగలవని యానతిచ్చి యంతర్హితుండయ్యె.

## దనుజనాశముచే దనువు కశ్యపధర్మపత్ని దితి మందిరముకుఁ జనుదెంచి దితితోఁగూడ విలపించుట

దనువను కశ్యపధర్మపత్ని దితి మందిరమున కరుదెంచి దితికిఁ బ్రణామముగావించి పుత్రశోకముచే విలపించెను.

అపుడు దితి, పుత్రవంతులయిన స్త్రీ లేక పుత్రుని చేతనే యమందానందము నొందుచుండిరి. నీవనేక బలపరాక్రమ సంపన్నులయిన పుత్రులు కల్గియుండియు నిట్లు విలపించుటకుఁ గారణంబేమనిన దనువు దితితోఁ జెప్పఁదొడంగె.

దేవదానవులు క్రోధవశమున ననేక వాసరంబు లహర్నిశం బెడతెగకఁ బోరు నెడ సురాసురలచే దుర్జయంబగుఁ గాలనేమి ప్రముఖ దానవ సైన్యంబు చక్రపాణి సాహాయ్యము కల దేవగణంబుచేత మడసెను. అగ్నిచే కాష్ఠచయము దగ్ధంబైన చందంబున నీ తనయులును నా తనయులును మహావిష్ణు సుదర్శనాస్త్రజ్వాలామాలికచే నిశ్శేషముగా దగ్ధులయిరి మన సవతియగు నదితి మనోరథమును దేవదేవుండైన చక్రపాణి పరిపూర్ణము గావించెను. వసుదత్తుండు చక్రపాణి కృపచే మిక్కిలి దుష్ప్రాపంబైన స్వర్గరాజ్యము ననుభవించుచుండె ననవుడు దితి వజ్రపాతసన్నిభంబును, నతిదారుణంబును నగు, నీవృత్తాంతమును విని, నేలకొఱగి మేను మఱచెను. కొంత సేపటికిఁ దెలివొంది పుత్రశోకముచే జరకాలము విలపించెను. అట్టియెడఁ గశ్యపుండు కడువడిం బాఱుతెంచి వారిరువురను గాంచి, పురాకృతకర్మఫలం బెవరికి ననుభవింపక తీరదు. మీ పుత్రులు శమదమ దయాధర్మ సత్యశౌచవర్జితులు గావున వారి యధర్మముచేతనే వారు మడసిరి. సురలును, చక్రపాణియు, నిమిత్తమాత్రము. కాఁబట్టి మీరిరువురు దుఃఖింపవలదు. శోకము, సత్యమును ధర్మములను నశింపఁజేయును. ధర్మక్షయమువలన బుణ్యము నశించును. పుణ్యక్షయమువలన

దుఃఖముల నొందెదరు. సంసారంబు దుఃఖబహుళంబని భావించి యనేకులయిన మహర్షులు సంసారంబు రోసి, యిలు వాసి యెల్లసిరులు నెడబాసి, సంసారదుఃఖ నివృత్తికొఱకు విజనప్రదేశమందుఁ దపం బాచరించు చుందురని తగుమాటల వారి నూరార్చి విరమించెను.

కశ్యపుఁడు దితిదనువులకు నధ్యాత్మవిద్య నుపదేశించుట

అపు డావాక్యములను దితియు దనువును విని కశ్యపు నితో నిట్లనిరి. మీరు చెప్పిన మాటలు ధర్మాన్వితంబు లయినను నజ్ఞానమువలన దేహాభిమానముచే నిట్లు దుఃఖపడు చుంటిమి. సపత్నియుఁ బత్పుత్రుండును దానవులకు దుష్ప్రా పంబగు నైంద్రపదము నొంది స్వర్గసుఖము ననుభవించు చున్నారు. మాకుఁ బుత్రులయిన వారు దేవ దానవ సంగ రంబున దివ్యాస్త్రనిహతులయి; మృతులయిరి. మా దురవ స్థను జూచి మాకు సవతియగు నదితి మమ్ములను బరిహసింపఁ గలదని తలంచి యీ పరిహాసపరాభవ దుఃఖముకంటెఁ; మర ణమే, సుఖకరంబు గావునఁ బ్రాణత్యాగముఁ జేసెద మని చెప్పిరి. కశ్యపుం డామాటలను విని దితిదనువులతో నిట్ల నియె. సకలజీవులకు శమదమదయాధర్మ సత్య శౌచంబు లైహికాముష్మిక సుఖసాధనంబులని మన్వాది స్మృతుల యందుఁ జెప్పఁబడినవి. నీ పుత్రు లట్టి గుణవర్జితు లగుటచే స్వర్గపదరహితులయిరి. సకలజీవులును దామాచరించు కర్మము వలన సుఖదుఃఖముల నొందుదురు. ఈ యర్థము నాలోచించి శోకమోహములను బరిత్యజించి సకలజీవులు సుఖముగానుండ వలయు, అదియునుంగాక మీ కధ్యాత్మవిద్య నుపదేశించె

దను. దానివలన నజ్ఞాన గ్రంధి నశించును. మీ రిరువురు సావధాన మతితో వినుండు.

నిత్యుండును, నిర్గుణుండును, నిర్వికారుండును, సర్వవ్యాపకుండును, సర్వాంతరాత్ముండును, చిదానందమయుండును నగు పరమాత్మయందు నధ్యస్తంబును, ననాద్య నిర్వాచనీయంబును నగు వైష్ణవ మహామాయాశక్తిచే మహత్తత్వాహంకార పంచతన్మాత్రంబులును, పంచీకృత పంచమహాభూతంబులును, గ్రమముగాఁ బుట్టినవి. పంచీకృత పంచమహాభూతంబులవలన భూరాదిలోకంబులును స్థూలశరీరంబులును భౌతికగణంబులును జనించినవి. అపంచీకృత పంచమహాభూతంబుల వలన జ్ఞానేంద్రియ పంచకంబును గర్మేంద్రియ పంచకంబును బ్రాణవాయు పంచకంబును మనోబుద్ధులును జనించినవి. ఇదియే లింగశరీరంబని సూక్ష్మశరీరంబనియుఁ జెప్పంబడుమాయాశక్త్యవస్థావిశేషమే యవిద్యయనఁబడును. దీనినిఁ గారణశరీరమందురు. పరమాత్మ శరీరత్రయముతో నైక్యభ్రాంతి నొంది, జీవుండై కర్మఫల భోక్తయగును. ఈ జీవునకు జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలు గలవు. ఈ జీవుండు జాగ్రదవస్థాభిమానియై విశ్వుండనియు స్వప్నావస్థాభిమానియై తైజసుండనియు సుషుప్త్యవస్థాభిమానియై ప్రాజ్ఞుండనియుఁ జెప్పంబడును. శరీరత్రయ తాదాత్మ్యాభిమానియైన జీవుండు గురూపదిష్టంబైన మహావాక్యములచే నపరోక్షజ్ఞానయుక్తుండై పునరావృత్తిరహితంబైన మోక్షము నొందఁగలఁడు.

ప్రకృతి మహదహంకార పంచతన్మాత్రంబులును, శబ్ద స్పర్శ రూపరస గంధాన్వితంబులయిన పంచీకృత పంచమహా భూతంబులును, జ్ఞానకర్మేంద్రియములును, బరమాత్మగత చైతన్య శక్తిప్రేరితంబులై స్వస్వవ్యాపారమందు సమర్థంబులగు చున్నవి. కాఁబట్టి మాయోపహితంబైన చైతన్యశక్తిఁ పొంది భౌతికంబును రేతఃపరిణామంబును నగు మాంసపిండంబును, మలమూత్ర క్రిమిజాల సంకులంబయిన మాతృగర్భమందు గ్రమముగా వృద్ధినొందించి స్థూలశరీరమును జనింపజేయును.

## కశ్యపుండు దితిదనువులకుఁ బిండోత్పత్తిక్రమంబును మోక్షమార్గంబును బోధించుట

ఆస్థూల శరీరమందు జీవుండు నేను, నాదియను నహంకార మమకారంబులచే నాఱవ మాసము మొదలుకొని జఠరానల సంతప్తుండై దుఃఖమును ననుభవించు చుండును. ఈ జీవుం డధోముఖుండై మాతృగర్భమం దొక దిక్కున నుండక జఠరానల సంతాపముచే దిరుగుచు నతిదుఃఖాక్రాంతుండై విలపించుచు నిట్లను కొనుచుండును. ఓ పరమేశ్వరా! నేనుఁ జిరకాలమునుండి జననమరణ ప్రవాహముచే నిమిత్తంబైన దుఃఖము ననుభవించితిని. అనేక గర్భంబులందు నివసించితిని. జనించిన పిమ్మట వివిధాహారముల ననుభవించితిని. అనేక మాతృస్తన్యములం బానముఁ జేసితిని. అనేక జన్మములందు కుటుంబ భరణముకొఱకై న్యాయాన్యాయములచే ధనము నార్జించితిని. కాని యొకక్షణమైనను భక్తార్తి భంజనుండవైన నిను స్మరింప నైతిని. ఇపుడు మహత్తరంబైన గర్భవాస

దుఃఖము ననుభవించు చుంటిని. నిరయసన్నిభంబైన గర్భంబు వలన నిర్గమించిన పిదప నార్తిహరుండవైన నిన్నే, సర్వకాల మందుఁ జింతించెదను. సజ్జనసంగతిచే సత్కర్మముల ననవర తముఁ జేయుచుందును. అని తలంచుచు నీజీవుండు పూర్వ జన్మంబులందుఁ దా నాచరించిన కర్మంబులను స్మరించి యూపిరి సలుపక దుఃఖించు చుండును. మాతృగర్భంబునందు న్నపు డీజీవుండు జరాయు పరివేష్టితుండై నాభిసూత్రాల్ప రంధ్రముచే మాతృభుక్తాన్న సారంబువలన స్వకృతకర్మపాశ బద్ధుండై మృతినొందక జీవించి యుండును. ఎనిమిది తొమ్మి దవ మాసంబులందు శరీరము పెరుగుటచే మాతృగర్భమం దవకాశము స్వల్పమగుటవలన ననవరతము దుఃఖించుచుండును.

అటుపిమ్మట నీ జీవుండు పదియవ మాసంబున దుర్గంధ వ్రణమువలన క్రిమిపడిన చందంబున బ్రసూతివాయు ప్రేరి తుండై భూతలంబునం బడి యేడ్చు చుండు. అటుపిమ్మట బాల్యమందు మశక మత్కుణ మక్షికాదులచే ననేక క్లేశముల నొంది క్రమముగా విద్యాభ్యాస క్లేశము ననుభవించి యావ నంబున జిహ్వోదరాదిపరాయణుండై దుస్త్యజంబైన విష యాశా మహాపాశబద్ధుండగుచు స్రక్చందన వనితాది భోగ ముల ననవరతము ననుభవించు చుండును. ఇట్లు కొంత కాలము గడచిన పిమ్మట; నీ జీవుండు విరక్తింజెంది నిరతిశయా నంద ప్రేప్సారూపంబైన మోక్షేచ్ఛచే సద్గురూప సదనంబుఁ జేసి తదుపదిష్ట వాక్యంబుల వలనను, వాసుదేవ ధ్యానపూజా వందనాదుల వలనను, జ్ఞాన విజ్ఞాన సంపన్నుండై యజ్ఞాన

నాశము నొంది కామక్రోధాది రహితుండై ముక్తిం జెందును.

## కశ్యపుండు దితి దనువులకు శోకమోహ నివృత్తికొఱకై భగవంతుని భజింపుమని బోధించుట

ఇట్లు కశ్యపుం డాత్మతత్త్వమును బోధించి దితి దనువులతో వెండియు నిట్లనియె. సచ్చిదానంద రూపుండగు పరమాత్మ, నిత్యుండును; నిర్గుణుండును; నిర్వికారుండును నచింత్య మాయాశక్తియుక్తుండును; నగుటచే నెల్లపుడును దేహేంద్రియ ప్రాణమనోబుద్ధులతో పారమార్థిక సంబంధ శూన్యుండు గావున, నసంగుండై స్వప్రకాశ మానుండై యుండు. ఆత్మకు దేహేంద్రియాది సంబంధంబు మాయాకల్పితంబు గావున భార్యాపుత్రాదులతోఁగూడ నేమియు సంబంధము లేదని తెలిసికొనవలెను. ఆత్మ మృగపక్షి విడ్వరాహాది దేహములందును దేవతిర్యఙ్మనుష్యాది దేహములందును సమముగాఁ బ్రకాశించును. కావున నొకరియందు ప్రేమయును, మఱియొకరియందు ద్వేషమును లేనిది.

ఆత్మ పరిశుద్ధంబైనదైనను అవిద్యాకంబైన దేహతాదాత్మ్యాభిమానంబుచే జీవభావంబునొంది రాగద్వేషయుక్తంబై పుణ్యపాప కర్మముల నాచరించి సుఖదుఃఖముల ననుభవించుచుండు. నీపుత్రులు సత్యశౌచ దయాధర్మ వర్జితులగుటచే రణరంగమందు దేవతలచే హతులై మృతులయిరి. ధర్మము శ్రీమహావిష్ణువునకు శరీరము. సత్యము హృదయము. దేవతలు

సత్యధర్మాన్వితులు. కావున శ్రీహరి కృపచే నైంద్రపదము నొందిరి. సత్యశౌచ దయాధర్మసహితులయిన సత్పురుషులు, శ్రీహరి కృపాపాత్రులయి యెల్లపుడు దివ్యభోగముల ననుభవింపఁ గలరు. దయాధర్మాది విముఖులు, భగవదాజ్ఞా పరతంత్రులయి హీనయోనులందు జనించెదరు. నీకుఁ బూర్వమందు నేను బోధించిన నిర్వికారాసంగ చిద్రూపుండైన పరమాత్మయే శ్రీమహావిష్ణువు. ఆమహానుభావుండు సత్యశౌచ దయాధర్మతపంబులచేఁ బ్రసన్నుండై సకలాభీష్టముల నొసంగి రక్షింపఁగలఁడు. కావున నీవు దుఃఖమును బరిత్యజించి ధైర్యముతో మధుసూదనుని భజింపుము. శోకమోహములను విడిచి ధర్మము నాశ్రయింపు మనినఁ దద్వచనంబుల నాకర్ణించి యా దితిదనువు లిరువురు శోకమోహములను బరిత్యజించి భగవంతుని సేవించుచు ధైర్యముతో నుండిరి.

## దేవదానవ సంగరహతావశిష్ట దానవవృత్తాంతమును జెప్పుట

దేవదానవ మహాసంగ్రామంబున హతావశిష్టులయిన దానవుల వృత్తాంతముం జెప్పుమనిన శౌనకునితో సూతుం డిట్లనియె. దానవులందఱు గశ్యపుని కడకేగి యతనికి సాష్టాంగ దండప్రణామంబులు గావించి యిట్లు విన్నవించిరి. ఓ తండ్రీ! దేవతలును, మేమును నీ తనయులమైనను దేవతలధిక తేజోబలాన్వితులయి స్వర్గసుఖము నొందుచున్నారు. మేము వారికంటె నధిక బలవీర్యశౌర్యాన్వితులమైనను సంగ్రామంబున వారిచే నిహతులమయి పరాభవము నొందుచున్నాము. దీనికిఁ గారణంబును వివరించి బోధింపు మనిన,

నపుడు వారితోఁ గశ్యపుఁ డిట్లనియె. దేవతలకు జయకారణం
బును జెప్పుచున్నాను. సావధాన చిత్తులరయి వినుండు.

పుణ్యపాప కర్మంబులచే సకలజనులు స్వర్గనరక దుఃఖం
బుల ననుభవించు చుందురు. సకలజీవులకు, శమదమ తపస్స
త్యశౌచ యాగదానహోమాది ధర్మంబులు నిరతిశయ సుఖ
సాధనంబులు. అధర్మంబు సకలజీవులకు సున్నత పదభ్రంశ
కరంబు. మీరలు సత్యధర్మవర్జితులరై బాహుబలపరాక్రమ
ములచే బలాత్కారముగా స్వర్గలోకము నాక్రమించితిరి.
అధర్మాన్వితులగుటచే తనే స్వర్గపదభ్రష్టులయితిరి. శమదమ
తపశ్శౌచాది ధర్మంబు లెవరియందుండునో వారు భగవదను
గ్రహముచే జయము నొందెదరు. మధుసూదనుం డేపక్షమం
దుండునో యాపక్షమందే జయము సంభవించును. కాఁబట్టి
మీరలందఱుఁ దపస్సత్య శౌచధర్మాన్వితులరై మహావిష్ణు
వుతో వైరమును విడిచి తత్కీర్తన స్మరణ పూజావందనా
దులచేఁ బరమసిద్ధిం బడయఁగలరనిన దద్వచనముల నాకర్ణించి
మహారాజస్కులయిన కొందఱు దానవులు త్వరాన్వితులయి
పితృపాదములకు నమస్కారము గావించి, పరస్పర మాలోచిం
చుకొని శత్రువైన గోవిందునారాధించుట మాకు సమ్మతంబు
కాదు. శత్రుసేవాచరణంబు మరణంబు కంటే నధిక దుఃఖ
దాయకంబు. సర్వఫలదాయకంబును దుష్కరంబును నగు
ఘోరతపంబాచరించి పాపచిత్తుండగు గోవిందుని జయించి
సర్వదేవతలను సంహరించి శాశ్వతముగా నైంద్రపదము
నొందఁగలమని చెప్పిరి.

బలిచక్రవర్తి మొదలయిన మఱికొందఱు దానవులు, మాధవునితో వైరంబు సర్వానర్థకరంబు గావునఁ దద్వైరులు ఘోరపాపయోనులయందు జనించి యైహికాముష్మిక సుఖముల నెడఁబాయుదురు. యాగదాన తపోహోమాదులచే ననేకులు మాధవు నారాధించి శాశ్వతముగా వైకుంఠలోక సుఖము నొందుచున్నారు. శ్రీహరి కీర్తనస్మరణ పాదార్చన వందనంబులు సకలశ్రేయస్సాధనంబు లని చెప్పి మహావిష్ణునిఁ జిరకాల మారాధించి సుతలంబున సుఖముగా నుండిరి. వైరులయిన దానవులు గిరిదుర్గ సానువులయందు ఘోరతపం బాచరించి తపోబలముచే వరముల నొంది, చిరకాలము వివిధ భోగముల ననుభవించి శ్రీహరి సుదర్శనాస్త్ర జ్వాలామాలికచే దగ్ధులైరి.

## కౌశికపుత్రుండైన సోమశర్మని వృత్తాంతము

శౌనకుండు సోమశర్మోపాఖ్యానంబును జెప్పుమనిన శౌనకునితో సూతుం డిట్లనియె. పరమపావనంబైన నర్మదాతీరమందలి వామనక్షేత్రమందు కౌశికుండను విప్రునకు సోమశర్మయను తనూజుండు గలఁడు. ఆసోమశర్మ ధనపుత్రాది విహీనుండగుటచే దారిద్ర్యమువలనఁ జింతించుచుండెను. అతనికి చ్యవనపుత్రికయగు సుమన యను భార్యకలదు. ఆమె తనపతి నవలోకించి వ్యామోహము, సర్వకార్యములను నశింపఁ జేయును. మనశ్చింత, శరీరమునుగూడ దగ్ధము జేయును, గావున మీమనోవ్యథకుఁ గారణంబేది, యనిన సోమశర్మండు భార్యతో నిట్లనియె. ఈజన్మము నందు నాకు ధనపుత్ర పశు

సంపదలు లేకపోవుటచే మిక్కిలి దుఃఖము గలుగుచున్నది. అనేకులు పుత్రవంతులయి ధనధాన్యక్షేత్రములు గలిగి సుఖవంతులయి యుండిరి. పూర్వజన్మకృతంబైన పాపంబుచే నాకట్టి సుఖంబు లేదని దుఃఖపడుచుంటి నని చెప్పెను. ఆమాటలను విని భార్య పతి నూరార్చుచు నిట్లు పలికెను—

ఓ ప్రాణనాథా! సకలజీవులు విషయాశా మహాపాశబద్ధులయి సంసారదుఃఖముల ననుభవించుచుందురు. విషయాశ మిక్కిలి దుస్త్యజంబయినది. దానిని బరిత్యజించినవారు జననమరణ ప్రవాహమువలన విముక్తులయ్యెదరు. సంసార వృక్షమునకు నజ్ఞానము మూలకారణము. దేహాత్మభ్రాంతి యంకురము. రాగము పల్లవము. తానాచరించు కర్మము జలసేకము. దేహము ప్రమాను. ప్రాణాపానాది వాయువులు శాఖలు. ఇంద్రియసముదాయ మగ్రములు - శబ్దస్పర్శరూపరస గంధములు పుష్పములు - సుఖదుఃఖములు ఫలములు - భోక్తయైన జీవుఁడు పక్షియైనవాఁడు - మోహము వలన లోభము; లోభమువలన నసత్యము; అసత్యమువలనఁ బాపము; పాపము వలన దుఃఖము; గలుగు చుండును.

న్యాసస్వామి న్యాసాపహర్తకుఁ గుణవంతుండును, రూపవంతుండును నగు పుత్రుండై జనించి జననీజనకులకు నభిమతంబులయిన కార్యంబులను జేయుచు న్యాసభూతంబైన సర్వధనంబు ననుభవించిన పిదప ధనసంబంధము లేక పోవుటచే మృతినొందును. ధనసంబంధంబుచేఁ బుత్రుఁడై జనించిన వాఁడు పూర్వజన్మమునందు నేను దాచిపెట్టిన ధనమును వీ

రపహరించుటచే వీరికి నేఁ దనయుండనై యభిమతంబులయిన సకలకార్యంబుల నాచరింతిని. మదీయంబైన ధనమునంతయు ననుభవించి పోవుచుంటిని. వీరికి నేనెక్కడఁ దనయుఁడను, వీరలు నా కెక్కడి తలిదండ్రు లని తలంచుచు; మృతినొందిన పిదపఁ బరిహసించి పోవును.

ఋణసంబంధముకల మరికొందఱ పుత్రులను జెప్పుచున్నాను వినుఁడు. ఋణదాత ఋణప్రతిగ్రహీతను ధనము నిమ్మని నిష్ఠురోక్తులచేఁ బీడించినయెడల ఋణప్రతిగ్రహీతకుఁ బుత్రుఁడై జనించి జననీజనకులను నిష్ఠురోక్తులచేఁ బీడించి మృష్టాన్నపాన శయనాది భోగముల ననుభవించు చుండును. జాతకర్మ నామకరణాన్నప్రాశనాది కర్మముల చేతను, చౌలోపనయన వివాహాదులచేతను బూర్వజన్మమందుఁ దా నిచ్చిన ధనమునంతయు ననుభవించి మృతుండగును. ఇట్లు పశు పత్నీ పుత్ర క్షేత్ర విత్తాదులు ఋణానుబంధంబుచేతనే సంభవింపఁ గలవు. ఋణదాత ప్రియోక్తులచే ఋణప్రతిగ్రహీతను ధనము నిమ్మని యడిగినయెడల నా ప్రతిగ్రహీతకుఁ బుత్రుండై జనించి ప్రియోక్తులచేతను, ప్రేమచేతను జననీ జనకులను సేవించుచుండును. వారు మృతులయిన పిమ్మట శ్రాద్ధాదికర్మంబులను శ్రద్ధాభక్తులతోఁ జేయుచుండును. తల్లిదండ్రులును; భార్యాపుత్రులును; భృత్యులును; బంధువులును; పశుక్షేత్ర విత్తాదులును నన్నియు ఋణానుబంధము కలవని తెలిసికొనవలెను. పూర్వజన్మమందెవరి ధనమును మనము తీసికొనలేదు. కాఁబట్టి యెవరితోను మనకు రాగద్వేష సంబంధము లేదు. జీవుండు

కూటస్థాసంగ చిద్రూపుండు. అట్టి జీవాత్మకు స్వజనముతోఁ గాని బంధుజనముతోఁగాని సంబంధ మేమియును లేదు. బంధు భార్యాపుత్రాదులందఱు దేహతాదాత్మ్యాధ్యాసముచే దేహ సంబంధులు గాని యాత్మసంబంధులుగారని తెలిసికొని యనర్థ కరంబైన చింతను వీడి శమదమంబులను బొందుమనిన; మఱల సోమశర్మ సుమనతో నిట్లనియె. నీవుచెప్పిన మాట లన్నియు సత్యమైనవి. సకల వేదశాస్త్ర సారంబగు నివృత్తి మార్గమును బోధించితివి. పూర్వకాలంబున సాధువులయిన యనేకమంది విద్వాంసులు; ప్రవృత్తిమార్గము నవలంబించి యనేక సుకృతకర్మముల నాచరించి పుత్రమిత్ర కళత్రాది సంయుక్తులయి ధర్మార్థకామమోక్ష రూపంబగు చతుర్విధ పురుషార్థముల నొందిరి. ఏ యుపాయముచే మనము ధన పుత్రాది లాభము నొందెదమో యట్టి యుపాయమును జెప్పు మనిన; సుమన సోమశర్మతో నిట్లనియె.

నివృత్తిమార్గంబును ప్రవృత్తిమార్గంబును శ్రుతిస్మృతి విహితంబులు – నివృత్తిమార్గమన; జ్ఞానమార్గము – ప్రవృత్తి మార్గమన; కర్మమార్గము. అత్రి మరీచి కశ్యప వసిష్ఠ విశ్వా మిత్రాదులందఱును బ్రవృత్తి మార్గ నిరతులయి చతుర్విధ పురుషార్థముల నొందిరి. ఇపుడు ప్రవృత్తిమార్గమును జెప్పు చున్నాను 'పుత్రేణ లోకాన్ జయతి' యను వేదవాక్యముచేఁ బుత్రుండు లోకజయమునకు సాధనంబని చెప్పంబడినది. గుణ వంతుఁడును విద్వాంసుఁడును నగు నొక పుత్రునిచేఁ గులము తరించును. గుణవిహీనులయిన యనేక పుత్రులచే నేమియుఁ

ప్రయోజనము లేదు. రాత్రియందుఁ జంద్రునిచే నంతరిక్షము ప్రకాశించు చందంబున సత్పుత్రునిచేఁ గులము ప్రకాశించును. పూర్వపుణ్యముచే సత్కులము. సత్పుత్రుఁడు, ప్రియమైన భార్యయు, పశుక్షేత్ర విత్తాదులును, సంభవించు చున్నవి. కాఁబట్టి పుణ్యకర్మము నాచరింపుము. పుణకర్మముచేత నే సత్కులమందు జననమును ననాయాస మరణమును స్వర్గాది లోక సుఖమును బొందెదరు. ఇటుపిమ్మట ధర్మస్వరూపమును ధర్మము నాచరించు ధర్మమూర్తులను జెప్పెదవినుము.

శమదమ తపశ్శౌచ సత్యంబులును వేదాధ్యయనాగ్ని హోత్రాతిథి పూజన బ్రహ్మయజ్ఞ వైశ్వదేవాత్మకంబగు పంచయజ్ఞంబులును యమనియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణంబులును, యథాశక్తిగాఁ జేయు దానంబులును, ధర్మస్వరూపంబని శ్రుతిస్మృతులయందుఁ జెప్పంబడినది. ఇట్టి ధర్మము నాచరించు మహాత్ములు లనేకులు గలరు. వారు ధర్మమూర్తులు. తొల్లి దుర్వాసుండును, దత్తాత్రేయుండును, యమనియమాది గుణాన్వితులయి వివిక్త మహారణ్యము లందును గిరిగుహాలందును జలమధ్యమందును ఘోరతపం బాచరించిరి.అపుడు వారిరువురిలో దుర్వాసుండు ధర్మఫలసిద్ధిం గానక ధర్మదేవతను; నీవు ముందుగాఁ జండాలుండవై జనించి పిమ్మట రాజన్యుండవై పుట్టి మూఁడవ జన్మంబున శూద్రుం డవై జనింప గలవని శపించెను. అపుడు ధర్మదేవతారూపుం డగు యమధర్మరాజు విప్రవేషమును దాల్చి దండహస్తుండై ప్రత్యక్షమయి దుర్వాసునితో నిట్లనియె. అహింసా సత్య

బ్రహ్మచర్యంబులును శమదమయమ నియమాదులును, మేధా శ్రద్ధా దయాప్రజ్ఞాదులును, సర్వాభరణాలంకృతంబయిన స్త్రీ పురుష రూపంబులను దాల్చి మీకుఁ బ్రసన్నంబు లయినవి. నేనుఁగూడ మీకుఁ బ్రసన్నుండనైతిని. ధర్మమును రక్షింపుమని వేడిన నపుడు దుర్వాసుండు ధర్మదేవతతో నిట్లనియె. చిరకాలమునుండి తపఃక్లేశమును సహింపలేకపోవుటచేతను; దైవకృతంబైన భావికాల కర్మఫలంబు ముఖ్యముగ ననుభవింపఁ దగినదాటచేతను; నిట్లు శపించితిని. నా శాప మమోఘము. నీవు భావికాలమం దనుభవింపక తీరదనిన తద్వచనముల నాకర్ణించి ధర్మదేవత పరివారంబుతోఁ నంతర్హితంబయ్యె.

అటుపిమ్మట సోమశర్మ యీ వృత్తాంతంబును విని సుమనతో నిట్లనియె. ఓ లలనామణీ! ధర్మదేవుం డెపుడు శాపలబ్ధంబులయిన మూఁడుజన్మంబులం బొందెను. ఆ జన్మంబు లెవ్వి చెప్పుమనిన, సుమన సోమశర్మతో నిట్లనియె. ఓ ప్రాణనాథా! త్రిశంకుపట్టియైన హరిశ్చంద్రుండు విశ్వామిత్రపీడితుండై రాజ్యభ్రంశము నొంది వారాణసీక్షేత్రమున కరిగెను. అపుడు ధర్మదేవత వారాణసీ క్షేత్రమందుఁ జండాలరూపము నొంది వీరబాహువై జనించి హరిశ్చంద్రుని భృత్యునిగాఁ జేకొనెను. పిమ్మటఁ గుంతీదేవికి ధర్మరాజై జనించె. శూద్రయోనియందు జనించి విదురుండయ్యె.

బ్రహ్మచర్యస్వరూపమును బోధించుట

ఓ భామినీ! బ్రహ్మచర్యస్వరూపమును నాకు విస్తరించి చెప్పుమనిన సుమన పతితో నిట్లనియె. ప్రథమాశ్రమమందు

స్త్రీవిషయ స్మరణకీర్తన ప్రేక్షణ గుహ్యాభాషణాదులను బరిత్యజించుట బ్రహ్మచర్య మనఁబడును. యథార్థసంభాషణాభిరతియు సత్కర్మాచరణంబును, స్వకళత్రమందు ఋతుకాలాభిగమనంబును, గృహస్థునకుఁ బ్రహ్మచర్యమనఁ బడును. ప్రతిదినమందు త్రిషవణ స్నానంబును, విహిత నిత్యకర్మానుష్ఠానంబును, దైవవశముచేఁ బ్రాప్తంబైన కందమూల ఫలభక్షణంబును, నధశ్శయనంబును, విజనప్రదేశ తపశ్చరణంబును, వానప్రస్థులకుఁ బ్రహ్మచర్య మనఁబడును. ఇంద్రియ జయము సత్యసంభాషణము పరధన వర్జనము శమదమ తితిక్షాదికము వేదాంత వాక్యశ్రవణము మొదలయినవి యతులకుఁ బ్రహ్మచర్య మనఁబడు దాన ధర్మంబులును, అహింసాస్తేయ శమదమ సత్య శౌచంబులును, దపస్సంతోషాస్తిక్య దేవపూజనంబులును, సర్వ దుఃఖ సహనంబును, గురుశుశ్రూషణంబును, శిష్టజను లాచరించు ధర్మంబులు. ఈ ధర్మంబుల నాచరించు సుజనులనాయాసముగా నింద్రాది లోక సుఖమునుఁ జిరకాల మనుభవించి పునరావృత్తిరహితంబయిన ముక్తిం బడయగలరు. శబ్దస్పర్శరూపరస గంధములనెడి విషయములయం దాశగలుగుటకు మనసు మూలకారణము. అట్టి మనసు కామక్రోధ యుక్తంబై యెల్లపుడు నింద్రియార్థంబులందుఁ దగులుకొని యుండును. విషయాశామహాపాశ బద్ధుండైన పురుషుండు; పుణ్యకర్మ విహీనుండగు వాఁడు నిరంతరము పాపకర్మముల నాచరించి యపకీర్తినిఁ బొందును. అపకీర్తిచేఁ బరలోకంబున దుఃఖంబు నొందును, కాఁబట్టి యింద్రియార్థములయం

దాసక్తిని విడిచి సజ్జనసంగమును జేయుఁ బురుషులు సర్వ లోకములయందును సౌఖ్యంబు నొందఁగలరు.

ఓ కాంతామణీ! యీధర్మంబుల నెవరివలనఁ దెలిసికొంటి వనిన; సుమన; సోమశర్మతో నిట్లనియె. భార్గవాన్వయ సంభవుండును సర్వజ్ఞుఁడును, విశారదుండునునగుచ్యవనుండను, మహామునికి నేను కుమార్తెనై జనించితిని. అతం డొకప్పుడు తీర్థాటనపరుండై తిరుగుచున్న సమయంబున నామహాత్మునితోఁ గూడ గంగాదితీర్థ సమీప ప్రదేశములందును నవిముక్తాది క్షేత్రములయందును నారామములయందును సంచరించుచు బుష్పఫలాదులచే నానందించుచుంటిని కౌశికాన్వయ సంభవుం డగు వేదశర్మయను నొక విప్రుం డరుదెంచి మా తండ్రియగు చ్యవనునకు నమస్కారము గావించి, యతనిచే నియమితాసనంబునఁ జింతాకులిత స్వాంతుండై కూర్చుండెను. అటుపిమ్మట నా భార్గవుండు యావేదశర్మను జూచి కుశలప్రశ్న పూర్వకముగా సంభాషించి, నీవు శోకాకులిత చిత్తునివలెఁ గనపడుచున్నావు. నీ మనశ్శోకంబునకుఁ గారణంబెద్ది యని యడిగినఁ బుత్రసంతతి లేకపోవుటచే నాభార్యయు నేనును, దుఃఖించుచుంటిమని చెప్పెను.

అటుపిమ్మట నొక సిద్ధపురుషుండైన మహాయోగి వారి సమీపంబునకుఁ జనుదెంచెను. అపుడు వారిరువురు లేచి మధురాక్షరంబులచేఁ గుశలంబు నడిగి యుచితాసనమందుఁ గూర్చుండ బెట్టి, యతనికి భక్తిపూర్వకముగా నమస్కారము గావించిరి. తదనంతరం బాముగ్గురును నిత్యవిహిత కర్మంబుల నాచరించి కందమూల ఫలములను భుజించి విశ్రమించిరి.

అపుడు మాతండ్రియగు చ్యవనుండు దారాపత్యక్షేత్ర విత్తాదులును, వివిధ భోగంబులును, విద్యయు నారోగ్యంబును నేధర్మమువలన గలుగునని యడిగిన నతనితో నామహాయోగి యిట్లనియె. సత్పాత్రదానంబువలన నారోగ్యంబును, ధన ధాన్యాభివృద్ధియు భార్యాపుత్ర సుఖంబులును విద్యాలాభంబును కలుగుచున్నవి. దేవపూజనంబువలనను జ్యోతిష్టోమాది క్రతు వనుష్ఠానంబువలనను జిరకాలము స్వర్గసుఖము ననుభవింప గలరు. మఱియువిహితకర్మాచరణంబును, నిషిద్ధకర్మత్యాగంబును, నింద్రియ జయంబును, నానావిధ భోగకారణంబులని చెప్పి యా సిద్ధపురుషుండు స్వాశ్రమంబున కరిగెను. అపు డీవృత్తాం తమును సుమనాపతియైన సోమశర్మ విని సంతసించి, యనా యాసమరణ మెట్లు సంభవించు ననిన, నక్కాంతునితో సుమన యిట్లనియె. శమదమ తపస్సత్యశౌచాది ధర్మంబులు గల వారును, సకలభూత దయాళురును,లక్ష్మీనారాయణులనుగాని, యుమామహేశ్వరులనుగాని, దుర్గాపరదేవతనుగాని యంగ దేవతలతోఁగూడఁ బూజించువారును, షడంగ వేదాధ్యయన సంపన్నులును, గీతాజ్ఞాన విశారదులును, ననాయాసముగా మరణమునొంది, యమధర్మరాజుచేఁ బూజితులయి, పార్షద ప్రవరశోభితంబును, రాజహంసయుక్తంబును, శ్వేతఛత్ర చామ రాది కలితంబునునగు నవరత్నఖచిత స్వర్ణవిమానము నధిష్ఠించి, స్వర్గాది లోక సుఖము నొందఁగలరు. సకాములైనయెడల పరి శుద్ధులయిన శ్రీమంతుల గృహమందు జనించి యెల్లప్పుడు; సుకృతకర్మముల నాచరించి, మరల దేవలోకము నొందెదరు

నిష్కాములయినయెడలఁ బునరావృత్తి రహితంబగు బ్రహ్మాది లోకముల నొందఁ గలరు.

## పాపాత్ములమరణమును యమలోక దుఃఖమును జెప్పుట

పాపాత్ముల మరణంబును బరలోకగమనంబును జెప్పు మనిన, సుమన సోమశర్మతో నిట్లనియె పరస్త్రీ పరధనముల నపహరించు వారును, దయాసత్యశౌచ వర్జితులును, వేదశాస్త్ర విహితకర్మములను బరిత్యజించు వారును, తల్లిదండ్రులను; బరిత్యజించు వారును, వేదశాస్త్ర పురాణాదులను; నిందించు వారును, సత్పురుషులను దూరువారును, నపవిత్ర స్థలముల యందు నధికశ్లేష్మముచే మిక్కిల బాధపడుచు మోహిత చిత్తులయి కొంచెమయిన స్మృతిలేక కంఠమందు ఘురఘుర ధ్వని బుట్టి యూపిరి సలపక, మరణము నొందెదరు.

అటుపిమ్మట యమకింకరులు సూర్యకిరణంబులచేతను; నగ్నిజ్వాలలచేతను; నతితప్తంబగు మార్గంబున గొనిపోవుచు; మిక్కిలి పరుషంబులయిన వాక్యములచే నిందించుచు; గదా దండంబులచేతను; బరశ్వధంబులచేతను; గశాభిఘాతంబుల చేతను; గొట్టుచుందురు. క్షుత్పిపాసాదుఃఖంబులను సహింపఁ జాలక రోదనముఁ జేయుచుఁ గ్రమముగా సంయమనీపురంబున కేగి యముని‌ఁ గాంచెదరు. కృష్ణాంజనగిరిసన్నిభుండును; సర్వ రోగాభిమానదేవతా పరివృతుండును; చిత్రగుప్త సహితుం డును, గదాహస్తుండును, భీతవసనుండును; మహిషారూఢుం డును; నగు యమధర్మరాజునుఁజూచి, మూర్ఛనొంది కొంతసేప టికిఁ దెలివొంది, గడగడ వణకుచుందురు. ఆ శమనుండు పుణ్య

పురుషులకు సౌమ్యాకారుండును, బాపాత్ములకు నతిభయంక రాకారుండును, నగుచుఁ గనపడును. అటుపిమ్మట నాదండ ధరుండు చిత్రగుప్తునిం బిలిచి వీరిదుష్కృతకర్మంబులను యతని వలన దెలిసికొని, బాపకర్మ తారతమ్యానుసారముగా ఘోర నరకములం దమిత దుఃఖముల ననుభవింపఁ జేయును. చిర కాలము నరక దుఃఖముల ననుభవించినపిదప, శ్యేన కుక్కుట కాక గృధ్రాది పక్షులయందును, శునక సూకర గార్ధభ సింహ వ్యాఘ్రాది యోనులందును, జండాల పుల్కస పులింద్రాది యోనులందును; జనించి జన్మ మరణ జరారోగాది దుఃఖంబుల నొందఁగలరు. ఇట్లు ధర్మాధర్మ ఫలంబులను వేర్వేఱుగాఁ దెలియజేసితినని పలికి సుమన విరమించెను.

## సోమశర్మకు వసిష్ఠుండు విద్యా ధన పుత్ర లాభోపాయం బునుఁ జెప్పి యతని పూర్వజన్మ వృత్తాంతంబును బోధించుట

ఓసుందరీమణీ! నీవు బోధించిన ధర్మాధర్మఫలములను విని సంతసించితిని. ఏ పుణ్యకర్మంబువలన విద్యాధన లాభంబు గలుగును. సర్వజ్ఞుండును, సుగుణాన్వితుండు నగు పుత్రుండే పుణ్యంబువలనఁ గలుగును. విద్యాధన సత్పుత్రలాభంబులకుఁ గారణంబైన ధర్మమును జెప్పుమనిన సుమన సోమశర్మతో నిట్లనియె.

ఓ ప్రాణనాథా! నాకుఁ దెలిసినంతవఱకుఁ జెప్పితిని. ఇటుపిమ్మట బ్రహ్మమానసపుత్రుండైన వసిష్ఠుని బ్రార్థించి

తెలిసికొనుమని చెప్పి విరమించెను. అపుడు సోమశర్మ యా మాటను విని యక్లైనయెడల నేను వసిష్ఠుని కడకుఁ బోయి వచ్చెదనని పలికి, దత్సమీపంబున కేగెను. పిమ్మట సోమశర్మ గంగాతీరమందుండు వసిష్ఠాశ్రమమునకుఁ జని రెండవ సూర్యునివలెఁ బ్రకాశించుచున్న వసిష్ఠునిగాంచి, యనేక పర్యాయములు సాష్టాంగదండప్రణామము గావించి, తత్సమీపంబునఁ గూర్చుండెను. అపుడు వసిష్ఠుండు సోమశర్మనుగాంచి కుశలము నడిగి, యుచితాసనమందుఁ గూర్చుండ నియమించెను. అపుడు సోమశర్మ వసిష్ఠదత్తాసనంబునఁ గూర్చుండి యే పాపముచే దారిద్ర్యము సంభవించును, పుత్రసంతానము లేకపోవుటకును విద్యలేకపోవుటకును, గారణంబెయ్యది యనిన సోమశర్మతో వసిష్ఠుం డిట్లనియె. పుత్రమిత్ర కళత్రాదులును, సోదరులును, స్వజనబంధువులును, ఋణసంబంధము గలవారని యెఱుంగవలయును. సత్యధర్మరతుండును, మేధావంతుండును శాంతుండును, విష్ణుధ్యానరతుండును వేదాధ్యయన సంపన్నుండును, దేవబ్రాహ్మణ పూజకుండును, పంచయజ్ఞ పరుండును, దానదాక్షిణ్యాది గుణసంపన్నుండును నగు పుత్రుండును విద్యయును లక్ష్మీనారాయణ స్మరణకీర్తన పూజావందనాదులచే సంభవింపగలవు. శ్రీమహావిష్ణు కృపలేని వారలకు సత్పుత్రమిత్ర సుందరకళత్రాది సుఖంబులును విద్యాధనలాభంబులును, దుష్ప్రాపంబులయి యుండు; కావున నీవు శ్రీహరి పాదారవిందములను సేవించి యభీష్టార్థసిద్ధిని బొందఁగలవు.

నీవు పూర్వజన్మమందు శూద్రుండవు. గొప్ప కర్షకుఁడవు. ఒక భార్యయు, బహుపుత్రులును, బహు బంధుజనం

బునుఁ గలవాఁడవు. జ్ఞానహీనుండవు. మహాలోభాన్వితుండవు. గోమహిష్యాదులను, నశ్వ మహిష వృషభాదులను, మిక్కిలి పోషించుచుఁ దత్సంతతిని, ముద్గ మాష చణక ధాన్యాదులను విక్రయించి కోటీశ్వరుండ వైతివి. సత్య ధర్మంబులను దాన దాక్షిణ్యాది గుణంబులను నీవెన్నఁడును నెఱుంగ వైతివి. నిరంతరము సహస్రలక్షకోటి సంఖ్యకల ధనమెట్లు లభించు నని యహర్నిశంబులందుఁ జింతించు చుండెడివాఁడవు. తల్లిదండ్రుల శ్రాద్ధదినమందు, శాకతండులాది దానమును, నన్నదానమును జేయవలయునని భార్యాపుత్ర బంధుజనంబులు బోధించినను, నావచనముల నాకర్ణింపక యత్యాశచే ధనార్జన వ్యాపారమును జేయుచు నతితృష్ణా దహ్యమాన దేహుండ వై శ్రాద్ధము నాచరింప వైతివి. భార్యా పుత్రాదులకుఁ గూడఁ దృప్తిగా నన్నోదక వస్త్రాదుల నొసంగక పీడించుటవలన వారధిక విషాదము నొందుచుండెడివారు. సిద్ధిప్రదాయకంబైన కల్పంబులను బరిశీలించి తెలిసికొని నిధులను స్వర్ణసిద్ధులను బొందితివి. కొన్ని ప్రదేశములయందుఁ బూడ్చి పెట్టిన నిక్షేపములను భార్యాపుత్రాదు లడిగినప్పటికి వారి కేమియుఁ జెప్పక విచేతనుండవగుచు కాలధర్మము నొంది, యమలోకంబున కేగితివి. దానధర్మంబులు లేని కారణంబుచే దరిద్రుండ వైతివి. ఈప్రకారముగా నీ పూర్వజన్మ వృత్తాంతమును జెప్పితిని. మహావిష్ణ్వారాధనంబుచేఁ దల్లిదండ్రులయందు భక్తికల పుత్రులును పౌత్రులును ధనధాన్య కళత్రాదులును నానావిధ భోగంబులును సంభవింపఁగలవు.

## వసిష్ఠుడు సోమశర్మకు విప్రత్వకారణమును బోధించుట

పూర్వజన్మ వృత్తాంతమును నాకు మీరు చెప్పితిరి. విప్రత్వ కారణంబైన పూర్వజన్మ సుకృతకర్మమును నాకుఁ దెలియచేయుఁ డనిన వసిష్ఠుండు సోమశర్మతో నిట్లనియె. నీ పూర్వజన్మమునందు విప్రత్వకారణవృత్తాంతమును జెప్పుచున్నాను. సావధానుండవై వినుము. నీవు పూర్వజన్మంబునందు గొప్పధనికుండవు. అట్టియెడ నొకప్పుడు పాపరహితుండును, విష్ణుభక్తుండును, సదాచారసంపన్నుండును, ధర్మాత్ముండును నగు నొకవిప్రుండు నీగృహంబున కరుదెంచెను. నీ వావిప్రునకు నమస్కారము గావించి నేనిపుడు తమ దర్శనము వలన ధన్యుండ నైతిని. సకల తీర్థస్నానఫలము నొందితిని. మీయభీష్టముం జెప్పుఁడనిన, నే గొన్నిదినంబు లిచ్చట నివసించి యుండెదను. పవిత్రమయిన నివాసస్థానమును నాకుఁ జూపింపు మని యావిప్రుండు నిన్ను యాచించెను. అప్పుడు గోశాలను జూపి యందుండ నియమించి పాదసంవాహనాదులచే నాదరముగా సేవించితివి. అటుపిమ్మట ఘృత క్షీర దధి తక్రాదులచేతను గందమూల ఫలాదులచేతను నతిగౌరవముగా భుజింపఁ జేసితివి. ప్రభాతకాలమందు లేచి నీభార్యతోఁగూడఁ బాదప్రక్షాళనోదకంబును శిరంబున దాల్చి విశేషమయిన పుణ్యమును సంపాదించితివి. పిమ్మట నొకప్పు డాషాఢశుద్ధ ఏకాదశీ దినంబు సంప్రాప్తంబయ్యె. ఆదినమందు జగన్నాథుం డనంతునియందు శయనించి యోగనిద్రాపరవశుండై యుండును. ఆషాఢశుద్ధ ఏకాదశి, 'శయనైకాదశి' యనియుఁ

గార్తికశుద్ధ ఏకాదశి 'యుత్థానైకాదశి' యనియుఁ జెప్పం బడును. ఆశయనైకాదశీ దినమందు నృత్తగీతవాద్యంబుల చేతను, వేదసూక్తంబులచేతను మహావిష్ణుని రథోత్సవము గావించితివి. బ్రాహ్మణ సమాజమందు భార్యాపుత్రులతోఁ గూడఁ బురాణ శ్రవణముఁ జేసి, యేకాదశీ మాహాత్మ్యమును విని, యారాత్రియందు జాగరణముం జేసితివి. బ్రాహ్మణ ప్రసంగముచేఁ బ్రాతస్స్నాన మాచరించి గంధ పుష్ప ధూప దీపములచే మధుసూదనునిఁ బూజించి, ద్వాదశీదినమందుఁ గొందఱ బ్రాహ్మణులను భక్ష్యభోజ్య సహితంబైన మృష్టాన్న దానంబుచేఁ దృప్తినొందించి, యాదరించితివి. విష్ణుభక్తుండైన బ్రాహ్మణునిఁ బూజించుటచేతను, ఏకాదశీ ద్వాదశీ తిథుల యం దాచరించిన పుణ్యప్రభావంబుచేతను, నీకు సత్యశౌచ తపోనుష్ఠానార్హంబైన భూసురత్వము సంభవించెను.

నీవు పూర్వజన్మంబునందు గొప్ప ధనికుండవైనను భార్యాపుత్రాదులను,దీనులయిన బంధువులను నతిలోభముచేఁ గొంచమయిన ధనవ్యయమును సహింపక పీడించితివి. ఈజన్మ మందు నా హేతువువలన దరిద్రుండవైతివి. ఇట్లు నీపూర్వజన్మ వృత్తాంతమునుఁ జెప్పితిని. పుత్ర మిత్ర కళత్ర క్షేత్ర విత్తాదు లును, నానావిధ భోగంబులును లక్ష్మీనారాయణ ధ్యాన పూజా వందనాదులచే సంభవింపఁగలవు. ఇది శ్రుతి స్మృతి పురాణ ప్రతిపాదితంబైన పరమ ధర్మంబని వసిష్ఠుండు సోమ శర్మకుఁ జెప్పెను. అటుపిమ్మట సోమశర్మ యయ్యుదంతం బాద్యంతంబుగా విని వసిష్ఠునకు నమస్కరించి యామహా మహుని ననుజ్ఞను బొంది, స్వగృహంబున కేతెంచి యా

వృత్తాంతంబును సమగ్రంబుగా భార్యతోఁ జెప్పెను. ఆభార్య యగు సుమన యీవృత్తాంతమును విని మీరు పుణ్యపురుషులరు. కావున మీకు బ్రహ్మమానస పుత్రుండైన వసిష్ఠుండు ధర్మసారమును బోధించె నని పలికి యానందించెను.

## సోమశర్మ తపంబాచరించి భగవత్సాక్షాత్కారముం బొందుట

అటుపిమ్మట శౌనకుండు సోమశర్మవృత్తాంతమును జెప్పుమనిన సూతుం డిట్లనియె. అపుడు సోమశర్మ భార్యాసహితుండై బయలువెడలి రేవాతీరమందుండు కపిలానదీ సంగమంబున యథావిధిగా స్నానం బాచరించి, దేవతలకునుఁ బితృదేవతలకుఁ దర్పణంబు గావించి, శమదమ సత్యశౌచాన్వితుండై కామక్రోధాదులను బరిత్యజించి వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రంబుచే లక్ష్మీనారాయణుల నారాధించుచు నిశ్చలచిత్తుండై చిరకాలము తపం బాచరించెను. అపుడు మహాపతివ్రతయు, భార్యయు నగు సుమన, తపంబాచరించు కాంతుని, నిశ్చలచిత్తంబుతో సేవించు చుండెను. అట్టియెడ నింద్రాది దేవతలు దంష్ట్రాకరాళంబులయిన సింహశార్దూల మత్త మతంగజాది క్రూరజంతువులను, భూత ప్రేత పిశాచ రాక్షసాదులను సృజించి విఘ్నముల నాచరించిరి. అపుడు సోమశర్మ భయరహితుండై మిక్కిలి ధైర్యముతో లక్ష్మీనరసింహమూర్తిని స్మరించి యిట్లు ప్రార్థించెను. దేవదేవా! భక్తవత్సలా! నీవు భక్తార్తి భంజనుండవు. శరణాగత దీనరక్షకుండవు. శంఖచక్ర గదాపద్మ వనమాలా విరాజితుండవు. శ్రీవత్స కౌస్తుభోరస్కుండవు. దయాసముద్రుండవగు నీకు

నమస్కారము. నీవాశ్రిత జనమందారుండవు, గావున నాకు సంభవించిన విఘ్నములను, భయములను నివర్తింపఁ జేసి ప్రహ్లాదుని రక్షించిన పగిది నను బ్రోవుమని ప్రార్థించెను.

అపుడు భక్తవత్సలుండైన భగవంతుండు సకల విఘ్నములను నివర్తింపఁజేసి మహాలక్ష్మితోఁగూడ ఛందోమయుండైన గరుత్మంతుని నధిష్ఠించి, సాక్షాత్కరించెను. తదనంతరం బా సోమశర్మ సమున్మీలిత నేత్రుండై శ్రీమహావిష్ణు దివ్య మంగళ విగ్రహము జూచి, యతిసంభ్రమంబుతో లేచి, సాష్టాంగ దండప్రణామంబు గావించి, యానంద నిమగ్న హృదయుండై, తత్సమీపంబున నివసించి, యుండెను. అటుపిమ్మట భక్తజన పరాయణుండగు నారాయణుండు, యో భూసురోత్తమా! నీభక్తికి సంతసించితిని. నీతపంబు సఫలంబయ్యె. నీ కభీష్టంబయిన వరంబు నొసంగెద వేడుమనిన, సోమశర్మ, భగవంతునితో నిట్లనియె. దేవదేవా! నీవు సర్వజ్ఞుండవు. సర్వేశ్వరుండవు. సర్వాత్మకుండవు. సర్వశక్తి యుక్తుండవు. అసంగ చిద్రూపుండవయ్యును, ననిర్వచనీయ మహామాయా శక్తిప్రభావంబుచే మత్స్యావతారుండవై దుష్టరాక్షస వధను గావించి నిఖిలాగమంబులను హిరణ్యగర్భునకిచ్చి, ధర్మమును రక్షించిన వాఁడవు. కూర్మరూపుండవై దేవతల కమృతమును బంచియిచ్చి రాక్షసులను వధించిన వాఁడవు. వరాహ నరసింహావతారములచే హిరణ్యాక్ష హిరణ్యకశిపులను వధించితివి. వామనుండవై బలిచక్రవర్తినిఁ బాతాళంబున బంధించితివి. భార్గవరాముండవై దుష్ట క్షత్రియ వధను గావించివి. శ్రీరాముండవై రావణ కుంభకర్ణాదులం దునిమితివి. బలరామ

శ్రీరామ శ్రీకృష్ణ బుద్ధ కల్కి రూపంబులచే దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబులం జేసితివి. నీవు స్వప్రకాశానంగ చిద్రూపుండవు. అవాఙ్మానస గమ్యుండవు. నీమహిమంబు బ్రహ్మాదులకైన నగోచరంబు. నీదర్శనంబుచే నేధన్యుండ నైతిని. నీవు శరణాగత వత్సలుండవు. నిను నేశరణంబు నొందితిని. నాకు నభీష్టార్థంబుల నొసంగి రక్షింపు మని మరలఁ బ్రార్థించెను.

## సోమశర్మ పుత్ర పౌత్రులను బడయుట

అపుడు భగవంతుం డీస్తవంబుచే నానంద మగ్న హృదయుండై నీభక్తికిని, నీస్తవమునకును, సంతసించితిని. అభీష్టంబయిన వరంబు నొసంగెదఁ, గోరుమనిన సోమశర్మ యామధుసూదనునితో నిట్లనియె. ప్రతిజన్మమందును నా భార్యతోఁగూడ నాకునీపాదారవిందములయందెడతెగనిభక్తిని వివిధభోగంబులను విత్తంబును గలుగఁజేసి రక్షింపుము. వంశ విఖ్యాతికరుండును, వేదశాస్త్రార్థ పారగుండును, శమ దమ తపస్తేజోయుతుండును, భార్యాపుత్ర క్షేత్రవిత్తాది సుఖాన్వితుండును, దేవ బ్రాహ్మణ పూజకుండును, సత్కర్మరతుండును, విష్ణుభక్తుండును, నగు కుమారునిఁ బ్రసాదింపు మనినఁ దద్వచనముల నాకర్ణించి సోమశర్మతో భగవంతుం డిట్లనియె—

ఓ భూసురోత్తమా! మత్ప్రసాదంబు వలన నీకభీష్ట గుణాన్వితుండైన తనూజుండు జనింపఁగలఁడు. నీ జీవితకాలములో నెన్నడును దుఃఖంబు నొందవు. గొప్ప ధనికుండవై మహావదాన్యుండవు, కాగలవు. నీవు భార్యాసహితుండవై

మానుష భోగంబులను, దివ్యభోగంబులను, జిరకాల మనుభవించి, పరమపవిత్రంబైన గంగాతీరంబున ననాయాసంబుగా మరణమునొంది, పునరావృత్తి రహితంబగు మోక్షసామ్రాజ్య సుఖము నొందగలవని యానతిచ్చి యంతర్హితుండయ్యె. అపుడా సోమశర్మ, సుమనయను భార్యతోఁ బయలు వెడలి స్వనివాస గృహంబున కేతెంచెను. అపు డాగృహము, సమున్నతప్రాకార పరిశోభితంబును, దివ్యవస్తు పరిపూరితంబును, దేవేంద్ర భవనసన్నిభంబును, నై యొప్పుచుండెడిది. అట్టియెడ, శ్వేతచ్ఛత్ర విరాజమానుండును, సువర్ణ దండశోభిత ధవళ చామర వీజితుండును, శుక్లవర్ణ పరిశోభిత మత్త మతంగజారూఢుండును, దివ్య వస్త్రాన్వితుండును, సుగంధ కుసుమ మాలికాలంకృత శరీరుండును, యక్ష కిన్నర గంధర్వ సిద్ధ విద్యాధరాది సంస్తూయమానుండును, దివ్యాంగనా పరివృతుండును నగు నొక మహాపురుషుం డేతెంచి, దివ్యవస్త్ర కుసుమ గంధాదులను, నమితంబులయిన మణిముక్తా ప్రవాళంబులను సువర్ణ నిష్కంబులను ప్రాంగణమందుంచి యంతర్హితుండయ్యె. ఈ దివ్య పురుషునితోఁ గూడ ననేకులయిన దేవతాస్త్రీలు చనుదెంచి సుమన యను విప్రపత్నిని సువర్ణ సమలంకృతాసనంబునం గూర్చుండబెట్టి దివ్యాంబరాభరణాదులచే నలంకరించి యమూల్యంబులయిన నేక వస్తువుల నొసంగి, నీగృహంబున నిగూఢంబుగా నివసించి నీభర్తతోఁగూడ నిన్ను రక్షించెదమని యానతిచ్చి యదృశ్యులయిరి.

అపుడు సోమశర్మ తనభార్యంగూడి నానావిధ శృంగారాన్వితంబులయిన భోగంబుల ననుభవించు చుండెను. మఱి

కొన్ని దినంబులకు, నాతనిభార్య గర్భంబుదాల్చి పదియువ మాసంబున మిక్కిలి తేజోవంతుండగు కుమారునిం గనెను. అప్పుడు దేవదుందుభులు మ్రోగినవి. దివ్యాప్సరస్త్రీలు నాట్యముం జేసిరి. గంధర్వులు శ్రావ్యముగా గానముం జేసిరి. అటుపిమ్మట జాతకర్మాది సంస్కారముల నాచరించి సువ్రతుం డను నామముచేఁ బిలుచు చుండిరి. అంత నా బాలకుండు శుక్లపక్షచంద్రునివలె దినదిన ప్రవర్ధమానుండై బాల్యావస్థను గడపి కౌమారావస్థనుబొంది, సవయస్కులయిన బాలురతోఁ గ్రీడించుచు శయనాసన క్రీడాభోజనాదులయందును, స్వప్న మందును, శ్రీకృష్ణునే చూచుచు; సర్వవిశ్వమయుం డగు శ్రీకృష్ణుం డాత్మరూపముచేఁ దృప్తిం బొందుగాక; యని భావించుచు, సంతతము భోజనాభ్యంగస్నాన పానాదులను, శ్రీకృష్ణధ్యాన పూజావందనాదులను, సలుపుచుండెడివాఁడు. ఈ బాలకునిచేఁ నా దంపతు లిరువురు యానందించుచు నెల్ల పుడు సంపూర్ణ యౌవనవంతులయి నానావిధ భోగముల ననుభవించు చుండిరి. సోమశర్మ పంచవింశతి వార్షిక పురుషుని వలెను, సుమన షోడశవార్షిక స్త్రీవలె నుండెడివారు. ఆ దం పతు లిరువురు గజాశ్వ మహిషీ ధేను దానంబులచేతను; ననేక వ్రతంబులచేతను; గంగాది తీర్థయాత్రా నియమంబులచేతను; కాంచన మణిముక్తా ధనాది దానంబులచేతను, వేదశాస్త్ర పారంగతులయిన విప్రోత్తముల నానందింపఁ జేయుచు నెల్ల పుడు వారికి నమస్కరించుచు, శ్రీకృష్ణధ్యాన పూజావందనా దులం జేయుచుఁ గాలమును సార్థకముగా వెల్లించు చుండిరి. తదనంతర మాబాలకునకు, యథావిధిగా విహితకాలమందు

చౌలోపనయన వివాహాదులం గావించి, కాలక్రమముచేఁ బాత్రుని వడసి పుత్రపౌత్రులతో సుఖముగా నుండిరి.

## సువ్రత చరిత్రము

శౌనకుండు తదనంతరం బా సువ్రతుని వృత్తాంతముం, జెప్పుమనిన శౌనకునితో సూతుం డిట్లనియె—

మహాప్రాజ్ఞుండగు సువ్రతుండు మాతృగర్భ ప్రవేశము మొదలుకొని, సకలవస్తువులయందును మహావిష్ణువునే చూచు చుండెడివాఁడు. ఆ సంస్కారముచే నతండు బాలురతోఁ గ్రీడించు సమయమందును భోజనకాలమందును శయనగృహ మందును సర్వవిశ్వము, విష్ణుమయంబని భావించి యెల్లపు డును విష్ణుకీర్తనముఁ జేయుచుండెను. మఱియొకప్పుడు స్థావర జంగమములందు మహావిష్ణుని భావించి యిట్లు స్తుతిచేసెను. ఓపరమేశ్వరా! నీవు సచ్చిదానంద రూపుండవు. నిర్గుణుండవు. నిర్వికారుండవయ్యును నచింత్యంబగు మాయాశక్తిచే మత్స్య కూర్మాది రూపుండవై దుష్టనిగ్రహ శిష్టపరిపాలనం బొనరించి తివి. దేవదేవా! నీవు సకలదోష రహితుండవు. స్వాధ్యస్తంబును ననిర్వచనీయంబును నగు మహామయాశక్తిచే సకలవిశ్వంబును సృజించి, యావిశ్వమం దంతర్యామివై సర్వసాక్షివై ప్రకా శించు చున్నవాఁడవు. బ్రహ్మాది పిపీలికాంత దేహంబులందును జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయంబందును స్ఫుటతరంబై ప్రకాశించు నానందాభిన్న సంవిద్రూపంబు నీవని తెలిసికొనిన వారు భవాంభోనిధియందుఁ బునరావృత్తి రహితులై శాశ్వ తంబయిన మోక్షంబు నొందఁగలరు. నీవు స్వప్రకాశానంగ

చిద్రూపుండవైనను నచింత్య శక్తియుక్తుండవగుటచేత సకల జగజ్జన్మాదికారణుండవు. నీకు నమస్కారంబని సుస్వరంబుగా గానంబుఁజేయుచు సమానవయస్కులైన బాలకులతో తాల లయాన్వితంబుగా నాట్యముఁ జేయుచుండెడివాఁడను. తల్లి భోజనముకొఱకు బిలిచినపుడు నాకు క్షుత్పిపాసలు లేవు. అంబుజోదరు దివ్యపాదారవింద చింతనామృత పానంబుచేఁ దృప్తుండనైతి నని, చెప్పి వైదూర్యపర్వతమందలి సిద్ధక్షేత్రం బున నోంకారేశ్వర లింగసమీపంబునఁ దీవ్రంబుగాఁ దపం బాచరించెను.

## సువ్రత పూర్వచరిత్రమును రుక్మాంగద చరిత్రమును వర్ణించుట

అటుపిమ్మట శౌనకుండవశిష్టమయిన సువ్రత చరిత్ర ముం జెప్పుమనిన సూతుండు శౌనకునితో నిట్లనియె. తదనం తరం బాశ్రిత కృపాసాగరుండును,భక్తజన మందారుండునునగు మధుసూదనుండు గరుడాసనాసీనుండై మహాలక్ష్మితోఁగూడ సాక్షాత్కరించి భూసురోత్తమా! నేను భక్తజన పరాయణుం డగు నారాయణుండను. నీకుఁ బ్రసన్నుండ నైతిని. అభీష్టం బైన వరంబు నొసంగెదఁ గోరుమనిన, నపుడు సువ్రతుండు లేచి సాష్టాంగ దండప్రణామము గావించి యిట్లు స్తుతిచేసెను. ఓసర్వేశ్వరా! నీవు శరణాగత దీనార్త పరిత్రాణ పరాయ ణుండవు. నీ మహిమంబు బ్రహ్మాదులకైన, నగోచరంబు. సంసార సాగరమందు నిమజ్జనోన్మజ్జనములను జేయుచుఁ గామ క్రోధాది మకరగ్రస్తుండనై దుఃఖము నొందుచున్నవాఁడను.

మోహాంధకార పటలముచే నష్టమయిన వివేకము కలవాఁడను. దీనుఁడను. దుఃఖతరంగములచేఁ గంపించు చున్నవాఁడను. నీకరము నవలంబముగా నిచ్చి రక్షింపుము. నిరంతర భక్తితో నీపాదములను సేవించువారు సుఖముగా యోగక్షేమముల నొందఁగలరు. అన్యదేవతలను సేవింపక నీపాదారవిందంబులనే నిరంతరము సేవించుచు నీకు నమస్కారముఁ జేయుచున్న వాఁడను. నీవు ప్రసన్నుండవైన యెడల భార్యతోఁ గూడ నాకును, మజ్జననీ జనకులకును దివ్యదేహముతో వైకుంఠలోక సుఖమును దేవలోకభోగంబులను బ్రసాదింపు మనిన, వల్లె యని భగవంతుండగు మధుసూదనుం డంతర్హితుండయ్యె.

అటుపిమ్మట సుమనా సోమశర్మలును, భార్యాసమేతుండై సువ్రతుండును, వైకుంఠలోక సమాగత విమానవరము నధిష్ఠించి, కల్పద్వయ పర్యంతము వైకుంఠలోక సుఖమును, నానావిధ దేవలోక భోగంబులను ననుభవించిరి. తరువాత కొంతకాలమయిన పిమ్మట సోమశర్మ దేవకార్యార్థమయి యదితికశ్యపులకు నొకకల్పమందలి మన్వంతరంబునఁ దనయుండై జనించి, సురపతియై పురందర పదము నధిష్ఠించెను. సుమన శచియై జనించె. ఇట్లు వారిరువురు శచీపురందరులై జనించి చిరకాలము స్వర్గలోకసుఖము ననుభవించి ముక్తులయిరి. మఱియొక మన్వంతరంబునఁ గళత్ర సమేతుండై సువ్రతుండు, దివస్పతియై దివమును బాలించి సకలభోగంబుల ననుభవించి ముక్తుండయ్యె. పూర్వజన్మ సంస్కారంబుచే నీ సువ్రతుండు నిరంతర గోవిందపదారవింద భక్తుండై మహావిష్ణు పదము నొందెననిన, శౌనకుండు నీవిచిత్రకథను విని యానం

దించితి. ఈతని పూర్వజన్మ వృత్తాంతమును జెప్పుమనిన సూతుండు శౌనకునితో నిట్లనియె.

తొల్లి విదిశయను రాజధానియందు నతి బలవంతుండును, మహావదాన్యుండును నగు ఋతధ్వజుండను మహారాజు కలఁడు. అతనికి రుక్మాంగదుండను దనయుండు జనించెను. ఆ రుక్మాంగదునకు సంధ్యావళియను భార్య కలదు. అంబరీషునికి ద్వాదశీనియమమువలె రుక్మాంగదునకు దశమీద్వాదశులయం దేకభుక్తము గావించి యేకాదశియందు, నుపవాసము చేయుఁ దీవ్రవ్రత నియమము గలదు. దశమినాఁడు సాటింపుఁ జేయించి సకలజనులచేతను, నేకాదశ్యుపవాసమును నారీతిగనే చేయించుచుండెడివాఁడు. ఆ రుక్మాంగదుండీ భార్యయందాత్మసదృశుండైన పుత్రునిం గని ధర్మాంగదుం డని పేరుఁ బెట్టెను. అటుపిమ్మటఁ గ్రమముగా జాతకర్మ నామకరణాది సంస్కారములను గావించెను. ఆ పుత్రుండు విష్ణుభక్తుండు గావున సంతతము గోవిందపదారవింద చింతనపరుండై యుండె. ఇట్లుండగా యమధర్మరాజు సత్యలోకమున కరిగి రుక్మాంగద శాసనంబుచే నేకాదశ్యుపవాసము నాచరించి ప్రజలందఱు స్వర్గలోకంబున కరుగుచుండిరి. నేను శిక్షింపఁదగిన వారులేరు. కావున నేకాదశీవ్రతమునకు విఘ్నము నాచరింపుఁడని బ్రహ్మదేవుని వేడెను. ఆ మాటలను విని కమలాశనుం డేకాదశీ వ్రతమును బరీక్షించుటకై మోహిని యను యొక కాంతామణిని సృజించి నీవు భూలోకంబున కరిగి రుక్మాంగదుని నేకాదశీ వ్రతమునకు విఘ్నము నాచరింపుమని యానతిచ్చి పంపెను.

అపు డామోహిని భూలోకమున కరుదెంచి యొక శివ క్షేత్రమందు నతిశ్రావ్యముగా వీణాగానము చేయు చుండెను. ఒకప్పుడు రుక్మాంగదుండు మహారణ్యంబులకు మృగయాతత్పరుండై జని జవసత్వంబులు గల క్రూరసత్వంబులను వధించి పురమునకు బయలు వెడలి వచ్చుచున్న సమయంబున నా శివ క్షేత్రమందుండు మోహిని యను కాంతామణి నవలోకించి మోహాక్రాంత చిత్తుండై ఓ కాంచనాంగీ! సౌకుమార్య సౌందర్యములను గాంచి నిను వలచితిని. నీ కిష్టమయిన యెడల బ్రాహ్మ దైవార్ష ప్రాజాపత్య రాక్షస గాంధర్వాసుర పైశాచంబు లనంబరగిన వివాహంబు లెనిమిదింట, నుత్తమ క్షత్రియులకు గాంధర్వం బుత్తమోత్తమంబు. కావున గాంధర్వ విధిం బరిణయంబ య్యెదనని తన యభిప్రాయంబుఁ దెలిపెను. ఆ మోహినియను కాంతామణి తద్వచనముల నాకర్ణించి యా భూకాంతునకుఁ దనయందు గల వలపును దెలిసికొని నాతోఁగూడి యనుదినము నాకు రతిసుఖమును గలుగఁజేసితి వేని నీకు భార్య నయ్యెదనని చెప్పెను. అందుల కతండియ్యకొని గాంధర్వ విధిం బెండ్లియాడి ప్రియవధూసమేతంబుగా స్వపురంబున కరుదెంచి పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్యాజన వర్గముచే సగౌరవంబుగా నాదృతుండై యా మోహినితోఁ గూడ స్వాంతఃపురంబునం బ్రవేశించెను.

అటుపిమ్మట మఱికొన్ని దినంబులకు నేకాదశీదినము సంప్రాప్తంబయ్యె. అపు డా రుక్మాంగదుండు పూర్వమువలె దశమినాఁడు చేయఁదగిన నియమంబును పరదినమం దాచరింపవగిన యుపవాసవిధిని పాటింపుచే సకలప్రజలను శాసించి

తాను భార్యాపుత్ర సహితుండై యుపవాసమును జేసెను. అపు డామోహిని తద్వ్రితం బాకర్ణించి నిత్యము నాతోఁ గూడి రతిక్రీడా వినోదంబులచేఁ గాలయాపనంబు చేసెదనని చెప్పితివి. ఈవ్రత నియమమును వదలి నాతో విహరింపుము. లేనియెడల సత్యలోకంబున కేగెదనని యత్యాగ్రహంబుతోఁ జెప్పెను. అనంతరము రుక్మాంగదుం డామాటను విని తపనుం డపరశిఖరి నుదయించినను, మేరువు ధరణీతలంబునఁ గ్రుంగినను, దహనుండు శీతలభావంబు నొందినను, నే నీవ్రతమును బరిత్యజింప నని యతిదృఢనిశ్చయముతోఁ జెప్పెను. అపు డా మోహిని యనేక పరుషములను బలికెను. అపుడు రుక్మాంగదుండు నీకు మఱియొక యభీష్ట కార్యంబయినం జేసెదగాని యీవ్రత నియమమును విడువనని చెప్పెను. అట్లైన నీకుమారుని శిరంబును ఖడ్గంబుచే దునిమి నాకిమ్మనెను. అపుడు ధర్మాంగదుం డామాటను విని పితృభక్తియుక్తుండు గావున నీవ్రతనియమమును బరిపాలించుటే నాకుఁ బరమధర్మంబని మనంబున భావించి తన కంఠమును ఖడ్గంబుచేఁ ద్రుంచి యా మోహినీదేవికి సమర్పించెను. ఆ వృత్తాంతమును జూచి మోహినీదేవి భయపడి యతివిస్మయము నొందెను. అంతట బ్రహ్మవిష్ణురుద్రు లేతెంచి రుక్మాంగదునకుఁ బ్రసన్నులయి నీవ్రతనియమమునకు సంతసించితిమి. నీకుమారుండైన ధర్మాంగదుని బ్రతికించెదమని చెప్పి యాకుమారుని బ్రతికించి చిరకాలము భూలోక దేవలోక భోగంబుల ననుభవింపు మని యాధర్మాంగదు నాశీర్వదించి యంతర్హితులయిరి. అపుడు మోహినీదేవి సత్యలోకంబున కరిగెను.

ఇట్లు చిరకాల మేకాదశీ వ్రతోపవాస జాగరణాది నియమముల నాచరించి రుక్మాంగదుండు ముక్తుండయ్యె. అటుపిమ్మట ధర్మాంగదుండు సుమనా సోమశర్మలకుఁ బుత్రుం డైనసువ్రతుండై జనించెను. ఆధర్మాంగదుండే యీసువ్రతుం డని తెలిసికొనుము. ఈసువ్రతుండు చిరకాలము నానావిధ భోగంబుల ననుభవించి, పురందరుండై దేవలోకమునుఁ బాలించి, కాలక్రమంబుచే మోక్షసామ్రాజ్యంబు నొందె; ఇట్లనేక రామకృష్ణాద్యవతారంబులును స్వాయంభువాది మనువులును మహేంద్రాది దిక్పాలకులును మహారాజులును ననేకమాసాబ్ద యుగకల్పంబులయం దావిర్భావ తిరోభావం బుల నొందుచుందురు. కాబట్టి యీలోకవ్యవహార మనాది యనియు ననంతమనియు నెఱుంగవలయు.

## దేవేంద్రుఁడు బలాసురుని వజ్రాయుధంబుచే వధించుట

ఈ చరిత్రము మిక్కిలి విచిత్రమయినది. ఈకథను విని మేము సంతసించితిమి. మరల విష్ణుకథలను జెప్పుమనిన శౌనకాది మునులతో సూతుం డిట్లనియె. పూర్వకాలమందు, షడ్గు ణైశ్వర్య సంపన్నుండును, భక్తార్తి భంజనుండును నగు మహా విష్ణువు లోకకంటకులయిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను, వరాహ నృసింహావతారములచే సంహరించి దేవతలను రక్షిం చెను. అపుడు దేవతలందఱు స్వస్థానమందు సుఖముగా నుండిరి. యజ్ఞాది కర్మములు యథావిధిగాఁ బ్రవర్తించినవి. సకల సుర మునులు స్వస్థచిత్తులయిరి. అటుపిమ్మట మరి కొందఱు దానవులు దేవతల నెదుర్కొని యుద్ధముఁ జేసిరి.

అపుడు చక్రహస్తుండగు శ్రీమహావిష్ణుని సహాయముచే నింద్రాది దేవతలు, దైత్యదానవులను వధించిరి. హతావశిష్టులయిన రక్కసులు పరాభవము నొంది పాతాళమున కరిగిరి. అపుడు దితి, పుత్రశోకముచే సంతాపము నొంది మూర్ఛ నొందుచుఁ గడుదుఃఖమునొంది పిమ్మట సూర్యసంకాశుండును, దపస్తేజోయుతుండును నగు భర్తయైన కశ్యపునిఁగాంచి, యతనికి నమస్కారము గావించి యిట్లనియె.

ఓ ప్రాణనాథా! యిపుడు నీవు మిక్కిలి యానందకరుండును, సూర్యసన్నిభ తేజుండును, వేదపారగుండును, దపోబల యుతుండును, సర్వలోక జయశాలియు, సర్వలక్షణ సంపన్నుండును, సర్వజ్ఞుండును నగు పుత్రుని నాకొసంగుము. విష్ణు సహాయముచే నింద్రాదిదేవతలు, నాపుత్రుల నందఱను వధించెను. నాకు సవతియైన యదితి తనపుత్రులతోఁగూడ స్వర్గసుఖము ననుభవించుచు, నన్నుఁ జూచి పరిహాసించుచున్నది. సపత్నీకృతంబైన పరాభవంబుచేతను, బుత్రనాశ కృతంబైన శోకానలంబుచేతనుఁ గడు దుఃఖంబు నొంది నిను శరణంబు వేడితిననినఁ, గశ్యపుం డావచనముల నాకర్ణించి కృపావిష్ట చిత్తుండై నీవు వెఱవకుము. నీవు మనోవాంఛితుండయిన పుత్రునిం బడయగలవు. శతవర్షంబులు మేరుపర్వతమునందు బ్రహ్మచర్య వ్రతంబును బూని నతితీవ్రంబుగాఁ దపంబాచరింపుము. వాఁడు దేవద్విజ విద్వేషికాని యెడల, దీర్ఘకాలము జీవించి యభివృద్ధి నొంది నీయభీష్టమును సిద్ధింపఁజేయఁగలఁడని యానతిచ్చెను. అపు డాదితి యట్లు చేసెదనని చెప్పి గిరివరోత్తమంబయిన మేరుపర్వతమందు బ్రహ్మచర్య

నియమముతో దీర్ఘకాలము తీవ్రముగాఁ దపం బాచరించెను. అటుపిమ్మట గర్భవతియై శతవర్షంబులు గడచిన పిమ్మట భాస్కర సమాన తేజుండును, సర్వలక్షణ లక్షితుండును, సర్వలక్షణ లక్షితుండును, సర్వజ్ఞుండును, నగు కుమారునిం గనెను. అపుడు కశ్యపుం డిచటికి కేతెంచి బ్రహ్మతేజోయుతుండైన పుత్రునింగాంచి, మహోత్సాహంబుతో జాతకర్మ సంస్కారము నాచరించి, బలాసురుండని నామకరణముం జేసి పుత్రకా! నీవు వేదాధ్యయన సంపన్నుండవై శతవర్షంబులు బ్రహ్మచర్యము నాచరింపు మని యానతిచ్చెను. అప్పుడా బలుండను రక్కసుండు శతాబ్దంబులు బ్రహ్మచర్య నియమంబుతోఁ దీవ్రతపంబాచరించి బ్రహ్మతేజోయుతుండై దితి సమీపంబున కేతెంచెను. దితి వానింజూచి పుత్రకా! నీవు దీర్ఘాయుష్మంతుండవై సుఖముగా జీవింపుము. నీవు జీవించిన యెడల నా పుత్రులందఱు సుఖముగా జీవింతురు. పూర్వకాలమందు నా పుత్రులయిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, మధుసూదనుని సుదర్శనాస్త్రాగ్ని జ్వాలలచే దగ్ధశరీరులయి మృతినొందిరి. మహావిష్ణువు, నా పుత్రులను వధించి యింద్రాది దేవతలను రక్షించెను.

కావున నీవు గోవింద సంరక్షితులయిన బృందారక బృందములను వధింపుమని యానతిచ్చెను. దనువను కశ్యప ధర్మపత్నికూడ, ముందుగా దేవేంద్రుని వధించి పిమ్మట దేవతలను, గోవిందుని వధింపుమని చెప్పెను. అపుడు బల్లిదుండగు బలాసురుండు వారిరువుర మాటలను విని యింద్రాదులను సంహారించుటకు నుద్యమించి రంధ్రాన్వేషణ తత్ప

రుండై సాయంకాలమందు సముద్రతీరంబున, బ్రహ్మతేజో యుతుండై సంధ్యోపాసనంబు జేయు చుండెను. తరువాత దనువ్రను దితియుఁ జెప్పిన మాటలను బలాసురునిఁ బ్రయత్న మును; దేవమాతయయిన యదితి విని దేవేంద్రునితో నిట్ల నియె. దేవవధార్థమయి బలాసురుండు దీర్ఘకాల బ్రహ్మచర్యం బుతో నతితీవ్రంబుగాఁ దపం బాచరించెను. నీవు దేవతల క్షేమమును గోరితివేని జాగరూకుండవై యతిప్రయత్నముతో దుష్టనిగ్రహము గావించి దేవతలను, స్వర్గ రాజ్యమును బాలింపు మని దేవేంద్రునితోఁ జెప్పెను. దేవేంద్రుం డామా టను విని వెఱచి వాని వధోపాయంబును జింతించి వజ్రాయుధ హస్తుండై సముద్రతీరంబున కేగి కృష్ణాజినాసీనుండును, సం ధ్యోపాసనాపరుండును నగు నా బలాసురుని వజ్రాయుధంబుచే నఱికి వధించెను. అపుడు వాఁడు గతజీవితుండై నేలంగూలెను. పిమ్మట దేవేంద్రుం డతిహర్షంబుతో స్వర్గలోకంబున కేగి, స్వస్థచిత్తుండై సుఖముగా నుండెను.

## దేవేంద్రుండు వృత్రాసురునిఁ గపటముచే వధించుట

అటుపిమ్మట దితి బ్రహ్మతేజోవంతుఁడగు మన పుత్రుండు సముద్రతీరమందుఁ దపం బాచరించు సమయంబున దేవేంద్రుండు వానిని వధించెనని తనభర్త్రయైన కశ్యపునితోఁ జెప్పి దుఃఖించుచు రోదనము చేసెను. మరీచి తనయుండైన కశ్యపుం డీవృత్తాంతమునువిని రోషరక్తాంతలోచనుండై యగ్ని కుండమం దాభిచారిక హోమంబు నాచరించెను. అపు డంజనగిరివలె నీలవర్ణుండును, బింగాక్షుండును, దంష్ట్రికరాళ

వక్త్రుండును, నతి భయంకరాకారుండును, నతి తీక్ష్ణఖడ్గహస్తుం డును, నగు వృత్రాసురుం డగ్నికుండమునుండి యావిర్భవించి నేను జేయవలసిన కార్యము నాజ్ఞాపింపుమని కశ్యపుని వేడెను. అటుపిమ్మట వృత్రాసురునితోఁ గశ్యపుం డిట్లు పలికెను. దితి పుత్రుండైన బలాసురుని సమాధియందున్న సమయంబున దేవేంద్రుండు వజ్రాయుధంబుచే సంహరించెను. ఆ కారణంబు వలన దితి రోదనంబు చేయుచున్నది. నీవు శీఘ్రముగా బయలు వెడలి ముందుగా దేవేంద్రుని వధించి తదనంతరంబున సకల దేవతలను సంహరించి స్వర్లోకభోగంబుల ననుభవింపుము. ఇదియే దితి కభీష్టంబయిన కార్యంబు. ఇట్లు చేసితివేని నాకును మిక్కిలి ప్రియమును జేసినవాఁడ వౌదువని కశ్యపుండు పలికిన, తద్వచనముల నాకర్ణించి వృత్రాసురుం డట్లు చేసెద నని చెప్పెను.

ఇంద్రుండీవృత్తాంతమును దెలిసికొని వృత్రాసుర వధో పాయమును జింతించి యేమియుం దోఁపక సప్తమహర్షులను బిలిచి వృత్రాసురుండు దేవతలను, నన్నును వధించి స్వర్గరా జ్యము నాక్రమింపఁ దలఁచి యున్నాఁడు. వానిని వధించుట దుష్కరంబు గావున మీరలు బయలువెడలి వానితోఁ గలిసి మాట్లాడి, సంధినిఁ జేయుఁడని విన్నవించెను. వారపుడు వృత్ర సమీపంబునకేగి; ఓ రాక్షసోత్తమా! నీవు మహాబలపరాక్రమ సంపన్నుండవు, ధార్మికుండవు గావున దేవేంద్రుండు నీతో సఖ్యము నిశ్చయించు చున్నాఁడు. కానితో సఖ్యముం జేసి యింద్రపదములో నర్థభాగము నీవనుభవింపు మని చెప్పిరి. వృత్రాసురుం డామాటలను విని దేవేంద్రుండు దానవ వైరి

గావున మంచిమాటలచే నాకు నమ్మకమును గలుగఁజేసి మఱి యొక కాలమందుఁ గపటముచే నన్ను వధించును. ప్రమాణ పూర్వకముగా శపథముచేసి సఖ్యమును గోరినయెడల నే నంగీ కరించెద నని సప్తమహర్షులతోఁ జెప్పెను. అపుడు దేవేం ద్రుండు కశ్యపాది సప్తమహర్షులవలన వృత్రాసురాశయమును దెలిసికొని తత్సమీపంబున కరుదెంచి, ఓ మిత్రమా! నీవు మహాబల పరాక్రమ సంపన్నుండవు; సకలధర్మజ్ఞుండవు, ధార్మి కుండవు, నీతో సఖ్యమును జేయు చున్నాను. సప్తమహర్షుల వలన నీ యాశయమును దెలిసికొని నీతో నమ్మకముగాఁ జెప్పు చున్నాను. నా మాటలను ముఖ్యముగా విశ్వసింపుము. నీకు నేనుఁ గపటముచే ననర్థము చేసినయెడల యథార్థముగా బ్రహ్మ హత్యాది మహాపాతకముల నొందెదనని యతివిశ్వాసముతో సప్రమాణముగా శపథము చేసెను. అపుడు వృత్రాసురుం డతినమ్మకముతో నింద్రుని మిక్కిలి ప్రియమిత్రునిగా భావించి యతనితో సఖ్యమునంగీకరించి స్వర్గలోకమందుఁ బ్రవేశించెను.

అటుపిమ్మట దేవేంద్రుండు వృత్రాసురు నవలోకించి సింహాసనమునుంచి లేచి సగౌరవంబుగా నర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి, మాటలచే విశ్వాసమును గలుగఁజేయుచు నాతోఁ గూడ సమముగా నీవును స్వర్గలోక భోగంబుల ననుభవింపు మనిచెప్పెను. అపుడు వృత్రాసురుం డామాటలను విని యింద్రునియం దతివిశ్వాసయుక్తుండై దివ్యభోగముల ననుభ వించుచుండెను. ఇట్లు కొంతకాలము సకలభోగముల ననుభ వించిన పిదప దేవేంద్రుండు కపటమైత్రితో సర్వకాలములం దును సంభాషించుచు వీని నెట్లు వధించెదనని తద్వధోపా

యంబు నాలోచించు చుండెను. తరువాత నా పురందరుండను తద్వధోపాయం బాలోచించి రంభను బిలిచి యీవృత్రా సురుండు ధర్మనాశకుండును లోకకంటకుండును గావున నీ కౌశలముచే శరీరస్మృతి రహితమయిన మహామోహమును గలుగఁజేయుము. తరువాత నేను వధించెదనని యానతిచ్చెను. అటుపిమ్మట రంభ తద్వచనంబుల నాకర్ణించి, తచ్ఛాసనమును శిరంబున వహించి తా మాజ్ఞాపించిన ప్రకారముఁ జేసెదనని పలికి బహుపుష్ప ఫలోపేతంబును, మృగపక్షి సమాకులం బును, దివ్యవిమాన వరశోభితంబును శుక పిక శారికాది మధురధ్వని విలసితంబును, దేవగంధర్వ సంగీత యుతంబును, యక్షకిన్నర గంధర్వ సిద్ధవిద్యాధర మునిసమలంకృతంబును, కమల కల్హార నీలేందీవరాలంకృత వాపీకూప తటాకాన్వితం బును, సువర్ణ కలశాలంకృత హేమప్రాసాద విరాజితంబును, నప్సరోగణ సంకీర్ణ నానామంగళోత్సవ శోభితంబును, వేదధ్వని విలసితంబును, నగు నందనవనమందు మందార పారిజాత హరి చందనాది వాటికల ఛాయ నాశ్రయించి తనతో సమాన వేషముకల యప్సరోగణంబులతోఁగూడ నుయ్యాల నూగుచుఁ గ్రీడించుచుండెను. అపుడు వృత్రాసురుండు దేవేంద్రునియం దతినమ్మకము కలవాఁడు గావున నింద్రునిఁ బరమమిత్రునిగా భావించి, సర్వవ్యాపారములయందును, భయరహితుండై దానవ గణంబుతోఁ గూడఁదిరుగుచు వనితాశత సమాకులం బును, నతిమనోహరంబును నగు నందనోద్యాన వనంబునకేగి, యుయ్యాల నూగుచున్న రంభనుగాంచి కాలచోదితుండై కామాకులిత స్వాంతుండయ్యె. దేవేంద్రుండు సమయమును

ప్రతీక్షించి వానిని వధింపవలెనని తలంచి వజ్రహస్తుండగుచు నదృశ్యుండై తిరుగుచుండెను.

అటుపిమ్మట వృత్రాసురుండు రంభసమీపంబున కరిగి యోసుందరీమణీ! నీవెవ్వతెవు. ఇచ్చట నుండుటకుఁ గారణం బేది యనిన, నతనితో రంభ యిట్లనియె. నేను రంభయను నప్సరస్త్రీని. సఖీజనముతోఁగూడ నీనందన వనమందుఁ గ్రీడార్థమయి వచ్చి విహరించుచుంటిని. నీవృత్తాంతమును జెప్పుమనిన వృత్రాసురుండు రంభతో నిట్లనియె. నేను కశ్యపుని తపోబలంబుచే నగ్నికుండమువలన బుట్టిన వాఁడను, వృత్రాసుర నామాఖ్యుండను. నీసౌందర్య సౌకుమార్యంబులచే మోహావిష్ట చిత్తుండనై నీకు స్వాధీనుండ నైతిని. నాకు గాఢాలింగన సంగమ సుఖంబులను గలుగఁజేయు మనివేడెను. అపు డారంభ వానిని గామాకులిత స్వాంతునిగాఁ దెలిసికొని నేజెప్పినటులఁ జేసితివేని నీవు నాతోఁగూడి తత్సుఖంబుల ననుభవింపఁగలవు. ముందుగా నేఁజెప్పినట్లు చేయుటకు నంగీకరింపుము. పిమ్మట నీకు వశ మయ్యెదనని చెప్పెను. అందులకు వాఁడియ్యకొని దివారాత్రంబులం దతిమోహాక్రాంత స్వాంతుండై రతిక్రీడలు సలుపుచుఁ దదీయ నృత్తగీత వాద్యంబులచే నానందించుచుండెను. అట్టియెడ నొకప్పుడు రంభ మద్యపానముచేసి నాతోఁగూడి రతిక్రీడలు సలుపుము. ఈమద్యము నాకు మిక్కిలి ప్రియమయునది. నీవుకూడ మద్యమును బానము చేయు మని నిర్బంధించెను.

అపుడు రక్కసుం డామాటను విని నేను బ్రాహ్మణుండను. వేదపారగుండను. కశ్యపతపోబలంబుచే నగ్నికుండము

వలన బుట్టినవాఁడను. శ్రుతి స్మృతి నిషిద్ధంబయిన మద్యం బును నేనెట్లు పానముచేయుదునని నిసేధించెను. తరువాత, రంభ, నేఁజెప్పిన పనులను జేసెదనని ముందుగా శపథము చేసితివి. అట్లు నీవు చేయనియెడల చేసినశపథంబు వితథం బయ్యెడిని. ఇపుడు నీ విట్లు సంభాషించుట న్యాయ్యము కాదు. నే చెప్పినట్లు చేసితివేని నాతోఁగూడి రతిసుఖమును బొంద గలవు. శీఘ్రముగా మద్యపానమును జేయుమని మరల నిర్బం ధించెను. అపుడు వాఁడు దాక్షిణ్యభంగ భీతిచే సురాపాన మును జేసెను. ఆమద్యపానముచే జ్ఞానహీనుండై మూర్ఛ నొందెను. అట్టియెడ దేవేంద్రుండు వజ్రహస్తుండై వానిసమీ పంబునకేగి తత్కంఠమును వజ్రాయుధంబుచే నఱికి వధించెను. అపుడనేక ఋషులు, నమ్మకముతో మైత్రి నాచరించి వానిని వధించితివి. విశ్వాసము కలవానిని వధించుట మహాపాతకము. బ్రహ్మహత్యాదిమహాపాతక యుక్తుండవు కావున, నీవు స్వర్గ పదంబున కనర్హుండవై తివని నిందించిరి. అపుడు దేవేంద్రుం డామాటలను విని యాగదాన హోమాది సకలధర్మకంట కుండైన శత్రువు, యేయుపాయముచేతనైన, సంహరింపఁ దగినవాఁడు. అట్టివానిని సంహరించి ధర్మమును రక్షించుట, పరమధర్మంబని యార్యులంద్రు .కావుననే వానినివధించితినని చెప్పెను. ఇత్తెరంగెఱింగి యపుడు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు కూడ, సాక్షాత్కరించి లోకకంటకుండైన శత్రువును వధించి యాగాది ధర్మంబులను స్థాపించుట పరమధర్మంబని సురమును లకు బోధించి వారు తమతమ నిలయంబులకు జనిరి. ఋషీ

శ్వరులందఱు వారు చెప్పిన ధర్మము నాకర్ణించి కడుసంతోష ముతో దేవేంద్రుని శ్లాఘించుచు స్వాశ్రమంబున కరిగిరి.

## సప్తమరుత్తులు జనించుట

అటుపిమ్మట కశ్యప ధర్మపత్నియగు దితి వృత్రవధను విని యతిశోకముచేఁ బరితపించుచుఁ గశ్యపునితో నీ వృత్తాంతమును జెప్పి. అయ్యో నే నేమిచేయుదును. నా పుత్రులయిన బలవృత్రుల నిరువురను దేవేంద్రుండు కపటముచే వధించెను. నే నెట్లు జీవింతును. పుత్రశోకము మిక్కిలి దుస్సహామని రోదనము చేసి దేవేంద్రుని వధించు పుత్రునిఁ బ్రసాదింపుమని వేడెను. అపుడు కశ్యపుఁడు కృపార్ద్ర హృదయుండై నీవు శతసంవత్సరంబులు విశేషనియమంబుతోఁ దపంబాచరింపుము. అట్లు చేసితివేని శతాబ్దములు గడచిన పిమ్మట నీ కభిమతుండైన పుత్రుండు జనింపఁ గలఁడని చెప్పి దితితోఁగూడ మేరు పర్వత తపోవనంబున కేగెను. దితి, యచ్చట నివసించి శుచి వ్రతియై యనల మధ్యంబునఁ దీవ్రంబుగాఁ దపం బాచరించుచుండెను. అట్టియెడ, దేవేంద్రుం డీవృత్తాంతమును దెలిసికొని పంచవింశతి వర్షవయో యుక్తుండై, బ్రాహ్మణ రూపంబును దాల్చి యామె సమీపంబున కేగి నమస్కరించి కూరుచుండెను. అపు డాదితి వానింజూచి నీవెవఁడవు, ఇచటి కరుదెంచుటకుఁ గారణంబెయ్యది యన, నమ్మా! నేను నీ పుత్రుండను. సర్వధర్మముల నెఱింగిన విద్వాంసుండను, నీ పాదసేవనముఁ జేయుచు నిచ్చట నివసించెద నని చెప్పెను. అందు కామె సమ్మతించెను. అపు డా దేవేంద్రుండు కపటరూపంబును

దాల్చి ప్రతిదినమందును పత్రపుష్పఫల జలాదుల నతిభక్తితోఁ దెచ్చియిచ్చుచుండెను. ఆరామె యాతని భక్తికి సంతసించి నా పుత్రునితోఁ గూడ, నీవు స్వర్గసుఖము ననుభవింపఁ గలవని వరంబిచ్చెను.

ఆ మాటను విని దేవేంద్రుండు హర్షాన్వితుండై యో తల్లీ ! నీ యనుగ్రహంబువలన నట్టి మహాఫలంబు నాకు సంభవింపఁ గలదని చెప్పి సంతసించి, పూర్వమువలె శుశ్రూషణంబు చేయుచుండెను. మఱియొకప్పుడు శతాబ్దంబులలోఁ గొంచె మవశిష్టమయి యున్న సమయంబునఁ దీవ్ర నియమమును సహింపలేక సంధ్యాకాలమందుఁ బాదప్రక్షాళనము చేయకుండ గనే విముక్త కేశపాశయై పశ్చిమదిశయందు శిరంబునుంచి మేనుమఱచి నిద్రించెను. ఇంద్రుఁ డాఛిద్రమును దెలిసికొని వజ్రహస్తుండై దితిగర్భమందుఁ బ్రవేశించి, యా శిశువును నేడు తునకలుగా నఱికెను. అపు డా శిశువు బిగ్గఱగా రోదనము చేయుచున్నప్పటికిఁ, నేడు తునకలలో నొక్కొక తునకను మరల నేడు తునకలను జేసెను. వారందఱు నలువది తొమ్మిది సంఖ్యాపరిమితి కల మరుత్తులను పేరుగలవారును, మహాతేజోవంతులును, నతి బలపరాక్రమ వంతులును నై దేవేంద్రు నాశ్రయించి దేవలోకమందు నివసించి యుండిరి. అపుడు దితి స్వకృతాపరాధముచే నింద్రుం డిట్లుచేసె నని తెలిసికొని తపంబును విడిచి కశ్యపసమీపంబునకుఁ జనెను. ఇత్తెరంగునఁ గృతత్రేతా ద్వాపరయుగంబులందు పృధు యజ్ఞ వరాహ నృసింహ భార్గవ శ్రీరామాది రూపంబులచే భక్త వత్సలుండును, శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణుండును,

నగు భగవంతుండు దుష్టులయిన హిరణ్యాక్ష హిరణ్యకశిపు లను రావణ కుంభకర్ణాదులను సంహరించి స్వర్గలోకమం దింద్రాది దేవతలను స్థాపించి బ్రోచుచుండును. ఈకథను విన్న వారు సకలపాప విముక్తులయి పరమగతిం బొందెదరు.

## పృథుచక్రవర్తి చరిత్రమును జెప్పుట

అటుపిమ్మట శౌనకుండు పృథూపాఖ్యానంబును జెప్పు మనిన సూతుండు శౌనకునితో నిట్లనియె

మహాతేజోవంతుండును, నారాయణావతారుండును, నగు పృథుచక్రవర్తి చరిత్రము మిక్కిలి పావనమయినది. సకల దురితంబులను నశింపఁజేయును. ధనమును, యశమును స్వర్గ సుఖమును గలుగఁజేయును. బ్రాహ్మణుం డీచరిత్రమును వినిన వేదతత్వార్థజ్ఞుం డగును. క్షత్రియుండు శత్రుజయము కలవాఁ డగును. వైశ్యుండు ధనసమృద్ధుం డగును. శూద్రుండు వినిన యెడల సుఖము కలవాఁడగును. ఈ చరిత్రంబు సకలకల్యాణ దాయకంబు గావున, దేవబ్రాహ్మణులకు నమస్కరించి చెప్పు చున్నాను సావధానుండవై వినుము.

పూర్వకాలమందు మహాప్రాజ్ఞుండును, ధర్మరక్షకుం డును, వేదశాస్త్రార్థకోవిదుండును, సర్వశక్తియుక్తుండును, సర్వజన పరిపాలకుండును నగు నంగుడను యొక భూవల్లభుం డైన మహారాజు కలఁడు. ఆ యంగమహారాజు మృత్యు పుత్రిక యైన సునీథ యను కన్యకం బెండ్లియాడి, యాభార్యయందు ధర్మప్రణాశకుండును, వేదశాస్త్ర విద్వేషియు, దుశ్శీలుండును, లోభమోహ మదసహితుండు నగు వేనుండను పుత్రునిం

గనెను. ఆవేనుండు దినదిన ప్రవర్ధమానుండయి యతి క్రౌర్యముచేఁ బ్రజలను బాధించు చుండెను. అట్టియెడ నొకప్పుడు వేనుండు భృగ్వాది మునీంద్రులం బిలిచి, మీరలు యాగదాన హోమాదులను జేయఁగూడదు. నేను సర్వదేవతారూపుండను. బ్రహ్మవిష్ణురుద్రాత్మకుండను. నన్నే పూజింపవలెను. యాగదాన హోమాదులు నన్ను నుద్దేశించి యాచరింపవలెను. అట్లు చేయనియెడల లోకులను శిక్షించెద నని చెప్పెను. అపుడు భృగ్వాదులందఱు, వేనుని కడకేతెంచి యిట్లుపలికిరి. నరేంద్రా! మేమొక వాక్యము విన్నవించెద మవధరింపుము. వాఙ్మనఃకాయంబులవలనఁ బురుషు లాచరించు ధర్మంబు, శోకమును నశింపఁజేయును. అసంగులయిన వారికి మోక్షము నొసంగును. దుష్టచిత్తులవలనను, దస్కరుల వలనను, ప్రజలు నాశంబు నొందకుండ వారిని రక్షించుచు, యథాన్యాయ్యంబుగ వారలచేఁ గరంబు గొనుచునుండు మహీపతి, యిహపర సౌఖ్యంబులనందు. సర్వదేవతా రూపుండును, సర్వేశ్వరుండును, సర్వవేదమయుండును, నగు నారాయణుం డెవ్వని రాష్ట్రమందు యజ్ఞాదుల చేయింపం బడునట్టి రాజువలన సర్వేశ్వరుండు సంతుష్టుండగు. సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులుఁ బ్రాపించు. కావున నీరాజ్యంబున జ్యోతిష్టోమాది క్రతువుల నాచరింపుఁడని ప్రజలకు నాజ్ఞాపింపుము. ఆ యజ్ఞంబులచే యజ్ఞపురుషుండును, దత్కళారూపంబులయిన దేవగణంబులును, సంతుష్టులగుచు భవదీయ వాంఛితార్థంబుల నిత్తురు. కావున దేవతా

తిరస్కారంబు నీకు యుక్తంబు గాదు. వేదచోదితంబులగు ధర్మంబులం దాసక్తుండవు గమ్మనిన వేనుం డిట్లనియె.

హరి హర హిరణ్యగర్భులును, నింద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలకులును, సర్వదేవతలును, ధరణీశునికంటె వేఱుగా లేరని తెలిసికొని, నను భజింపుఁడు, నాకంటె నగ్ర పూజార్హుండు లేఁడు. కావున నా యాజ్ఞను శిరంబున వహించి నేఁ జెప్పినటులఁ జేయుండని పాపకర్ముండును, నష్టమంగళుం డును నగు వేనుండు పండితమాని యగుచుఁ బలికి భృగ్వాది మునివరుల వచనంబులను నిరాకరించి యూరకుండెను. అట్టి యెడ నమ్మునులు భగ్న మనోరథులయి తమలో నిట్లని తలం చిరి. వీఁడు దారుణ కర్ముండయిన పాపాత్ముండు. వీఁడు మనకు రాజైన వీనిచేత నీ జగంబులు భస్మంబులు గాగలవు. ఇది నిశ్చితంబు దుర్వృత్తుండగు వీఁడు మహారాజ సింహాసనం బునకర్హుండుగాఁడు. వీఁడుయజ్ఞపతియైన శ్రీకృష్ణుని నిందించు వాఁడు గావున వీనిని రాజ్యపదమునుండి తొలగింపఁ జేయ వలయునని తలంచి హుంకారమాత్రంబున నా యీశ్వర నిందా హతుండైన వేనునిఁ బ్రభుశక్తిరహితునిం గావించిరి.

## పృథుచక్రవర్తి యర్చిష్మతిని వివాహంబాడి రాజ్యపాలనము చేయుట

అటుపిమ్మటఁ దస్కరులు సర్వజనుల విత్తములం గొని పోవుచుండిరి. జననాథుం డసమర్థుఁడగుటం జేసి జనపదంబు లరాజకంబులయి, యన్యోన్య హింసల నొందుచు నుండుట యెఱింగి, భృగ్వాది మునీంద్రులందఱు రాజపదభ్రష్టుండైన

వేనుని శరీర సమీపంబున కేతెంచి, బలాత్కారముగాఁ దదూరు మథనముఁ గావింప నందుఁ గృష్ణవర్ణుండును, హ్రస్వాంగుండును, లంబోదరుండును, నగు పురుషునిం గాంచి యిచ్చట నిషీదయనిరి. అపుడు వాఁడామాటను విని భయాతురుండై కూర్చుండెను. తరువాత, వాఁడు నిషాదాభిధానుం డయ్యె. అది మొదలుకొని వాఁడు, పర్వతములయందును, వనములందును, స్వేచ్ఛగాఁ దిరుగుచు నొకస్త్రీనిఁ బెండ్లియాడి వంశాభివృద్ధి నొందెను. ఆవంశమందుఁ బుట్టినవారు భిల్ల నిషాద కిరాత పులింద్ర సంజ్ఞలచేఁ జెప్పంబడుచు వేనశరీర కల్మషమును దమ శరీరమందు దెల్పుచుండిరి. అటుతరువాత ఋషివరులు ప్రసన్నమానసులయి విగతకల్మషుండైన వేనుని దక్షిణబాహువును మథించిరి. ఆబాహువు వలన నాదిత్య సన్నిభుండును, దప్తకాంచన వర్ణాంగుండును, దివ్యమాల్యాంబరాభరణ భూషితుండును, దివ్యగంధానులిప్తుండును, నగు నొకపురుషుండు, లోకరక్షణంబుకొఱకు, నారాయణాంశంబున జనించి, పృథుయశుండగుటచేఁ బృథుచక్రవర్తియను పేరం బ్రసిద్ధుండయ్యె. అప్పుడు శ్రీహరి నిత్యానపాయి మహాలక్ష్మీ కలాకలితంబును, సకలగుణాలంకృతంబును, నగు నొక కాంతామణికూడ జనించెను. అక్కాంతామణియు నర్చిష్మతీనామంబునఁ దనరుచు నాతని వరియించెను. ఆసమయంబున నింద్రాది దేవగణంబులు దేవదుందుభి రవంబులతోఁ బుష్పవర్షమును గురిపించిరి. గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి. పిమ్మట హిరణ్యగర్భుండు, యక్షకిన్నర గంధర్వ సిద్ధవిద్యాధర సుర మునిగణ సహితుండై, యర్చిష్మతీ దేవితోఁగూడ పృథు

చక్రవర్తిని నవరత్నఖచితస్వర్ణ సింహాసనాసీనుం జేసి నానావిధ నదనదీతీర్థములచే నభిషిక్తుం జేసి, యాదిరాజని, రాజరాజని, నామంబిడి, యమందానంద మగ్నహృదయుండై యుండె. అప్పుడు దేవతలును మునులును శంఖచక్ర సరసీరుహాది రేఖాలంకృత హస్తుండగావున నారాయణావతారుండని భావించి నమస్కరించిరి. అటుపిమ్మట బ్రహ్మాది దేవతలును, భృగ్వాది మునిగణంబులును, బ్రహ్మమానస సంకల్ప నిర్మితంబులయిన సూతమాగధ వందిగణంబులం బిలిచి, పృథుచక్రవర్తిని స్తవము చేయుం డని యానతిచ్చిరి. ఇంతకుమున్నం దేకర్మముల నాచరింపక పోవుటచేత భావిగుణములచే స్తుతిని గావించెద మని చెప్పి, యిట్లు స్తవము చేసిరి.

ఇతండు సత్యసంధుండును, సత్యభాషణ పరుండును, వేదవేదాంగ పారంగతుండును, సమరాంగణంబున శత్రుజయంబు కలవాండును, మహావదాన్యుండును, రాజసూయాశ్వమేధాది సర్వక్రతువుల నాచరించువాండును, సకల కల్యాణ గుణసంపన్నుండును, దేవబ్రాహ్మణ పూజకుండును, సకల లోక రక్షకుండును, శమదమాది గుణయుక్తుండును, మహాబల పరాక్రమ సంపన్నుండును, నతిశూరుండును గాగలండు. శంఖచక్రాది రేఖాంకిత పాణిపాదుండు కావున, నితండు నారాయణావతారుండు. ఈయర్చిష్మతీదేవి శ్రీహరికి నిత్యానపాయిని యగు మహాలక్ష్మి. ఈదంపతు లిరువురు నింద్రాది సురగణంబులను, భూసురగణంబులను, సకలప్రజలను న్యాయముగాం బరిపాలింపం గలరని వినుతించిన పృథుచక్రవర్తి తద్వచనముల నాకర్ణించి, యపుడు సూతమాగధ వందులను ధన

వస్త్రభూషణ దానములచేతను, గ్రామాది దానములచేతను, సన్మానించి పంపెను. న్యాయపరిపాలకుండైన ప్రభువు నేటికి మనకు లభించెనని సకలజను లానందమగ్న హృదయులై యుండిరి. అపుడు భూదేవత యతని పరిపాలనశక్తినిఁ బరీక్షింపవలెనని తలంచి ప్రజలు జీవనార్థమయి తనయందు నాటిన ధాన్యాది బీజములను గ్రసనముచేసి వృద్ధినిఁ బొందింపక సస్యములను క్షీణింపఁ జేసెను. అటుపిమ్మటఁ బ్రజలందరు సస్యనాశముచే భయపడి యీసస్యనాశమునకుఁ గారణంబెయ్యదియో తెలియదు. ఆహేతువును దెలిసికొని తాము మమ్ములను రక్షింపుఁడని పృథుచక్రవర్తిని వేడిరి. అపుడు పృథుచక్రవర్తి ధనుర్బాణధరుండై తీక్ష్ణసాయకంబులచే భూదేవతనుఁ గొట్టి పరుగెత్తించెను. అనంతర మాభూదేవత యతని బాణాభిఘాతమును సహింపలేక గజసింహ మహిషీ రూపములను దాల్చి పరుగిడుచుండెను. నీవు ప్రజలను బాధించుచుంటివి గావున నిన్ను నే వధించెదనని తీక్ష్ణసాయకముచే మఱల గొట్టెను. అపుడు భూదేవత గోరూపమును దాల్చి సత్యలోకమున కరిగెను. పిమ్మట విష్ణురుద్రాది లోకలంబుల నీప్రకారము తిరిగితిరిగి యెక్కడికిఁ బోయిన విశ్రాంతి నొందక వెఱచి రక్షించువారిని గానకఁ దనవెనుక ప్రళయకాలాంతకునివలె ధనుర్బాణధరుండై వచ్చుచున్న పృథుచక్రవర్తినిం గాంచి, స్త్రీవధయు, గోవధయు ధర్మజ్ఞుల కనుచితంబులు గావున నన్ను వధించుట నీకు యుక్తంబుగాదు. నీవు శరణాగతరక్షకుండవు, సర్వభూత దయాళుండవు గావున నిన్ను శరణంబు నొందితిని. నన్ను రక్షింపుమని వేడెను.

## భూదేవి నుండి రత్నము లావిర్భవించుట

అటుపిమ్మట పృథుచక్రవర్తి భూదేవతతో నిట్లనియె. సకలప్రజలు నీయందు నాటిన బీజములను గనపడనీయక సస్య రూపముగా వృద్ధినొందింపక ప్రజలను నశింపఁజేయుచుంటివి. కావున నిన్ను వధించుటకు నుద్యమించితిని. నీవు బీజముల నిపుడంకురయుక్తంబులుగాఁ జేయుమని చెప్పెను. ఆమాటను విని భూదేవత, పృథుచక్రవర్తితో నిట్లు పలికెను. ఓరాజోత్తమా! నీవు నన్ను వధించుటకు నుద్యమించితివి. నేను సర్వ ప్రాణులకు నాధారమైన దానను. ఆధారము లేనియెడల సర్వ ప్రాణులు నశించెదరు. నేను లేనియెడల నీప్రాణులందఱు, నెక్కడ నివసింతురనిన, నీకట్టి గర్వముగలదేని నిను వధించి నా తపోమహిమంబుచే సర్వలోకములను వహించెదను. కాఁబట్టి నీ వాగర్వమును విడిచి, సస్యముల నావిర్భవింపఁ జేయుము. అట్లు చేయనియెడల నిన్ను శిక్షించెదనని చెప్పెను. ఆమాటలను విని యపుడు సకలసస్యముల నావిర్భవింపంజేసి ధాన్యాది బీజముల నధికముగా ఫలింపఁజేసెను. అపుడు నిమ్నోన్నత ప్రదేశంబులను సమంబుగాజేసి పర్వతములను దన కోదండాగ్రభాగంబుచే భేదించి పృథుచక్రవర్తి సకల భూమండలమును, సస్యయుక్తముగాఁ జేసెను. అదిమొదలు కొని సకలప్రజలు యింతకు పూర్వ మెన్నడు నిటువంటి భూకాంతుని జూడమైతిమని తలంచుచు నధిక ధనధాన్యాభివృద్ధిచే నమందానంద తుందిల స్వాంతులయి యుండిరి. ఆ పృథుచక్రవర్తి పరిపాలించు కాలమందు బ్రాహ్మణులందఱు

స్వాహాకారంబుచే దేవతలను, స్వధాకారంబుచేఁ బితృదేవతలను, నారాధించుచు వైశ్వదేవాదివిహితకర్మములను, యథావిధిగాఁ జేయుచు నతిథుల ననవరతము పూజించుచుండెడివారు. అపుడు శైలములన్నియు మేరుపర్వతమును దోగ్ధనుగాను, హిమవంతుని వత్సనుగాను జేసి పృథుపాదదిష్టంబైన పృథివివలన మహౌషధులను, రత్నములను, బితికినవి దేవతలు దేవగురువైన బృహస్పతిని బితుకువానిగాను, నిశాకరుని వత్సనుగాను, గల్పించి యవవ్రీహ్యాది రూపమగు క్షీరమును బితికిరి. పితృదేవతలందఱు నంతకుని దోగ్ధనుగాను, యముని వత్సనుగాను, జేసి కవ్యరూపంబైన క్షీరమును బితికిరి. అంతకుండని, యముండని, కాలుండని, యమధర్మరాజుకు రూపభేదంబులు కలవు. కావున, యముండు వత్సయుని, యంతకుండు దోగ్ధయుని, చెప్పంబడెను. ధృతరాష్ట్రుండను సర్పశ్రేష్ఠమును, దోగ్ధను గావించి, తక్షకుని వత్సనుగాఁ జేసి నాగలోకమున నివసించు సర్పములన్నియు విషరూపంబైన క్షీరమును బితికినవి.

ఈప్రకారము యక్షరాక్షస పిశాచాది గణంబులలో ముఖ్యమగు వానిని వత్సనుగాఁజేసి, వారందఱు నభీష్టార్థములను గైకొనిరి. ఈ పృథువువలన రక్షింపఁబడినది కావున భూమి పృథివి యను నామంబునఁ బ్రసిద్ధి నొందెె. ఈపృథుచక్రవర్తి సకలవర్ణాశ్రమాది ధర్మస్థాపకుండు గావున విష్ణుబ్రహ్మేంద్ర రుద్రాదిమరుద్గణంబులవలె నమస్కార్యుండై యాదిరాజను బ్రసిద్ధిచేఁ బృథుయశంబు నొందెె. ధనుర్విద్యావిశారదులును; శత్రుజయమునుగోరు భూపాలురును, నీపృథు

చక్రవర్తిని నమస్కరించిన ధనుర్విద్యా శత్రుజయలాభంబుల నొందెదరు. ఇట్టు పరమపావనంబయిన పృథూపాఖ్యానంబును మీకుఁ దెలియఁజేసితిని. ఈ యుపాఖ్యానంబును విన్నవారును బఠించినవారును ధనంబునుఁ బృథుయశంబును వివిధభోగంబులను బొంది విగతపాపులయి యజ్ఞేశ్వరుండును, సర్వజ్ఞుండును సర్వాత్మకుండును నగు శ్రీమహావిష్ణుని లోకంబు నొందఁ గలరు.

## వేనుని చరిత్రమును విస్తరించి వర్ణించుట

శౌనకాది మునివరులు వేనుని చరిత్రమును విస్తరించి చెప్పుమనిన సూతుండు శౌనకాది మునివరులతో నిట్లనియె. పృథుచక్రవర్తి జనించిన పిదప నీవేనుండు, గంగాయమునా నర్మదాది తీర్థదర్శన స్పర్శనములచేఁ గిరాత నిషాద పులింద్రాదులు విగత పాపులయి పరిశుద్ధులయిన చందంబున నితని సంపర్కముచే విగతపాపుండై ధార్మికుండయ్యె. ఈవేనుని పూర్వకాల చరిత్రమును జెప్పుచున్నాను సావధాన చిత్తులయి వినుండు. పూర్వకాలమందు మృత్యుదేవతకు సునీథ యను పుత్రిక జనించెను ఆచిన్నది దినదిన ప్రవర్ధమానయై రంభ మొదలయిన సఖీజనంబుతోఁగూడ నుద్యాన వనములయందు విహరించుచు వీణాగానాది వ్యాపారంబులచే నానందించుచుండెను. అట్టియెడ నొకప్పు డాయుద్యాన వనమందు సుందరాంగుండైన సుశంఖుఁడను గంధర్వతనయుండు గానవిద్యాసిద్ధికొఱకు సరస్వతి నుద్దేశించి తపం బాచరించు సమయంబున నీసునీథ సఖీజనములతోఁగూడ నచటి కేఁగి గానము చేయుచు

నతనికిఁ దపోభంగము గావించెను. అపు డతండు తపంబున కంతరాయమును గలుగఁజేసినను క్రోధముం బొందక నతి శాంతుండై మరలఁ దపం బాచరించు చుండెను. ఈసునీథ గృహమునుండి బయలువెడలి యుద్యాన వనమం దనుదినము క్రీడలను సలుపుచు నచటికేఁగి సఖీజనములతోఁగూడ గానము చేయుచు సుశంఖుని తపోభంగమును దఱుచుగాఁ జేయు చుండెను. అప్పు డప్పుడు కఱ్ఱతోఁగూడఁ గొట్టుచుండెడిది. అతం డీతపోభంగ క్లేశమును గొన్నిదినములు సహించి పిమ్మట సహింపలేక రోషారుణ లోచనుండై, ఓకన్యకామణీ! నీవు భర్తతో గృహస్థాశ్రమధర్మముల నాచరించు సమయంబున నీకుఁ బాపరతుండును, దేవబ్రాహ్మణ నిందకుండును, శ్రుతి స్మృతి విహిత కర్మములందు ద్వేషియు నగు పుత్రుఁడు జనింప గలఁడని, శపించి యాగంధర్వతనయుండు మఱియొక స్థానంబున కేగి పూర్వము వలెఁ దపం బాచరించు చుండెను.

అటుపిమ్మట నొకప్పుడు సుర సిద్ధ సాధ్య యక్ష కిన్నర గంధర్వసేవితుండును, నవరత్న ఖచిత సువర్ణదండ కలిత శ్వేత ఛత్ర చామర శోభితుండును, వామపార్శ్వస్థిత శచీసమన్వితుండును నగు దేవేంద్రుం డప్సరోగణ కృతంబయిన నృత్తగీత లయధ్వనులచే వినోదించుచు నందనవనమందలి పారిజాత వాటికలయందును, హరిచందన వాటికలయందును, జంద్రఁ బింబాననయుఁ గమల దళాయతాక్షియు నగు శచీదేవినిం గూడి వివిధభోగంబుల ననుభవించు చుండెను. అపు డత్రివంశ సముద్భవుండైన యంగమహారాజు దేవరాజ వైభవమును గాంచి యానంద మగ్నహృదయుండై యీదేవరాజు మిక్కిలి

ధన్యుండు. అధిక తపోబలంబుచే నిట్టి భోగముల ననుభవించు చున్నవాఁడు. ఇతనితో సమానుండును సకలలోక ప్రధానుం డును నగు పుత్రుండు నాకు జనించినయెడల నేను మహా సౌఖ్యము నొందఁగలనని సహస్రాక్ష వైభవంబును గొనియాడుచు స్వగృహంబున కరుదెంచి యత్రిమహర్షికి నమస్కరించి యేసుకృత కర్మముచే సహస్రాక్షుండు నందనవనము నిట్టి వైభవము నొందుచుండెను. నా కిట్టి వైభవంబుకల పుత్రుం డెట్లు జనించును. నాయందుఁ గృపార్ద్రహృదయుండవై చెప్పుమని ప్రార్థింప నత్రిమహర్షి యాయంగభూపాలునితో నిట్లనియె.

పూర్వకాలమందు సోమశర్మయను విప్రోత్తముండు కలఁడు. అతండు వసిష్ఠాశ్రమంబున కేఁగి యా మహాత్మునకు సాష్టాంగ దండప్రణామము గావించి సుగుణాన్వితుండైన పుత్రుండును మనోనుకూలప్రియ కళత్రంబును క్షేత్రవిత్తాది కంబును నైహికాముష్మిక నానా విధ భోగంబులును నేసుకృత కర్మంబుచే సంభవింపఁ గలవనిన, సోమశర్మతో వసిష్ఠుం డిట్లనియెను. ఓబ్రాహ్మణోత్తమా ! నీవడిగిన ప్రశ్నము సకల లోక హితకరమైనదియు మిక్కిలి శ్లాఘ్యమైనదియుఁ గావున నేను జెప్పుచున్నాను. సావధానుండవై వినుము. సర్వజ్ఞుండును, సర్వేశ్వరుండును, భక్తాభీష్ట ఫలప్రదుండును నగు శ్రీమహా విష్ణువు నారాధించువారు సకలాభీష్టఫలముల నొందఁగలరు. మహదైశ్వర్య సంపన్నుండగు శ్రీపతి నీను నిరంతరధ్యాన పూజావందనాదులచేఁ బ్రసన్నుండై భుక్తిముక్తులనిచ్చి రక్షించు. కావున నీవా మహాత్ముని నజస్రధ్యాన ప్రణవచిత్తుం డవై భజియింపు మని చెప్పినఁ దద్వచనంబుల నాకర్ణించి,

వసిష్ఠునకుఁ బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి యా సోమశర్మ మహర్షి జనసేవ్యంబైన గంగాతీరంబున కేఁగి కృత స్నానుండై కుశాసనంబునఁ గూర్చుండి జితస్వానుండును, జితేంద్రియుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుఁ గొంతకాలంబునకు విష్ణుప్రసాదంబుచేఁ గాంక్షితంబైన పుత్ర మిత్ర కళత్ర పశువిత్తాది సుఖంబుల నొంది, పునరావృత్తి రహితంబగు మోక్షంబు నొందెను. ఆసోమశర్మకుఁ దనయుం డై జనించి సువ్రతుండను విప్రోత్తముండు చిరకాలము తపం బాచరించి, గోవింద పదారవింద ధ్యానంబుచే నింద్రుండై సురసిద్ధ సాధ్యయక్షకిన్నర గంధర్వ పూజితంబైన స్వర్గలోకంబు నధిష్ఠించి యిట్టి మహావైభవంబు నొంది వివిధదివ్యభోగంబుల ననుభవించు చుండె. కాఁబట్టి నీవును గోవిందపదారవింద ధ్యానంబుసేయుము. మధుసూదన ప్రసాదంబువలన నట్టి యభీష్టార్థంబుల నొందఁగలవనిన నత్రివచనంబులను నంగ భూపాలుండు విని నవరత్న కాంచన భూషితంబైన మేరుపర్వత శృంగంబున కేగెను.

ఆమేరు పర్వతము కాంచనప్రదేశ సంకలితంబును నానామణి విరాజితంబును గావున ననేకులయిన గంధర్వులును కిన్నరులును నప్సరోగణంబులతోఁ గూడ వీణామృదంగాదులచే నృత్తగీత వాద్యంబులను జేయుచు విహరించు చుండిరి. అట్టియెడ నాపర్వత శిఖరాగ్రభాగమందు నంగభూపాలుండు గంగాతీరమందు వేదశాస్త్రార్థతత్వజ్ఞులును, నిత్యాగ్న్యుపాసకులును, దీవ్ర తపస్సంపన్నులును నగు మహర్షి వర్గముతోఁ గూడ నివసించి యమనియమ ప్రాణాయామాద సమేతుండై

విశ్వంబంతయు విష్ణుమయంబని భావించి, హృదయాంబుజంబున నరవిందాక్షుని ధ్యానించుచుఁ దన్మయుండై శతసంవత్సరంబులు తీవ్రతపం బాచరించెను. కొంతకాలమైన పిమ్మట నింద్రాది సురగణ కల్పితంబులైన మహామాయలచే గజ వరాహ సింహశార్దూల శరభాది మృగయూథంబులును, నతి భయంకరాకార యక్షరాక్షస వర్గంబులును, బయలువెడలి తపంబున కంతరాయము గావించినవి. ఆవిఘ్నములను నంగ భూపాలుండు విష్ణుధ్యాన బలంబుచే నిరాకరించెను.

అపుడు మహావిష్ణు వతని తపోనియమంబుచేతను భక్తిచేతను సంతసించి సాక్షాత్కరించి యభీష్టంబైన వరము నొసంగెద, వేడుమనిన, నారాజన్య చూడామణి లేచి, సాష్టాంగ దండ ప్రణామము గావించి, యిట్లు స్తుతిచేసెను. ఓ పరమేశ్వరా! నీవు సర్వభూతాంతర్యామివి. సర్వజ్ఞుండవు. సర్వాత్మకుండవు. అసంగ చిదానంద మయుండవు. మాయాతీతుండవైనను, మాయచే సకలకల్యాణ గుణాన్వితుండవు. మాయా మోహవినాశకుండవు. మత్స్యకూర్మా ద్యవతారంబులచే దుష్టచిత్తులను నిగ్రహించి, శిష్టపరిపాలనంబు గావించి, సకల ధర్మములను రక్షించుచుందువు. నీకు నమస్కారము. అని స్తుతిచేసి, నీకు నేను దాసుండను. నీవు భక్తవత్సలుండవు గావున నంతరిక్షమందుఁ బ్రకాశించు చంద్రునివలె సకల లోకాహ్లాద కరుండును, సర్వదేవబ్రాహ్మణ ప్రియుండును, ధర్మజ్ఞాన సంపన్నుండును, త్రైలోక్య రక్షకుండును, సత్య ధర్మ పరాయణుండును, నీభక్తులలో నగ్రగణ్యుండును, వంశాభివృద్ధి కరుండును, శూరుండును, జితేంద్రియుండును, సుశీ

లుండును, సర్వశాస్త్రార్థ కోవిదుండును, నగు పుత్రునిఁ బ్రసాదింపు మని వేడెను. అపుడు పుండరీకాక్షుం డామాటలను విని రాజేంద్రా! నీవు మృత్యుదేవతాపుత్రికయగు సునీథయను కన్యకం బెండ్లియాడి గృహస్థాశ్రమ ధర్మముల నాచరింపుము. సుశంఖశాపదగ్ధయగు నామె యందుఁ గామక్రోధావిష్ట చిత్తుండును, దేవబ్రాహ్మణ నిందకుండును, వేదవిహిత సుకృతకర్మ ద్వేషియు నగు పుత్రుండు జనింపఁ గలఁడు. అటుపిమ్మట లోకంబునకుఁ గృతాపరాధుండగు నాతనిని మహర్షి జనవర్గంబు శాసించి, తదూరుమథనంబు గావించుటవలన గతకల్మషుండై శుద్ధుండు కాఁగలఁడు. అనంతరము మహర్షి జనకృతంబైన దక్షిణ బాహుమథనంబు వలన వేనపుత్రుండగు పృథుచక్రవర్తి పుట్టఁ గలఁడు. పృథుచక్రవర్తి సంబంధముచే నతండు నీవు కోరిన గుణములు కలవాఁడై పితృపితామహాదులను దరింపఁ జేయఁగలఁడు. ఆతనిచే నీవంశము ప్రఖ్యాతిం జెందఁగలదు. నీవు మత్ప్రసాదంబువలన ముక్తిం బొందఁ గలవని యంగ భూపాలునితోఁ జెప్పి శ్రీనాథుం డంతర్హితుండయ్యె.

అటుపిమ్మట నంగభూపాలుండు మేరుపర్వత గుహ యందే, నివసించి యుండి మరల తపం బాచరించు చుండెను. సుశంఖుఁడు శపించిన పిమ్మట నాసునీథ, తచ్ఛాపంబుచేఁ బరితపించుచు స్వగృహంబున కేఁగి యతిదుఃఖముతో నీవృత్తాంతమును దండ్రితోఁ జెప్పెను. అపు డతండు కడుదుఃఖము నొంది, కామక్రోధ విహీనుండును, ధర్మవత్సలుండును, దేవతాధ్యాన పరుండును, గంధర్వ తనయుండును నగు సుశంఖునికి మహాపరాధ మొనర్చితివి. అతఁడు కడుశాంతుండు గావునఁ

గొంతకాలము సహించి తఱచుగా నీవు చేయు వీణాగానంబు చేతను, దండాభిఘాతంబుచేతను నంతరాయంబులను సహింపలేక దుష్పుత్ర శాపంబిచ్చెను. నీవు దుఃఖింపక ధైర్యముతో నుండుము. విష్ణుధ్యానముచేతను, దానముచేతను, సజ్జనసంగతి చేతను, గంగాస్నాన పానదర్శన స్పర్శములచేతను శుద్ధి నొంది సుఖమున వర్తింతువు. అనేకులైన మహామును లీధర్మముచే విగత పాపులై పరిశుద్ధులైరి. కాంచనంబు వహ్నిసంపర్కంబుచే మరల రహితంబై శుద్ధంబైన చందంబున నీవును విష్ణుధ్యానాది ధర్మంబులచే శుద్ధి నొంది సకలసుఖంబులం బొందగలవని యముండు సునీథను నూరార్చి విరమించెను.

అనంతర మాసునీథ, తండ్రిబోధించిన వాక్యములను విని, యతని పాదములకు నమస్కరించి, కామక్రోధములను, బాలచేష్టలను, కపటమును విడిచి చింతాన్వితయై నిర్జన వనంబున కేఁగి తపంబాచరించు సమయంబున రంభాది సఖీజనంబు చనుదెంచి, నీవు మిక్కిలి దుఃఖము గలదానివలెఁ గనఁబడు చున్నావు. చింత, బలమును, తేజమును, సౌఖ్యమును నశింపఁ జేయును. కాఁబట్టి ధైర్యము నవలంబించి చింతను విడువుము. నీచింతాకారణమును దెలియఁజేయు మనిన నాసునీథ రంభాది సఖీజనంబుతో నొక వాక్యమును బలికెను.

ఓచెలియలారా! నావృత్తాంతమును జెప్పెద. సావధాన చిత్తములతో వినుండు. నా సౌందర్యమును, యౌవనమును జూచి, మాతండ్రి, గుణవంతుండైన వరుని కొఱకు నియ్యవలెనని తలంచి దేవతలతోను, మునీశ్వరులతోను గ్రమముగా నిట్లు సంభాషించెను. నాపుత్రిక యగు సునీథ,

సుగుణశీలయుఁ, జారులోచనయు, సుందరాంగియుఁ గావునఁ బాణిగ్రహణము చేసికొనుమని యొక్కకరితోఁ గ్రమముగాఁ జెప్పెను. అపుడు మహామునులును, దేవతలును, నీకన్యక, గుణాఢ్యయైనను దుష్టచిత్తుఁడగు పుత్రుఁడు జనింపఁగలఁడని యీపుత్రికను సుశంఖుఁడను గంధర్వతనయుండు శపించెను. గంగాజల సంపూర్ణ మగు కుంభము సురాబిందు సంయుక్తమై మద్యకుంభమైన చందంబున నీశాపదోషము చేతఁ బాపాత్ముండగు పుత్రునిఁ బడయఁగలదు. తత్సంసర్గమువలనఁ గులము పాపబహుళంబగు. కావున మఱియొక వరునికొఱకు నిచ్చుటకై ప్రయత్నింపు మని సురముని గంధర్వులందఱు నిరాకరించిన, నపుడు మాతండ్రి, వారిచేఁ బరిత్యక్తుండై దుఃఖపీడితుండయ్యె. నే నాకారణముచే దుఃఖించుచు వనము నాశ్రయించి యమ నియమాదులచేఁ గాయశోషణ మొనర్చి ధ్యాన పూజావంద నాదులచే శ్రీమహావిష్ణువు నారాధించు చుంటిని. నాదుఃఖ హేతువైన కర్మమును మీకుఁ దెలియఁజేసితి నని చెప్పి సునీథ విరమించెను.

అపుడు రంభాది సఖీజనము సునీథంగాంచి యిట్లనియె. దుఃఖము, కాయ వినాశకరంబు గావున నాదుఃఖమును బరిత్యజింపుము. సకల కులము దోషాన్వితంబై యొప్పుచుండు. నేనుఁ గొన్ని దోషములఁ జెప్పెద వినుము. కారణాంతరముచే బ్రహ్మదేవుం డపూజ్యుం డయ్యెను. దేవతాసార్వభౌముండగు దేవేంద్రుండు వృత్రాసురవధచే బ్రహ్మహత్యాన్వితుండును, గౌతమ ధర్మపత్నియగు నహల్యా సంసర్గముచేఁ బరదారాభిగామినియు నై యొప్పుచుండెను. మహేశ్వరుండు బ్రహ్మశిరచ్ఛేదము చేఁ

గపాలహస్తుండయ్యెను. నిమిశాపంబుచే వసిష్ఠుండు పతిత శరీరుండై మఱియొక జన్మము నొందెను. మహావిష్ణువు భృగు శాపంబుచే రామావతారమందు సీతావియోగ దుఃఖము నొందెను. చంద్రుండు గురుదారరతుండై కలాక్షయాన్వితుండయ్యె. పాండుపుత్రుండగు యుధిష్ఠిరుండు ధనుర్విద్యాచార్యుండైన ద్రోణుని వధకొఱకు ననృతంబుపలికె. వీరలందఱి యందును వైగుణ్యము కలదు. కావున నీ స్వల్పదోషముచే నీవు దుఃఖింపకుము. నీ శరీరమందుఁ గల్యాణాస్పదంబైన గుణంబులు గలవు. ఉత్తమస్త్రీలకు రూపము ప్రథమభూషణము. శీలము ద్వితీయభూషణము. సత్యము తృతీయము. ఆర్యజన శ్లాఘ్యత్వము చతుర్థము. ధర్మాచరణము పంచమము. పాతివ్రత్యము షష్ఠగుణము. మధురవచనము సప్తమము. మంగళ గాన మష్టమము. వివిధభోగానుభవము నవమము. నీవీ గుణములు కలదానవగుటచే సకలక్షేమముల నొందఁగలవు. ఏ యుపాయంబుచే మహాత్ముండగు వరునిం బొందఁగలవో యట్టియుపాయమును జెప్పెద వినుమనిన, రంభాది సఖీజనముతో సునీథ యిట్లనియె. సజ్జనహృదయంబు కృపార్ద్రంబై యుండు. నాయం దధిక ప్రేమ కలదేని యట్టి యుపాయమును జెప్పు మనిన, సఖీజనమధ్యమందుఁ గూర్చుండి రంభ మృత్యుకన్య యగు సునీథతో నిట్లనియె. మాయావంతులగు పురుషులకుఁగూడ మోహకరంబును సర్వమంగళ దాయకంబును నగు నొక విద్యను జెప్పుచున్నాను. ఆ విద్యాబలంబుచే నభీష్టార్థంబు నొందఁ గలవని పలికె సకల దేవ ముని గణంబులకును

మోహాకరంబును, నంతర్ధానమును గలుగఁజేయు నొకవిద్య నొసంగి యా సుశీధతోఁగూడ నందనవనంబున కరిగెను.

అటుపిమ్మట రంభతోఁగూడ సుశీధ; యతిరమ్యంబును, నానావిధ రత్నకాంచన విరాజితంబును, ననేక మృగయూథ సంకులంబును, సురసిద్ధ సాధ్య యక్షకిన్నర గంధర్వ శోభితంబును, నగు మేరుపర్వత శిఖరంబున కేఁగి, సువర్ణ శృంఖలానిబద్ధంబగు నుయ్యెల నూగుచు, సకల సురమునిగణ మోహాకరంబైన యతిసుందరాకారమును ధరించి, రంభాది సఖీజనాన్వితయై యతి శ్రావ్యముగా వీణాగానము చేయుచుండెను. అపుడు విజనప్రదేశ మందుండు మేరుపర్వత గుహాయందు మరల జనార్దనుని ధ్యానించుచున్న యంగభూపాలుండు, సుస్వరయుక్తంబును, సుమనోహరంబును, తాళ లయాన్వితంబును నగు వీణాగాన ధ్వనిని విని, యాసనమువలన నతి శీఘ్రముగా లేచి, నలుదిశలం బరికించుచు నుయ్యెల నూఁగుచున్న సుందరాంగి యగు నాసుశీధ నవలోకించి, వీణాగానముచేతను, సౌందర్యము చేతను మోహిత చిత్తుండై; స్వేద కంపాది సాత్వికభావముల నొంది, మన్మథ శరాహతిచే దూయమాన మానసుండై, సుశీధతో నొక వాక్యమును బలికెను. ఓ చిన్నదానా! నీ వెవ్వరిదానవు; సఖీజన పరివృతురాలవై యీ నందన వనమునకుఁ జనుదెంచిన కారణం బెయ్యది? నీ సౌందర్యమును జూచి మదన బాణాభిహతుండనై కామాకులిత స్వాంతుండ నైతి ననినఁ; దద్వచనముల నాకర్ణించి యా సుశీధ కనుసంజ్ఞచే రంభను దనవృత్తాంతమును జెప్పుమని ప్రేరణము చేసెను.

అపు డంగమహారాజుతో రంభ యిట్లనియె. ఓ మహారాజా! మహాత్ముండగు ధర్మదేవతకుఁ గుమార్తెయైన యీ సునీథ మాకు మిక్కిలి ప్రియమైన సఖురాలు. ఈ కన్యక వేదశాస్త్రార్థ కోవిదుండును, శమదమాన్వితుండును, దపోనిధియు, ధర్మజ్ఞుండును నగు పతిని గోరుచు మాతోఁగూడ నీ నందనవనమందు విహరించుచున్నదనినఁ దద్వాక్యమును విని నేనుఁ జిరకాలము పుత్రార్థినై సర్వవిశ్వమయుండగు విష్ణువు నారాధించితిని, భక్తాభీష్టఫలప్రదుండగు నావిష్ణువు ఒక కన్యకం బరిణయంబై నీ కభీష్టంబైన పుత్రునిం బొందఁగల వని చెప్పి యంతర్హితుండయ్యె. అది మొదలుకొని పుణ్యవీర్యము గల యొక మహాత్ముని కన్యకను బరిణయంబుకొఱకుఁ బ్రతీక్షించుచుంటిని. ధర్మపుత్రికయైన యీసునీథ కాంతునిఁ గోరిన యెడల గాంధర్వవిధిచే వివాహంబు చేసికొనెదనని పలికెను. అపుడు రంభ యీ కన్యకా గుణదోషంబులను గ్రహింపక గాంధర్వవిధిచే బరిణయంబై ధర్మపత్నినిగా స్వీకరింపు మని పలికి సఖీజనముతోఁగూడ స్వగృహమున కరిగెను. పిమ్మట నాకన్యకను గాంధర్వ విధిచేఁ బరిణయంబై నందనవనమందు స్వేచ్ఛగాఁ గ్రీడించుచుఁ గొంతకాలము గడచినపిమ్మట సర్వలక్షణ సంయుతుండైన వేనుండను నొక కుమారునిం గనెను.

అనుసీథా తనయుండు వేదశాస్త్రార్థ కోవిదుండును, ధనుర్వేద పారంగతుండును, ప్రభుమంత్రోత్సాహ శక్తియుక్తుండును, సర్వ తేజస్సమన్వితుండును నగుచు నంతరిక్షమందుండు చంద్రునివలెఁ బ్రకాశించు చుండెను. అనంతర మరాజకమగు జనపదమందుఁ దస్కరాదులచేఁ బ్రజలు పీడితు

లగుటం జేసి మహామును లందఱు నావేనుని రాజ్యపదవమం దభిషిక్తుం గావించిరి. అనంతర మాసునీథ గంధర్వ శాపంబుచే శంకించుచు, పుత్రకా! నేను ధర్మపుత్రికను. నీ తండ్రియగు నంగమహారాజు ధర్మతత్త్వజ్ఞుండు. కావున నీవును ధర్మతత్పరుండవై యీభూమండలమందు సుఖముగాఁ బ్రజలను బాలింపు మని తల్లియైన సునీథ యనుదినము బోధించుచుండెడిది. వేనుఁ డామాటలను విని ధర్మతత్పరుండై ప్రజలను బాలించుచుండగాఁ బ్రజలందఱును ధర్మతత్పరులై యెల్లప్పుడు ధర్మము నాచరించుచు సుఖముగా నుండిరి.

వేనుండు పట్టాభిషిక్తుండై కొంతకాలము ధర్మముగాఁ బరిపాలించిన పిమ్మటఁ బాపప్రవర్తనుండై సంచరించుటకుఁ గారణం బెయ్యది యనిన, శౌనకునితో సూతుం డిట్లనియె. వేనుండు ధర్మముగాఁ బ్రజలను బరిపాలించు సమయంబున నొకప్పుడు జైనమత ప్రవర్తకుండును, అర్హద్దేవతోపాసకుండును, మహాకాయుండును, మహాతేజోయుతుండును, ఆపాదమస్తక లంబమాన కాషాయవర్ణ కంచుకధారియు నగు నగ్నుండొకఁడు నారికేళ పాత్రంబును జేతం బూని సభాస్థలి యందుఁ బ్రవేశించెను. వానింజూచి వేనుండు, నీవెవ్వండవు, నీకులాచార ధర్మంబులను మాకు నిజముగా బోధింపుమనిన నావేన భూపాలునితో జైనమత ప్రవిష్టుండైన నగ్నుండిట్లనియె. ఓరాజోత్తమా! నేను ధర్మస్వరూపుండను, సకలమానవులకును, సకలదేవతలకును, మిక్కిలి పూజ్యుండను. సంధ్యాయాగ హోమాది కర్మంబులును, బ్రహ్మయజ్ఞ పితృతర్పణ వైశ్వదేవాది కర్మంబులును, పితృశ్రాద్ధాదికంబును నిష్ఫలంబు

లని తెలిసికొనవలెను. ధనాకర్షణముకొఱకు వంచక జన కల్పితములుగాని వేఱొకటి కాదు. స్వర్గనరకములు, ధర్మాధర్మములు, వీనివలనఁ బుట్టిన సుఖదుఃఖంబులు, మిథ్య యని యెఱుంగుము. చూర్ణ క్రముక నాగవల్లీదళ సంయోగంబువలన మదశక్తి జనించినటుల, పంచమహాభూత సమ్మేళనంబువలన చైతన్యశక్తి కలుగుచున్నయది. ఒక ప్రత్యక్షమే ప్రమాణము. తదితర వేదశాస్త్రంబు లప్రమాణంబులు. అర్హంతుండు నాకు దేవుండు. అహింస పరముధర్మము గావున సకలభూతములందు దయకలవాఁడనై వర్తింతును. కాఁబట్టి నీవర్హంతుని సేవింపుము. ధూర్త ప్రలాపితంబైన వేదంబును, దానిచే బోధితంబైన కర్మంబును బరిత్యజింపు మనిన నా వేనుండు, నగ్నుండును మహాపాపియు నగు జైనుండు బోధించిన మార్గమును, సుశంఖ శాపప్రాప్తంబైన పాప కర్మంబువలన విశ్వసించి యతని పాదములకు నమస్కరించి పిమ్మట నాధర్మములను దా నాచరించుచు నిట్లాచరింపవలె నని సకల లోకులను శాసించెను.

అటుపిమ్మట ప్రజలందఱు రాజశాసనమువలనఁ బుణ్యముల నాచరించుట నిష్ప్రయోజనంబని తలంచి వేదాధ్యయన యాగదాన హోమాది వర్జితులయిరి. అపుడు వేనుని తల్లిదండ్రులు రాజవృత్తాంతమును, ప్రజలవృత్తాంతమును దెలిసికొని వేనునితో నిట్లనిరి. ఓపుత్రకా! నీవు శ్రుతిస్మృతి విహిత కర్మముల నాచరింపుము. జైనమత ప్రవిష్టులు నరకదుఃఖము నొందఁగలరు. ధర్మవిముఖుండైన జనవిభుండు భగవదనుగ్రహ రహితుండై మృగ పక్షి విడ్వరాహాది యోనులందు జనించి

మిక్కిలి దుఃఖముల ననుభవించు గావున ధర్మమార్గ తత్ప రుండవై నీవు ప్రజలను వేదవిహిత మార్గమందుఁ బ్రవర్తింపఁ జేయుము. పుణ్యకర్మముల నాచరించుఁ బ్రజలును, జన విభుండును, స్వర్గాది లోకసుఖము ననుభవింపఁ గలరు. కాఁబట్టి యీ జైనమతమును బరిత్యజించి వేదవిహితంబైన ధర్మ మార్గము నవలంబింపు మని బోధించినఁ దద్వాక్యముల నంగీకరింపక జైనమత ధర్మమే సర్వోత్కృష్టమయినది. నేనా ధర్మములను విడువనని తల్లిదండ్రులతోఁ జెప్పి తా నాచరిం చుచుఁ బ్రజలచే నాచరింపఁ జేయుచు ధర్మవిముఖుండై యుండె. అపుడు భృగ్వాది మునీంద్రులందఱు వేనుని కడకుఁ జనుదెంచి రాజోత్తమా ! నీవు సాహసమును జేయకుము. ధర్మాధర్మం బులును, చరాచరాత్మకంబైన లోకంబులును, రాజాధీనంబులు గావున నీవు ధర్మమార్గ తత్పరుండవై యాగదాన హోమాదుల నాచరించుచుఁ బ్రజల నాచరింపఁ జేయుము. భూపాల కృతంబయిన ధర్మంబుచేఁ బ్రజలు సుఖముగా జీవింతురు. తత్కృతాధర్మంబుచే నశించెదరు.

కలియుగమందు మ్లేచ్ఛాచారంబులును జైనధర్మంబు లును బ్రవర్తింపఁగలవు. అపుడు కల్కిరూపుండై భగవంతుం డా యధర్మంబులను గలియుగాంతమున నశింపఁ జేయును. కృతాది యుగత్రయమందును మ్లేచ్ఛాచారపరులను బౌద్ధ జైనాది మతధర్మపరులను, ధర్మపరిపాలకుండును నరక్షిత రక్ష కుండును నగు పుండరీకాక్షుండు నశింపఁజేయఁగలఁడు. ఇపుడు కృతయుగంబు కావున జైనధర్మ ప్రవృత్తికిఁ గొంచమైన నవ కాశము లేదు. కాఁబట్టి నీ విపుడు జైనమత ధర్మములను

విదురు మనినఁ దద్వచనంబుల నాకర్ణించి వేనుండు మందస్మిత వదనారవిందుండై జారస్త్రీలు జారునియందు భక్తి కలిగి మెలగు చందంబున పరిపాలక భర్తృస్నేహ విహీనులయిన మీకు యజ్ఞపురుషునియందు భక్తి కలుగుట మిక్కిలి యాశ్చర్యకరంబైనది. నాకంటే నీవసుధామండలమందు నగ్రపూజార్హుండైన యజ్ఞేశ్వరుం డెవ్వఁడు. నాకనభిమతంబైన మార్గమును బోధించుటచే మిమ్ములను శిక్షించెద నని చెప్పెను. అపుడు భృగ్వాది మునీంద్రులందఱు దుర్వృత్తుండగు వేనుండు భూపరిపాలకుం డయ్యెనేని సకలధర్మ నాశంబుచే లోకంబులు నశింపఁ గలవని తలంచి వీఁడు రాజసింహాసనమున కనర్హుండని యాలోచించి ప్రభుశక్తి రహితునిం జేసి, బలాత్కారముగా వానిం బట్టుకొని తదూరువును మథించి నిషాదునిఁ బుట్టించిరి. ఈనిషాదునివలన భిల్లశబర కిరాతాదులు జనించి యీవేన భూపాలుని శరీరకల్మషమును దమశరీరమందుఁ దెల్పుచుండిరి. అటుపిమ్మట లోకం బరాజకంబగుటవలన దస్యుకృతంబైన ప్రజాదుఃఖంబు నవలోకించి వేనభూపాలుని దక్షిణ బాహువును మథించి నారాయణావతారుండైన పృథుచక్రవర్తిని జనింపం జేసిరి. తరువాత పృథుచక్రవర్తి సంబంధంబువలనఁ బవిత్రశరీరుండై చక్రవర్తి పదము ననుభవించి చక్రపాణి యనుగ్రహంబు వలన వైష్ణవలోకము నొందెను.

అనంతర మా వేనుండు విగతపాపుండై స్వర్గాదిలోకంబుల నొందుటకుఁ గారణంబెయ్యది విస్తరించి యావృత్తాంతమును జెప్పుమనిన శౌనకునితో సూతుం డిట్లనియె. మహాత్ములయిన భృగ్వాది మునీంద్రుల దర్శన సంభాషణాదులచేతను,

నారాయణావతారుండైన పృథుచక్రవర్తి సంబంధము చేతను, గామక్రోధ వర్జితుండును, నిర్మల స్వాంతుండును నగుచు నర్మదాదక్షిణ కూలమందుండు తృణబింద్వాశ్రమ మందు వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రంబుచే శతవర్షంబులు తీవ్ర తపం బాచరించెను. అనంతరము మహావిష్ణువు ప్రసన్నుండై యభీష్టంబయిన వరంబు నొసంగెద వేడుమనిన, నపు డా వేనుండు భగవంతునితో నిట్లనియె. ఓపరమేశ్వరా! నీవు శరణాగత రక్షకుండవు. నేను నీపాదారవిందంబుల శరణంబు నొందితిని. నాపాపములను నశింపఁజేసి సద్గతి నొసంగుమనినఁ దద్వచనము నాకర్ణించి భగవంతుఁడు వేనునితో నిట్లనియె. పూర్వకాలమందు నేను నీజనకుండైన యంగభూపాలునకు సాక్షాత్కరించి సుపుత్రవరము నొసంగితిని. సుశంఖు శాప బలంబుచే జైనమతధర్మముల నాచరించియు మత్ప్రసాదంబు వలన విగతకల్మషుండవైతివి. నీకుమారుండు మదంశ సంభవుండు గావున నతనిచే నీకులము ప్రసిద్ధి నొందఁగలదు. నీవును యాగదాన హోమాదుల నాచరించి ప్రజలను ధర్మమందుఁ బ్రవర్తింపఁ జేయుము. గోభూ తిల హిరణ్యాది దానంబులు భూలోకమందును స్వర్గలోకమందును సకల జీవులకు సుఖదాయకంబులు. కావున నాదానంబులచే వివిధ భోగంబుల ననుభవించి దేహావసానమందు వైష్ణవ లోకము నొందఁగలవు. మన్వాది స్మృతులయందు దానము చతుర్విధ పురుషార్థ సాధనంబని చెప్పంబడినది. కాఁబట్టి నీవు సకల దానములను ముఖ్యముగాఁ జేయుమని చెప్పెను.

## మహావిష్ణువు నిత్యనైమిత్తిక కామ్యదానంబులను, తీర్థ విశేషంబులను సత్పాత్రంబును వేనునితోఁ జెప్పుట.

ఓ పరమేశ్వరా! నీవు భక్తవత్సలుండవు. కావున నాకు సాక్షాత్కరించితివి. దానము సకల శ్రేయస్సులకు సాధన మని చెప్పితివి. దాన భేదములను, దానకాలము, తీర్థవిశేషమును, సత్పాత్ర విశేషమును నాకు బోధింపు మనిన నా భగవంతుండు వేనునితో నిట్లనియె. మానవుండు సూర్యోదయ పూర్వకాలంబున స్నానపూర్వకంబుగ సంధ్యాదేవత నుపాసించి, సూర్యమండలమం దుపస్థాన మంత్రములచే నన్ను ధ్యానింప వలెను. పూర్వాహ్ణమం దైనను, మధ్యాహ్నమం దైనను, సాయంకాలమం దైనను., ననుదినమందును దానము చేయవలెను. పక్షము కొకపర్యాయము గాని, మాసము కొక పర్యాయము గాని దానము చేయనివారు దరిద్రులగుదురు. దాతలైనవారు మరల ధనలాభమును, దివ్యాంబర భూషణాది లాభమునుబొంది సుఖించెదరు. ఒకదివసమైనను దానశూన్యమై యుండఁగూడదు. దయాయుక్తమైన చిత్తముతో నన్నోదకము లను, పత్ర పుష్ప ఫల తాంబూల వస్త్రభూషణాదులను, గో భూ తిల హిరణ్యాదులను, యథాశక్తిగా, నన్ను నుద్దేశించి దానము చేయువారు, నానావిధ భోగముల ననుభవించి, దేవ లోకమంది నిరతిశయ సుఖము నొందఁగలరు. కస్తూరాగరు చందనాది దానమువలన దివ్యగంధానులిప్తులై స్వర్గమున నివ సింతురు. ఈ చెప్పిన వన్నియు నిత్యదానంబులని తెలిసి కొన వలెను. పూర్ణిమాఽమావాస్యా సంక్రాంత్యాది పంచపర్వము

లందును, పితృ మాతృ ప్రత్యాబ్దిక శ్రాద్ధములందును, మరణో న్ముఖ కాలమందును జేయు దానములు నైమిత్తిక దానంబు లనంబడు. జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయన వివాహాద్యభ్యుదయ కర్మములందుఁ జేయు దానంబులు కామ్యంబు లనంబఱగు. గంగా గోదావరీ యమునా నర్మ దాది పుణ్యతీర్థములయందుఁ జేయు దానంబు లనంత ఫల ప్రదంబులని యెఱుంగవలయును.

సముద్రతీరములయందుఁ జేయు దానములుగూడ మహా ఫలప్రదంబులగు చున్నవి. తీర్థముల నామము తెలియని సమ యంబున విష్ణుతీర్థమనియు, నారాయణ తీర్థమనియు భావించి, నా నామమును స్మరించుచు దాన ధర్మముల నాచరింపవలెను. శమదమాది గుణయుక్తుండును, వేదశాస్త్ర కోవిందుడును, తత్త్వజ్ఞాన సంపన్నుండును, సుశీలుండును, నగు పురుషుండు దానపాత్రుండని యెఱుంగవలయు. ఈ నిత్యనైమిత్తిక కామ్య దానంబులను నాప్రీతికొఱకు నాచరించు వా రనాయాసముగా మత్ప్రసాదంబువలన స్వర్గమోక్ష సుఖంబుల నొందఁగలరు. దేశకాల పాత్రవిశేషములం దాచరించు దానములన్నియు, భక్తి శ్రద్ధలతో మదర్పితంబులైన యెడల నాదాతలు మత్ప్ర సాదంబు వలన స్వర్గాది లోకములయం దనంత సుఖము నొందఁగలరు.

## నైమిత్తిక దాన విశేషంబులం జెప్పుట

నైమిత్తిక దానంబులలో మఱియొక విశేషమును జెప్పుచున్నాను. సావధానుండవై వినుము. మహాపర్వకాల

మంచు సత్పాత్రుండైన బ్రాహ్మణునికొసఁగు రథ గజ తురంగంబుల నొసంగు వారు మత్ప్రసాదంబువలన తీర్థవిశేషమునందు ధర్మాత్ములును, జ్ఞానవంతులును సర్వభూతముల కజేయులును, మహాతేజోవంతులునునై జనించి పశు విత్త పుత్ర మిత్ర కళత్ర క్షేత్రాది యుక్తులై యీలోకమందు నానావిధ భోగముల ననుభవించి, చిరకాలము స్వర్గలోకమందు సుఖముగా నివసింతురు. స్వర్ణ దక్షిణతోఁగూడ వస్త్రదానమును, గోదానమును మహాపర్వములందు, సద్బ్రాహ్మణుని కొసఁగు నొసంగు వారు విశేష ధనవంతులై విపులమగు భోగముల నొంది చిరకాలము విష్ణులోకమందు నివసింతురు. పర్వకాలమందు గంగానది తీర్థములం దన్నదానమును, వస్త్రాలంకారాది దానంబులును, జేయువారు స్వర్గలోకమందు దేవేంద్రునితోఁగూడ సకల సుఖముల నొందగలరు. వస్త్రాలంకార యుక్తంబులును, కాంస్యపాత్ర సమన్వితంబులును నగు షోడశ సంఖ్యగల గోవులను మదర్పితంబుగా సత్పాత్రమం దిచ్చువారు, నాతోఁగూడ వైకుంఠమందు నివసింతురు. ఈదానములను జేయువారందఱు వేదవేదాంగ పారంగతులును, సుగుణవంతులును, సగు పుత్రులతోఁగూడ యశస్సంపన్నులై యజ్వులై తత్వజ్ఞానయుక్తులై యొప్పుచుందురు. జరాపీడితుండైన పురుషుండు కాయము నశ్వరమని భావించి దానము నాచరింపవలెను. జ్ఞానహీనుండైన పురుషుండు మోహావిష్ట చిత్తుండైనేను మృతి నొందిన యెడల నాభార్యాపుత్రాదు లెట్లు జీవించెదరని దుఃఖించుచు, గృహక్షేత్ర విత్తాదులందు విక్షిప్త చిత్తుండై మృతి నొంది నరకదుఃఖముల ననుభవింపఁ గలఁడు.

కాఁబట్టి యన్నోదకోద కుంభఛత్రోపానహాది దానములను దన జీవితకాలమం దాచరింపవలెను.

## మహావిష్ణువు పతివ్రతా ధర్మములను వేనునితోఁ జెప్పుట

పతివ్రతా మహిమమును దెలియఁజేయు మనిన వేనునితో మధుసూదనుం డిట్లనియె. తొల్లి వారణాసీ పురమందు మహాధనవంతుండును, వదాన్యుండును, గుణవంతుండును, ధర్మజ్ఞుండును, విష్ణు కథాశ్రవణ తత్పరుండును, నగు వైశ్యుండు గలఁడు. అతఁడు మహాసాధ్వియగు సుకల యను భార్యంగూడి సకలధర్మంబుల నాచరించుచుఁ బుత్రునితోఁగూడ సుఖముగా నుండెను. ఆ వైశ్యుం డొకప్పుడు గంగాదితీర్థములను సేవింపవలెననితలంచి, తా నొక్కఁడు బయలు వెడలుటకు బ్రయత్నించెను. అతని భార్యయగు సుకల తద్వృత్తాంతమును దెలిసికొని, పతివ్రతలైన స్త్రీలకు భర్తతోఁగూడ ధర్మాచరణంబు శాస్త్ర సమ్మతంబు గావున మీతోఁగూడ నిర్గమించి తీర్థయాత్రా ధర్మంబుల నాచరించెదను. నన్నుఁ బరిత్యజించుట ధర్మవిరుద్ధంబని చెప్పెను. తద్భర్తయగు వైశ్యుం డామాటను విని, ఓసుందరాంగీ! నీవు కోమలమైన పాణిపాదములు కల దానవు. కావున నీకుఁ గంటక గర్త పాషాణాదులచే నిమ్నోన్నతంబైన భూ భాగమం దతిదుఃఖము సంభవింపఁగలదు. సరోజ సన్నిభంబైన నీపాణి పాదములు మార్గక్లేశమును సహింపఁ జాలవనిన దద్వచనముల నాకర్ణించి యాభార్య, భర్తృశరీరంబు సర్వతీర్థాస్పదంబు గావున మీపాద సేవఁజేయుచు మీతోఁగూడ ముఖ్యముగా వచ్చెదనని చెప్పెను. అపు

డావైశ్యుండు స్త్రీలతో ప్రయాణము కడుదుఃఖ కరంబని యాలోచించి తనభార్య నిద్రించు చుండగా నిల్లువెడలి పోయెను.

అనంతర మాభార్య మేలుకొని భర్తను గానక దుఃఖించుచు నధశ్శయన బ్రహ్మచర్య నియమంబులతో నుండెను. అపు డాచెలియలందఱుఁ జనుదెంచి నీభర్త సకలతీర్థములను సేవించి శీఘ్రకాలములో రాఁగలఁడు. నీ వధశ్శయనాది నియమములను విడిచి, ధైర్యముతో సుఖముగా నుండుమనిరి. అపుడు సుకల వారితో నిట్లుపలికెను. ఓచెలియలారా! నా వాక్యములను నాదరముతో వినుండు. పతివిహీనలైన స్త్రీలు సంసారమందు ననేక దుఃఖముల ననుభవింపఁగలరు. ధర్మపత్ని చేయు శుశ్రూషణంబుచే భర్త సంతసించిన, సకలదేవతలును, మహర్షులును, మానవులును, సంతుష్టులయ్యెదరు. ఈయర్థమం దొక పురాతనేతిహాసంబు గలదు. దానిం జెప్పెదను మీరు సావధానులరై వినుండని చెప్ప నారంభించెను.

కోసల దేశమందలి యయోధ్యా నగరంబున మనుపుత్రుండైన యిక్ష్వాకువను మహారాజు శ్రుతదేవయను నొక కాంతామణింగూడి నానావిధ భోగముల ననుభవించుచు నొకప్పుడు మృగయాసక్తుండై మేరుపర్వతమందుండు నొక మహారణ్యంబున కేఁగి, సింహశార్దూల మహిష వరాహాది మృగంబులను వధించి, యనుదినము మరల వేఁటాడుచు నా వనమం దుండు గంగాతటంబున భార్యతోఁగూడఁ గొంత కాలము నివసించి యుండెను. ఆమేరుపర్వత సమీపంబున

నొక కందరమం దరణ్య వరాహ మొకటి స్వకీయ సూకర యూథంబుతోను, భార్యా పుత్రపౌత్రులతోను, నివసించి యక్కడక్కడ సంచరించుచు, నిక్ష్వాకు మహారాజును జూచి, యితండు మృగయాసక్తుండు, గావున సింహశార్దూలాది మృగయూథంబులను వధించు చందంబున నాపరివారముతోఁ గూడ నన్ను వధింపఁ గలఁడని తలంచి, తనభార్యతో నిట్లనియెను. ఓ ప్రియురాలా! భగవంతుండైన మధుసూదనుం డిక్ష్వాకు రూపుండై యీయరణ్యమునకుఁ జనుదెంచి, యనేకమృగంబులను వధించెను. కాఁబట్టి నన్నుఁగూడ వధింపఁగలఁడు. నేను శౌర్యధైర్యములతో యుద్ధమునకు బోవుచున్నాను. నే జయించిన కీర్తి నొందెదను. రాజు నన్ను వధించిన నేను మధుసూదను లోకంబు నొందెదను. నీవు పుత్రపౌత్రులతోఁగూడ నీకందరమధ్యంబున సుఖముగా నివసింపు మని పలికెను. అప్పుడాసూకరి యీవచనముల నాకర్ణించి, పతివిహీనంబైన నారీమణి కాంచనాభరణాంబరా లంకృతంబైనను, బుత్ర పౌత్ర సహోదరాది బంధుజనాన్వితంబైనను, చంద్ర విహీనంబైన రాత్రియుఁ, బుత్రవిహీనంబైన కులంబును, నాచార విహీనుండైన మర్త్యుండును, జ్ఞానవిహీనుండైన యతియు, మంత్రశూన్యంబైన రాజ్యంబును, నావికశూన్యంబైన నావయు, నధ్యక్ష విహీనంబైన సైన్యంబును, వేదవిహీనుండైన ద్విజుండును బ్రకాశింపని చందంబున సౌభాగ్య రహితంబగుటచే శోభింపదు.

ఈ సూకర యూథంబు లన్నియు నీ బలంబుచేత గర్జించుచు నీపర్వత సమీపమందు సంచరించు చున్నవి. నీవు లేని

యెడల, నివి, జీవించుట దుర్లభంబు. కావున మనమందఱము బయవెడలి యీగిరికందర మధ్యభాగమందుఁ గనఁబడకుండగ సుఖముగా నివసింతము రమ్మని పలికెను. అపు డా మాటలను విని యరణ్య వరాహము తనప్రియ సఖితో నిట్లు పలికెను. ఓ ప్రియసఖి ! వీరధర్మమును నీ వెఱుంగవు. వీరునకు యుద్ధము సంభవించినపుడు వీరుండు యుద్ధమందు విముఖుఁడైన యెడలఁ గుంభీ పాత నరకమందుఁ జిరకాలము నివసించును. కావున నేను ముఖ్యముగా నీమహావీరునితో యుద్ధము చేసెదను. నేను జయించినఁ గీర్తినొందెదను. ఈవీరుండు నన్ను వధించిన యెడల మధుసూదనులోకంబు నొందఁగలననిన, నపు డాసూకరి తన ప్రాణేశ్వరునితోఁగూడ యుద్ధము చేయఁదలంచి, పుత్ర పౌత్రాదులను బిలిచి మీలో శ్రేష్ఠుండు మిమ్ములను రక్షింపఁ గలండు. నాప్రాణేశ్వరునితోఁగూడ, నేను యుద్ధమునకుఁ బోవుచున్నా నని తన పుత్రులతోఁ బలికెను. అపు డాపిల్లలు తల్లిదండ్రులను బరిత్యజించిన వారు ఘోరనరకముల నొందఁ గలరు. మాతృస్తన్యమును బానముచేసి తండ్రిచే సంరక్షితులై యభివృద్ధి నొందినవారు కృతఘ్నులైనయెడల క్రిమి దుర్గంధ సంకులంబైన నరకంబు నొందఁగలరు. కావున మేమందఱము యుద్ధసన్నాహముతో నుంటిమని చెప్పఁగా సాహసోత్సాహ ములతోఁ గ్రీడించుచు నాసూకర యూధంబులన్నియు వ్యూహా కారంబు నొంది, యుద్ధమునకొఱకు నిక్ష్వాకు మహారాజునుఁ బ్రతీక్షించు చుండెను.

అపు డా యిక్ష్వాకు మహారాజు గర్జించుచున్న సూకర యూధంబును జూచి, లుబ్ధకులను బిలిచి బంధనరజ్జువులచే

బంధించి శూలములచే బొడిచి మీరలందఱు వధింపుఁ డని యాలుబ్ధకులకు నాజ్ఞాపించెను. అటుపిమ్మట నాలుబ్ధకులు రజ్జువులచే బంధించి, శూలములచేఁ దీవ్రముగాఁ బొడిచి యుద్ధము చేయుచున్న సమయంబున నాయరణ్య వరాహము తన యూథంబుతోఁగూడఁ దుండాగ్ర భాగముచేతను, దీక్ష్ణ నఖరములచేతను, మింటి కెగసి, భూమిని బ్రద్దలుచేయుచు హుంకరించి, బంధన రజ్జువిముక్తుండై రాజును జంపుటకు నుద్యమించెను. రాజాజ్ఞచే నపు డాభిల్లు లందఱు శూలఖడ్గ పాణులై కొన్ని సూకరయూథంబులను వధించిరి. మఱికొన్ని సూకరయూథంబులు లుబ్ధకులను వధించినవి. అపుడు సూకరి, మృతినొందిన సూకరయూథంబు నవలోకించి, దుఃఖించుచు మనము హతావశిష్టులయిన బాలకులతోఁగూడ నీగిరికందరంబున గూఢముగా నివసించి సుఖముగా నుందము. నీవు యుద్ధము వలన విరమించి శీఘ్రముగా గిరికందరమునకు రమ్మని తనప్రాణనాథునితోఁ బలికెను. అపు డాసూకరము తద్వచనము నాకర్ణించి యుద్ధమందు శత్రువులను జూచి భీతుండై సమరంబువలన విరమించిన వాఁ డీలోకంబునఁ బరిహాసంబును బరలోకంబున నరకంబును బొందును. దానం జేసి యుద్ధమవశ్యకర్తవ్యంబు కావున యుద్ధముచేసెదనని చెప్పెను. అపు డాభార్యకూడ భర్తతో యుద్ధముచేయుటకు నిశ్చయించెను. అటుపిమ్మట సూకర యూథంబుతోఁగూడ నా మహావరాహము ప్రావృట్కాల మేఘమువలె గర్జించుచు రాజున కభిముఖమై యుండెను. ఈసూకరయుద్ధాభినివేశమును జూచి యిక్ష్వాకు మహారాజు మహాహర్షముచే వికసిత రోమాంచి

తుండై, ఖడ్గశూలంబులను హస్తంబున ధరియించి, దాని కెదురుగా నిలుచుండెను.

అనంతర మా రాజన్యుండు సూకర యూధంబుచే నిహతంబైన స్వసైన్యంబు నవలోకించి రోషారుణ లోచనుండై యశ్వము నధిష్ఠించి యతినిశితబాణంబుచే నా సూకరమును గొట్టెను. అపు డాబాణాభి ఘాతమును సూకరయూధపతి సహింపక, యతి శౌర్యముతోఁ దనతుండాగ్ర భాగముచే నశ్వ మును భూతలమున బడఁగొట్టెను. పిమ్మట రాజన్యుండు తన రథము నధిష్ఠించి, బాణపరంపరచే మరల గొట్టెను. ఆసూకర మతిరోషముతో సూకరజాతిరవమును జేయుచు, రాజ సమీప మున కరుదెంచి, దంష్ట్రాగ్రభాగముచే నారాజన్యుని గొట్టెను. రాజన్యుం డాదెబ్బను సహించి యతిజాగరూకుండై, గదను ధరియించి, యాగదచే దాని శరీరమును వ్రక్కలుచేసి సూకర మును వధించెను. అపు డాసూకరము మహావాయువుచే వృక్షము నేలఁగూలిన చందంబున నేలంగూలి, ప్రాణములను విడిచి దివ్యాంబరాభరణాలంకృతంబును, జతుర్భుజాన్వితంబును నగు దివ్యదేహమునుధరించి, గంధర్వశ్రేష్ఠుండయ్యెను. అపుడు దేవతలు కర్పూరాగరు మిశ్రితంబైన చందన వర్షంబును, బుష్ప వర్షంబును గురిపించిరి. ఆ గధర్వుండు దివ్య విమానము నధి ష్ఠించి, ఓరాజేంద్రా! నేను విద్యాధరుండను, పులస్త్య శాపం బువలన నీవరాహ జన్మము నొందితిని. నీయనుగ్రహంబువలన నిపుడు శాపమువిక్తుండనైతినని, యారాజన్యుని శ్లాఘించుచు దేవేంద్రాది దేవతలచేఁ బూజితుండై రెండవ సూర్యునివలెఁ దేజరిల్లుచు, దేవలోకంబు నొందెను.

అటుపిమ్మట నా సూకరి; నా కాంతుం డీరాజన్యు నిహతుండై దివ్యవిమానంబు నధిష్ఠించి, సురముని పూజితుండై దేవలోకము నొందెను. ఇపుడు నే నీ రాజన్యుని వధించి, నా కాంతునితోఁగూడ దేవలోకము నొందఁ గలనని తలంచి, హతావశిష్టులయిన నలుగురు పుత్రులం బిలిచి మీ రందఱు పటురయంబుతో నీ కందర మధ్యభాగంబునఁ బ్రవేశించి, యీ రాజేంద్రున కదృశ్యులయి ప్రాణములను గాపాడు కొని సుఖముగా నుండుఁడు. నేను సమరాంగణంబున కేగి యీ రాజేంద్రుని వధించెద ననిన, నా వచనము నాకర్ణించి, నిన్ను విడిచి మేమందఱము కందరమధ్యభాగమం దేకాంతంబునఁ బ్రవేశించి ప్రాణములను గాపాడుకొనుట ధర్మవిరుద్ధం బని పలికి పుత్రులందఱుఁ దల్లితోఁగూడ యుద్ధసన్నద్ధులయి యుండిరి. అపుడు శూరులయిన లుబ్ధకులు ఖడ్గబాణ ధనుర్ధరులై యతి వేగముతో సూకరినిఁ దత్సుతులను గొట్టిరి. ఆ దెబ్బలను సహింపలేక నలుగురిలో జ్యేష్ఠపుత్రుండైన సూకర మతిశౌర్యముతోఁ గొందఱ లుబ్ధకులను దుండాగ్ర భాగముచేతను ఖురాగ్రములచేతను వధించెను. అపు డిక్ష్వాకు మహారాజు యీ వరాహము తండ్రికంటే శౌర్యము కలదని తెలిసికొని యర్ధచంద్రాకారంబైన నిశిత బాణంబుచే దాని వక్షస్థలమును నఱికెను. అపు డది భూతలమందుఁబడి మృతి నొందెను. అటు పిమ్మట నా సూకరి పుత్రమరణముచేఁ గొంతసేపు దుఃఖించి యతిరోషాన్వితయై కొందఱ రాజభటులను జంపెను. తరువాత శ్రుతదేవయను రాజభార్య యీ సూకరి మనభటులను వధించు చున్నది. దీనిని వధింపక యుపేక్షించినయెడల మన కనర్థము

చేకూరుననిన నా రాజభార్యతో రాజేంద్రుం డిట్లనియె. ఓ సుందరాంగీ! వీరునకు స్త్రీవధ ధర్మవిరుద్ధంబని తలంచి యుపేక్షించితి నని పలికెను. అపుడు లుబ్ధకుం డాకడు తీవ్రకోపముతో రాజభటులను వధించు నా సూకరిని జూచి యొక నిశితబాణముచే దానిం గొట్టెను. ఆ బాణముచే విదళీకృత దేహాన్వితయై శ్వాసల నధికముగా విడుచుచు భూమియందుఁ బడి మూర్ఛ నొందెను.

## సూకరుని పూర్వజన్మ వృత్తాంతము

అపుడు శ్వాసను విడుచుచు సజీవంబయి దుఃఖపడుచున్న సూకరిని జూచి, శ్రుతదేవయను రాజభార్య కృపార్ద్రచిత్తాన్వితయై శీతల జలంబుచే ముఖమందును దేహమందును జల్లెను. పిమ్మట జలస్పర్శంబుచేఁ దెలివొంది యాసూకరి నీ హస్తగత జలస్పర్శంబుచేతను, నీసందర్శనంబుచేతను, నేను కృతార్థురాలనైతిని. నాపాపంబులన్నియు దగ్ధంబులయినవి. మోహము నష్టమయినది. నాకుఁ బూర్వజన్మ స్మృతి కలిగినదని రాజభార్యతోఁ బలికెను. అపు డా రాజభార్య యామాటలను విని, ఈసూకరి పశుజాతియందుఁ బుట్టి మనుష్యవాక్కుచే స్వరవ్యంజన సంయుక్తంబులయిన సుశబ్దములను బలుకుచున్నది. నామనంబున మిక్కిలి యాశ్చర్యము కలుగుచున్నయది. కారణం బేమో తెలియదని తనభర్తయైన యిక్ష్వాకు మహారాజుతోఁ జెప్పెను. రాజేంద్రుం డావృత్తాంతమును దెలిసికొని యాశ్చర్యము నొందుచు భార్యతో నిట్లనియె. ఓతరుణీమణీ! సూకరీ సూకరముల పూర్వజన్మ వృత్తాంత

మును వినవలెనని నాకుఁ గుతూహలము కలిగినది. అవృత్తాంత మును నీవెఱుగుదువని దివ్య నని యారాజభార్య నీపూర్వజన్మ వృత్తాంతమును జెప్పుమని యానూకరి నడిగెను. ఆనూకరి తద్వచనము నాకర్ణించి భర్తృ పూర్వజన్మవృత్తాంతంబును దన పూర్వజన్మ వృత్తాంతంబును జెప్పుట కుపక్రమించెను.

ఓతల్లీ! ముందుగా నాభర్తృ పూర్వవృత్తాంతమును జెప్పుచున్నాను. సావధాన చిత్తముతో వినుము. పూర్వకాల మందు చారుకందర నిర్ఝరాన్వితంబైన మేరుపర్వత సమీప ప్రదేశమందు మహాతేజస్వియు, జితేంద్రియుండును, జిత శ్వాసుండును, జితాహారుండును, మునిశ్రేష్ఠుండును నగు పులస్త్యుండు, తపం బాచరించు చుండెను. అచ్చట సర్వశాస్త్ర కోవిదుండును, గానవిద్యా విశారదుండును నగు రంగవిద్యా ధరుండను నొక గంధర్వుండు పులస్త్యాశ్రమ సమీపంబున నొక వృక్షచ్ఛాయ నాశ్రయించి సుస్వర తాలలయాన్వితం బయిన గానమును బాడుచుండెను. అంత నాపులస్త్యుండు ధ్యానమువలన జలిత మనస్కుండై గంధర్వ సమీపంబున కేగి మూర్ఛనా సహితంబును సుస్వర తాలలయాన్వితంబును నగు భవ ద్దివ్యగీతంబుచే దేవతలు గూడ మోహము నొందు చుందురు. కావున నీదివ్య గానముచే ధ్యానమువలన జలిత మనస్కుండ నైతిని. ఈస్థానమునుండి మఱియొక స్థానమునకుఁ బొమ్మని పలికెను. గంధర్వుం డామాటలను విని పరమాత్మ జ్ఞానముతో సమముగా నీగానము నభ్యసించు చున్నాను. శృంగారాది సర్వరసంబులు గీతాశ్రితంబులయి యున్నవి. గీతంబుచే సకలదేవత లానందించు చుందురు. శబ్దంబు శ్రుతిం

బైనను; రూపవంతులయిన స్త్రీలు చక్షుర్గోచరం బయినను, ధ్యానముచే నిశ్చల చిత్తులయి తపం బాచరించు వారు జితేం ద్రియులని చెప్పంబడుదురు. మీర లట్టి ధైర్య విహీనులరు; కావున చంచల చిత్తులయిరి. ఈ వనము సర్వజీవ సాధారణము, కనుక నే నిక్కడనే నివసించి గానము చేసె దను. ఈ గానము మీకుఁ దపః ప్రతికూల మయిన యెడల నీ వనమును విడిచి శీఘ్రముగా మీరు మఱియొక స్థలమునకు వెళ్ళుఁడని గంధర్వుఁడు పులస్త్యునితోఁ బలికెను. పులస్త్యుం డామాటలను విని పరమశాంతుండై కామ క్రోధ లోభ మోహములను బరిత్యజించి మనంబుతోఁగూడ సర్వేం ద్రియంబులను నియమించి, మఱియొక స్థానమును బొంది యోగాసనగతుండై తపం బాచరించు చుండెను.

అటుపిమ్మట నీ గంధర్వుండు పులస్త్యాధిష్ఠితంబైన ప్రదే శంబును దెలిసికొని, నావలన నధికభయంబు నొంది యీ నిర్జన ప్రదేశమందుఁ దపం బాచరించుచున్న వాఁడు. ఇక్కడ గూడఁ దపంబున కంతరాయంబును గలుగఁజేసెద నని తలంచి, యరణ్య వరాహరూపంబు నొంది; తుండాగ్రంబుచే, నిశ్చల చిత్తుండై తపం బాచరించుచున్న పులస్త్యుని చలింపఁ జేసెను. ఈ ప్రకారముగా నప్పుడప్పుడు, తుండాగ్రంబుచే ఘర్షించుచుఁ దదాశ్రమంబున వరాహ రూపంబుతో సంచరించుచు మల మూత్రములను విడుచుచు, మాటిమాటికి దేవేంద్రప్రేరితుండై కుత్సిత చేష్టలచేఁ దపంబునకు విఘ్నం బాచరించు చుండెను. అతండు చిరకాలము పశుకృతంబైన చేష్టలని భావించి సహన శీలుండై యూరకుండెను. తరువాత నా గంధర్వుండు కొన్ని

జనంబులకు గంధర్వ రూపంబుతోఁ బూర్వమందువలె సుస్వర తాళలయాన్వితంబైన గానమును బాడుచు నా పులస్త్యుని విక్షిప్త చిత్తునిం గావించెను. అనంతర మా పులస్త్యుం డీ గంధర్వుండు దుష్టశీలుండు, గావున వీఁడే వరాహరూపముచేఁ దపోభంగము నాచరించిన వాఁడు. పశుకృతంబైన చేష్టలని భావించి యవు డూరకుంటిని. వీఁడు చిరకాలమునుంచి నాకు మిక్కిలి ప్రతికూలముగా సంచరించు చున్నవాఁడు. కావున నీ పాపాత్ముండు సూకరయోనినిఁ బొందఁ గలఁడని శపించెను.

ఆ గంధర్వుం డీ శాపంబును దెలిసికొని, దూయమాన మానసుండై దేవేంద్రుని కడ కేగి, నీప్రేరణముచేఁ బులస్త్యాశ్రమము నొంది తపోభంగము గావించుటచేతఁ బులస్త్యుండు రోషారుణ లోచనుండై సూకరయోనిం బొందుమని శపించెను. కనుక నన్ను రక్షింపుమని వేడెను. అపుడు సహస్రాక్షుండు వీనితోఁగూడఁ బులస్త్యాశ్రమమున కేగి యోమహాత్మా! నీవు సిద్ధపురుషుండవు. మహామహుండవు. వీని యపరాధమును క్షమించి రక్షింపు మని ప్రార్థించెను. అవు డాపులస్త్యుండు తద్వచనముల నాకర్ణించి నీవు దేవతాసార్వభౌముండవు. కావున నీ వాక్యమువలన క్షమించెద నని చెప్పి మనుపుత్రుండును, మహాబలుండును, ధర్మాత్ముండును, సకల ధర్మపరిపాలకుండును నగు నిక్ష్వాకు మహారాజు స్వయముగా వీనిని వధింపఁ గలఁడు. అపుడు స్వకీయమైన రూపంబు నొంది నీ సమీపంబునకుఁ జనుదెంచి దేవలోకంబున సుఖముగా నుండఁ గలఁడని చెప్పెను. దానంజేసి యీ మహారాజుచే మృతినొంది మహావీర గమ్యంబైన దేవలోకము నొందెను.

నా భర్త్రు వృత్తాంతమును దెలియఁ జేసితిని. ఇటుపిమ్మట నా వృత్తాంతమును జెప్పెదను సావధాన చిత్తముతో వినుమని సూకరి; తన వృత్తాంతమును జెప్పుటకు నారంభించెను.

## సూకరి పూర్వజన్మ వృత్తాంతము

ఓతల్లీ ! నీహస్తోదకముచేతఁ బవిత్రశరీరముగల దాననై యీయీ పాపంబులన్నియుఁ బోవుటవలన ధన్యురాల నైతిని. నీదర్శనము వలనఁ బూర్వజన్మ వృత్తాంతస్మృతి నొందితిని. కళింగదేశమందు బ్రహ్మక్షత్రాది చతుర్వర్ణ నిషేవితంబును, సర్వవస్తు సమాకీర్ణంబును, నగు శ్రీపురంబను యొక పుర వరంబు గలదు. దానియందు వేదాధ్యయన సంపన్నుండును, సత్యధర్మ పరాయణుండును, ధనధాన్య సంపన్నుండును, బుత్ర పౌత్రాలంకృతుండును నగు వసుదత్తుండను పేరుగల యొక విప్రోత్తముండు గలఁడు. అతనికిఁ గుమార్తెనై జనించి సోదరు లకును, బంధువులకును, జనకునికిని, మిక్కిలి ప్రేమకలదాననై రూప యౌవన గర్వంబుతోఁ బితృగృహమందు నివసించి యుంటిని. స్వర్ణాభరణాంబరాదులచే నలంకృతంబైన నాశరీర సౌందర్యంబును జూచి యనేక విప్రోత్తములు వివాహార్థమై నన్ను యాచించినను నన్నువిడిచియుండలేక మాతండ్రియగు వసుదత్తుం డతిప్రేమవలనఁ బరిణయంబును జేయఁడాయెను. పిమ్మట నాతల్లి నావివాహవయస్సును, నవలోకించి మన కుమార్తెను నొకవరునకిచ్చి శీఘ్రముగా వివాహమునుగావింప వలెను. వివాహవయస్సు వచ్చినది, కావున వివాహప్రయ త్నము చేయవలెననిన, నామాటను విని "కుమార్తెయందైన

ప్రేమచే ముగ్ధుండనైతిని. ఈ కన్యక, ప్రాణములకంటె నాకుఁ బ్రియమైనది. కావున నాగృహమందు నివసించు నల్లుని గొఱకుఁ గన్యక నిచ్చెద" నని మాతల్లితోఁ జెప్పెను.

ఈ ప్రకారము కొంతకాలమైన పిమ్మట వేదాధ్యయన సంపన్నుండైన యొక బ్రాహ్మణుండు మా గృహంబునకుఁ జనుదెంచెను. వాని నవలోకించి సగౌరవంబుగా నాదరించి మాతండ్రియగు వసుదత్తుండు కులాచార గోత్రంబుల నడిగిన; నా బ్రాహ్మణుండు నే కౌశికాన్వయ సంభవుండ, వేదవేదాంగ పారంగతుండను. శివశర్మయను నామధేయంబు గలవాఁడను. పితృమాతృ విహీనుండను. వేదాధ్యయన సంపన్నులైన నలుగురు సోదరులు మాత్రము కలరు. ఇదియే నా వృత్తాంత మని పలికెను. అపుడు మా తండ్రియైన వసుదత్తుండు నా గృహమందు స్థిరముగా నీవు నివసింతువేని నీకు నా పుత్రిక నిచ్చి వివాహము చేసెదనని చెప్పి యతని యంగీకారమును దెలిసికొని; శుభనక్షత్రయుక్తంబైన శుభలగ్నమందు నన్నిచ్చి వివాహము గావించెను. పిమ్మట నా భర్తతోఁగూడఁ బితృ గృహమందు నివసించి జారులతో స్వేచ్ఛగా సకలభోగముల ననుభవించుచు, నా భర్తకును బితృమాతృ సహోదర బంధుజనంబునకును; ప్రతికూలముగా సంభాషించు చుంటిని. వారు నా దుష్టస్వభావమును దెలిసికొని నివారించినను; జారులతో రతిక్రీడలను సలుపుచుంటిని. నేను శుశ్రూషణ పాద సంవాహనాదికమును జేయక పోయినను; నా భర్త యత్త మామలకును బంధువర్గమునకును ద్వేషము కలుగునను భీతిచే నా యపరాధములను సహించు చుండెడివాఁడు. ఈ ప్రకార

ముగాఁ గొన్ని దినంబులు గడచిన పిమ్మట నా వ్యాపారమును జూచి యీ దేశమును; నీ గ్రామమును; విడిచి స్వగృహంబున కరిగి మఱియొక కన్యకను బరిణయంబై విహితకర్మల నాచరించుచు ధనధాన్య వస్త్రాలంకార సమన్వితుండై యాభార్యతోఁ గూడ సుఖముగా నుండెను.

అనంతరము మా తండ్రియైన వసుదత్తుండు తనయల్లుండైన శివశర్మ గృహమునుండి బయలువెడలి యెచ్చటికి బోయెనో తెలియకుండె నని విచారించుచుఁ గులమున కపకీర్తి కరంబైన చేష్టల నాచరించుటచే దీనిని విడిచిపెట్టెనని; భార్యతోఁ జెప్పెను. భార్య తద్వచనముల నాకర్ణించి మన పుత్రికా గుణదోషంబు లన్నియు; నిపుడు తెలిసికొని మీరు పరితపించు చున్నారు. మీకు దానియందుఁగల మోహము చేతనే; యిట్లు దుష్టస్వభావము గలదై స్వేచ్ఛగా జారపురుషులతో సంచరించుచు భర్తకుఁ బ్రతికూలముగా సంచరించుచుండెడిది. ఈ యధర్మాచరణంబులకు మీ ప్రేమాతిశయమే ముఖ్య కారణము. ఐదు సంవత్సరముల పర్యంతము పుత్రులను లాలనపోషణాదులచే సంరక్షింప వలెను. పిమ్మట విద్యాభ్యాసము విషయమయి కఠినముగా శిక్షించిన; విద్యలయందును గుణములయందును నిపుణులై కాగలరు. తండ్రి పుత్రునిఁ, దల్లి పుత్రికను; అత్తమామలు కోడలను; భర్త భార్యను; గురువు శిష్యుని; నృపతి యమాత్యుని శిక్షింపవలెను. నీవు శిక్షింపక యుపేక్షించి నందువలన మన పుత్రిక దుష్టచేష్టలు గలదై యపకీర్తి నొందెను. అష్టవర్ష పర్యంతము పితృగృహమందు నివసించిఁ, బిమ్మటఁ బతిగృహమందు నివసించిన

యొడలఁ బతివ్రతా ధర్మముల నాచరించుచు; నుభయుల కీర్తిని సంపాదించును. కన్యక పితృగృహంబున నివసించుటచేఁ గలిగిన యనర్థము విషయమై యొక పురాతనేతిహాసమును జెప్పుచున్నానని వసుదత్తునితో భార్య చెప్పఁ దొడంగెను.

## పద్మావతి చరిత్ర

పూర్వకాలమందు మధురాపురమందు సర్వధర్మతత్వజ్ఞుండును, వేదశాస్త్రకోవిదుండును, మహాతేజోవంతుండును, ప్రతాపవంతుఁడును నగు నుగ్రసేన మహారాజు, విదర్భదేశాధిపతియైన సత్యకేతువను మహారాజుఁ బుత్రికను యథావిధిగాఁ బరిణయంబై ప్రజలను ధర్మముగాఁ బరిపాలించు చుండెను. అటుపిమ్మట నాభార్యతోఁగూడఁ నుగ్రసేనుం డెల్లపుడు వివిధ భోగముల ననుభవించు చుండెను. ఆభార్య పద్మావతి యను నామముగలది. ఆదంపతు లిరువురుఁ బరస్పరానురక్తులయి సకల భోగంబుల ననుభవించు సమయంబున, నొకప్పుడు విదర్భాధిపతియైన సత్యకేతువు తన కొమార్తెను జూడవలెనని తలంచి యా యుగ్రసేనుని సమీపంబునకు నొక భృత్యునిఁ బంపెను. ఆభృత్యుండు మధురాపురంబున కేగి, సత్యకేతు కుశలవృత్తాంతమును జెప్పి యుగ్రసేన కుశలవృత్తాంతమును దెలిసికొని, యీపద్మావతిని దండ్రికిఁ జూడవలెనని కుతూహలము కలిగినది. కావున నీచిన్నదానిని నాతోఁ బంపుమని యుగ్రసేనునితోఁ జెప్పెను. ఉగ్రసేనుం డావచనము నాకర్ణించి శ్వశురగౌరవముచే నాపద్మావతినిఁ బ్రయాణము చేయించి పంపెను. ఆ పద్మావతి పితృగృహమునకుఁ జని తల్లిదండ్రు

లకు నమస్కారము గావించి యచట సఖీజనముతోఁ గ్రీడించుచుఁ జిరకాలము సుఖముగా నుండెను. తల్లిదండ్రులు పుత్రికా స్నేహముచే వస్త్రాలంకారములచేతను, నానావిధ భక్ష్య భోజ్యాదులచేతను, నాదరించుచుండిరి. అటుపిమ్మట పతివ్రత యైన యాపద్మావతి మహోత్సాహాన్వితయై పితృగృహమం దుండు సుఖము శ్వశురగృహమందు దుర్లభంబని తలంచి యనుదినమందు పూర్వకాల పరిచితంబైన సఖీజనంబుతోఁ గూడ నుద్యానోపవనములందుఁ గ్రీడించు చుండెను.

మఱియొకప్పు డా పద్మావతి కదళీషండ మండితంబై యొక పర్వతోత్తమంబును జూచి యచ్చట విహరింపవలె నని తలంచి సఖీజనులతోఁగూడ బయలు వెడలెను. తత్పరిస రంబున పూగ పున్నాగ పాటలాశోక వకుళ చంపకాది పుష్పిత వృక్షవిరాజితంబును, శుక పిక శారికాది మధుర ధ్వనివిలసి తంబును, నానావిధ ఫలపల్లవాన్వితంబునునగు నొక వన ముందుఁ బ్రవేశించి, నానావిధ కమల కల్హార నీలేందీవర శోభి తంబును; షట్పద నినాదాన్వితంబును, హంస చక్రవాకాది మిథునాన్వితంబును, నతిరమ్యంబును నగు నొక సరోవరంబు నవలోకించి, కొంతదడవు జలక్రీడా వినోదంబు సలిపి, సఖీజనం బుతో నతి మధురముగా గానము చేయు చుండెను. అపుడు, వైశ్రవణ భృత్యుండైన యొక యక్షుండు, విమానవరము నధిష్ఠించి గగనమార్గముచేఁ బోవుచు, నీ పద్మావతిం గాంచి, చారుహాసినియుఁ, బూర్ణ చంద్రబింబాననయు, పక్వబింబ ఫలాధరోష్ఠియు, వృత్త పీన పయోధరయు నగు నీ నారిమణి యెవరి భార్య యని యాలోచించుచు దివ్యదృష్టిచే మధురా

పతియైన యుగ్రసేనుని భార్య యనియుఁ, బిత్రుగృహావర్తిని యనియుఁ దెలిసికొని కామాకులిత స్వాంతుండై యీ తరుణీమణితోఁగూడి రతికేళి సుఖము ననుభవింప వలెనని తలంచి, మాయామయుంబైన భర్తృసమాన వయోరూప వేషభాషణంబుల ధరియించి, తత్పరిసరంబున నొక నశోకవృక్ష ఛాయ నాశ్రయించి, యొక శిలాతలమందు నుపవిష్టుండై సుస్వర తాలలయాన్వితంబైన వీణాగానము సేయుచుండెను.

అతిరమ్యంబును మిక్కిలి సుఖకరంబును నగు నాగీతంబును విని సఖీజనంబుతోఁగూడఁ జనుదెంచి, తత్పరిసరంబున నొక విమల శిలాతలమందుఁ గూర్చుండి తనభర్తృ సమాన వయోరూపంబులు గల యాయక్షునిం గాంచి భర్తయని భావించి. భయాకులిత స్వాంతయై లజ్జచే ముఖమును వంచుకొని నేను దురాచారముగల దానను. భర్తను విడిచి పిత్రుగృహమునకుఁ జనుదెంచి చిరకాల మిచటనే నివసించి యుంటినని తలంచుచుండెను. అప్పు డాయక్షుండు పద్మావతీ సమీపంబున కరుదెంచి నీ విరహంబును సహింపలేక నిన్ను జూచుటకై యిచ్చట కేతెంచితిని. క్షణమైన నిన్ను విడిచి ప్రాణములను ధరించుటకు సమర్థుండను గాను. నీ విరహమును సహింపలేక నియుందలి గాఢానురాగంబుచే, నిన్నుజూడ వచ్చితినని, గాఢాలింగన పూర్వకంబయిన సంగమసుఖము కొఱకు, నుద్యమించెను. అప్పు డతఁడి చేష్టల నవలోకించి, సఖీజనము, మఱియొక వనమునకేగెను. అటుపిమ్మట వారిరువురు, నేకాంతప్రదేశంబున స్వేచ్ఛగా రతిక్రీడల సలిపి సుఖము నొందిరి. కొంతసేపటికి శృంగార చేష్టాభేదములచేఁ బాపసమాచారుండైన పర

పురుషుండని తెలిసికొని పాతివ్రత్య లోపముచేఁ బరితపించి నా కాంతుని వేషముచే నిచటకుఁ జనుదెంచి నను వంచిం చితివి కావున, నా పాతివ్రత్యంబుచే దారుణంబైన శాపంబు నిచ్చి నిన్ను నశింపఁజేయఁ గలనని శపించుట కుద్యమించెను. అపు డా యక్షుండు పద్మావతితో నిట్లనియె.

ఓపద్మావతీ! పతివ్రతాధర్మంబులను వక్కాణించెద వినుము. ప్రతిదినమందును భర్తృ శిశ్రూషణంబు స్త్రీలకుఁ బరమ ధర్మంబు. కావున, ననుదినమందును, బతిని సేవించుచు పతివ్రతయైన భార్య భర్తతోఁగూడ సత్కర్మంబుల నాచరింప వలెను. భర్తచేయు నిత్యకర్మములందుసాహాయ్యమును జేయుచు నెల్లపుడు భర్తృసమీపంబున నుండు స్త్రీలు ఐహికాముష్మిక సుఖంబుల నొందెదరు. కాఁబట్టి పతివ్రతలయినస్త్రీలు అత్త మామలను, భర్తను, దద్బంధువులను, సేవించుచు భర్తసమీ పంబున నివసించి యుండవలెను. పుట్టినింటఁ జిరకాలము భర్తను విడిచి స్త్రీలు నివసించినయెడల ననేకానర్థముల నొందు దురు. నీవు భర్తను విడిచి చిరకాలమునుండి పితృగృహంబున నివసించి సఖీజనంబుతో నుద్యానోపవనంబులందు వస్త్రాభర ణాదులను ధరించి స్వేచ్ఛగా గానము సేయుచున్నావు, కాబట్టి నీకుఁ బాతివ్రత్యము లేదు. పతివ్రతలయిన స్త్రీలు, భర్త దేశాం తరమందున్నపుడు వస్త్రాలంకారములను కేశసంస్కారమును విడిచి, యుపవాసయున బ్రహ్మచర్యముల నాచరింతురు.

పతియే దైవమని భావించి భర్తకు సర్వకాలములయం దును దత్సమీపంబున నుండిసేవచేయుస్త్రీలు పతివ్రతలు. మేము తీక్ష్ణకామాకలిత స్వాంతులమయి పరస్త్రీ పరధనముల నప

హరించుచు నక్కడక్కడ సంచరించెదము. నీ సౌందర్యమును జూచి నీతోఁగూడి రతిసుఖము ననుభవింపవలెనని తలంచి నీభర్త్రు వేషమును దాల్చి నిను వంచన చేసితిని. మావంటి యుత్తమజాతి పురుషుల సమావేశము మీబోటి మానవ స్త్రీలకు దుర్లభంబు, కావున నీవు విచారింపకుము. నా వీర్యమువలన మహాబల పరాక్రమ సంపన్నుండైన పుత్రుండొకఁడు కలుగఁగలఁడని చెప్పి, యాయక్షుండు గగనమందలి విమానవరము నధిష్ఠించి కుబేరసమీపంబున కేగెను. అపు డాపద్మావతి తన పాతివ్రత్యమునకు భంగము కలిగెనని మిక్కిలి పరితపించుచు; విలపించెను. అపుడుసఖియ లందరు శోక కారణమును దెలిసికొని యా పద్మావతిని దల్లి సమీపంబునకుఁ దీసికొని వెళ్లి తల్లితో జరిగిన వృత్తాంతము నంతను జెప్పిరి.

అనంతర మా పద్మావతీ వృత్తాంతమును దల్లి తెలిసికొని దుఃఖించుచుఁ దన భర్తతోఁ జెప్పెను. అపు డా సత్యకేతు వను మహారాజు, యౌవనవంతురాలయిన కుమార్తెను బుట్టినింట నింతకాలమువఱకుఁ బ్రేమచే నుంచుకొనుట యనర్థకరంబని పశ్చాత్తాప సంతప్తుండై వస్త్రాభరణాదుల నొసంగి, కొంత పరివారముతో తత్కాలమందు భర్తృగృహమునకుఁ బంపెను. అపుడు మధురాపురాధిపతియైన యుగ్రసేనుండు తన భార్యయైన పద్మావతి నవలోకించి, యింతకాలము నుండి నీ విరహముచేఁ బరితపించు చుంటిని. నీ కుల శీల వయో రూపంబులచేత మోహితచిత్తుండనై నిన్నెడబాసి క్షణమైన నుండజాలను. నిన్నువిడిచి ప్రాణంబులను ధరించుటకు సమర్థుం

డను గాను. ఇంతకాలమునుండి నీ విరహాగ్నిచే సంతప్త హృదయుండ నైతినని; యా పద్మావతితోఁగూడ నతికాముకుండై స్వచ్ఛందన వనితాది సాంసారిక భోగంబుల ననుభవించుచుండెను.

అటుపిమ్మటఁ గుబేరభృత్యుండైన యక్షునిచే నిక్షిప్తంబైన పద్మావతీ గర్భంబు దినదినప్రవర్ధమానంబయ్యె. పిమ్మట నా పద్మావతి పరవీర్యంబుచేఁ బ్రాప్తంబైన గర్భంబతి గర్హితం బని భావించి యనేక మయిన గర్భపాతోపాయములను దెలిసికొని, యౌషధులచే గర్భపాత ప్రయత్నమును జేసెను. భావి వృత్తాంతహేతువైన దైవసంకల్పంబువలన నా ప్రయత్న మంతెయు విఫలం బయ్యె. పిమ్మటఁ బదియవ మాసంబున నా పద్మావతి పుత్రునిం గనెను. ఆ పుత్రునకుఁ గంసుండని నామకరణంబు చేసెను. పూర్వకాలమందు దేవాసుర యుద్ధంబున, మహావిష్ణువుచే నిహతుండైన కాలనేమి యను రాక్షసుం డిచటఁ, గంసుండై జనించి తల్లిదండ్రులకును బంధుజనంబునకును మిక్కిలి శత్రువై సకలలోక భయంకరుండై యాదవ వర్గంబును సకల దేవగణంబును బాధించుచు, వాసుదేవునిచే నిహతుండై మోక్షము నొందెను. కావున పిత్రు గృహమందుండు కన్యక నాశమును బొందును. కనుకఁ బుత్రికా మోహమును బరిత్యజించి నీవు స్థిరచిత్తుండవు కమ్మని, యా బ్రాహ్మణస్త్రీ వసుదత్తునితోఁ జెప్పి విరమించెను. అపుడు తండ్రి యా వచనముల నాకర్ణించి, పుత్రికతో నిట్లనియె. ఓ చిన్నదానా! నీ భర్తయైన శివశర్మ నీ పాప సమాచారముచే మిక్కిలి దుఃఖితుండై స్వగృహంబున కేగెను.

అతండు మంచి బుద్ధిమంతుండును, శమదమాది గుణాన్వితుండును, నీయం దనురాగ యుక్తుండును గావున, నతని గృహమున కేగి, భర్తృసమీపమున సుఖముగా నుండుము. నీయందుండు ప్రేమాతిశయంబు, నీ దుశ్చేష్టలచే నా కపకీర్తికరంబయినది. కాఁబట్టి యిచట నుండి బయలువెడలి పొమ్మని తత్కాలమందుఁ బ్రయాణము చేయించి భర్తృగృహమున కంపెను.

అపుడు తల్లిదండ్రులచేతను, బంధువర్గము చేతను, బరిత్యక్తనై, స్వకృతాపరాధమును దలంచి, పరితపించుచు నొకప్పుడు క్షుత్పిపాసాన్వితనై దుఃఖించుచు, మఱియొక పురమునకుఁ జని యక్కడక్కడ, భిక్షాటనమును జేయుచు జీవించు చుండెడిదానను. అపు డచ్చటచ్చట నీ వృత్తాంతమును దెలిసిన వారు, కులధర్మములను బరిత్యజించి జారులతో స్వేచ్ఛగా సంచరించు మహాపాపాత్మురాలని నిందించు చుండెడివారు. పిమ్మట మఱికొన్ని దినములకుఁ గొన్ని గ్రామముల నతిక్రమించి యున్నతప్రాకార సంవేష్టితంబును, వేదధ్వని సమాకీర్ణంబును, బహువిప్ర సమాకులంబును, ధనధాన్య సమృద్ధంబును, దాసీదాసాలంకృతంబును, నగు భర్తృగృహంబున కేగి భిక్షను యాచించితిని. భర్తయైన శివశర్మ భిక్షా శబ్దమును విని నన్ను భార్యనుగా దెలిసికొని, మందస్మిత ముఖారవిందుండై, మంగళ గౌరియను భార్యను బిలిచి దీనికి నన్నముఁ బెట్టుమని, నియమించి, నాయందుఁ గృపావిష్టచిత్తుండయి, నా పూర్వ దురాచారమును గొంచమైనను స్మరింపక, మృష్టాన్నమును భుజింపఁ జేసెను. అనంతర మా మంగళగౌరి

యను భార్య "నినుజూచి తలవంచుకొని లజ్జించుచున్నది" ఇది యెవతె యని, భర్తయైన శివశర్మ నడిగెను.

అనంతర మాశివశర్మయను విప్రోత్తముండు మంగళగౌరియను భార్యతో నిట్లనియె. ఈయంగన శ్రీపురమందలి వసుదత్తుండను విప్రుని కూతురు. దీనిని ముందుగా నిజకులాచార సరణిం బెండ్లిచేసుకొని, నేనచటఁ గొన్నిదినంబులు నివసించి, యిచటకుఁ జనుదెంచితిని. ఇపుడు నావిరహమును సహింపలేక, పితృగృహము వలనఁ బయలువెడలి, యిచటికరుదెంచినది. కాఁబట్టియీసుందరాంగిని స్నానభోజన వస్త్రాభరణాదులచే గారవింపు మనినఁ బతివాక్యమును విని, దయాకులిత స్వాంతయై యతిప్రేమతో నన్నాదరించెను. నేనపుడు భర్తృకృతంబైన ప్రేమదేవతను; నాసవతి చేయు నుపచారంబుల చేతను, దలవంచుకొని లజ్జించుచు నొకప్పుడైన పాదప్రక్షాళన గాత్ర సంవాహనాదులచేఁ బతిని సేవింప నైతిని. శయనగృహంబునం దేకాంతంబున శృంగారచేష్టలచే నానందింపఁ జేయనైతిని. పరితపించుచుఁ గాలక్రమంబున, మఱికొన్ని దినంబులకు మృతినొందితి; గదాశూల ముద్గర పాణులయిన యమకింకరులం జూచి, కపించుచు, సూర్యకిరణ సంతప్తంబైన దుర్గమ వాలుకా మార్గంబున నతిదుఃఖముతోఁ బోవుచు, నతి సంతప్త గాత్రనై, యమపురంబున కరిగి, యమధర్మరాజుచే నియుక్తంబులయిన తమిస్రాంధ తామిస్ర రౌరవాది నరకంబులం బడి; తీవ్రంబులయిన బహు యాతనల ననుభవించి, కొంత వఱకుఁ బాపక్షయము నొంది, పిమ్మట సర్ప కుక్కుట మార్జా

లాది యోనులందును, శునక జంబూకాది యోనులందును, జనించి, యిపుడు సూకర యోనియందు బుట్టితిని.

ఇపుడు నీ హస్తోదక సేచనంబుచే నాపాపము లన్నియు నశించినవి. నీయనుగ్రహంబు వలన నాకుఁ బూర్వజన్మ స్మృతి కలిగినది. మనుపుత్రుండును, సూర్యవంశ సముద్భవుండును, నగు నీభర్తయైన యిక్ష్వాకు మహారాజు మహావిష్ణ్వంశ సముద్భవుండు. నీవు మహాలక్ష్మ్యంశంబునఁ బుట్టిన మహా పతివ్రతవు. కావున నొక సంవత్సరంబున నీవాచరించు పతిశుశ్రూషా పుణ్యంబును, నా కొసంగి నన్నుద్ధరింపు మని ప్రార్థించిన, నిక్ష్వాకు ధర్మపత్నియగు శ్రుతదేవ, తత్కాలమందు భర్త్రాజ్ఞనొంది, యొక సంవత్సర పతిశుశ్రూషా ఫలంబు నొసంగెను. తదనంతరం బాసూకరి విగత పాపయై దివ్యాంబరాభరణ గంధమాలికా లంకృత శరీరాన్వితయై, దివ్యవిమాన వరము నధిష్ఠించి, "నీ యనుగ్రహంబు వలన సకలపాప విముక్తనైతిని. స్వర్గలోకమున కరుగుచు చున్నానని" చెప్పి, రాజభార్యకు నమస్కరించి యింద్రలోకంబున కేగి చిరకాలము సుఖముగా నుండెను.

## దేవేంద్రుండు రతీ మన్మథ సహితుండై సుకలా పాతివ్రత్యమును బరీక్షించుట

పతియే దైవంబని వాఙ్మనఃకాయంబులచే నెల్లపుడు భర్తృప్రియం బాచరించుచు, భర్తతోఁగూడ సకల భోగముల ననుభవించుట, సత్కులమందు బుట్టిన నంగనామణులకుఁ బరమ ధర్మంబని శ్రుతి స్మృతి పురాణేతిహాసములందు సుప్ర

సిద్ధం బైనది. కావున ప్రోషిత భర్తృకనైన నేనెట్లు భోగముల ననుభవింతు ననిన నాధర్మములను సఖీజనులందఱు యత్యాదరముతో విని, యామె పాతివ్రత్యమును బ్రశంసించుచు సంతసించిరి. పాతివ్రత్యముకల స్త్రీలందఱు, గంగాది తీర్థంబుల కంటెం బవిత్రులు. కావున పతివ్రతా హస్తోదకముచే సూకరి, విముక్త పాపయై, దివ్యదేహమును ధరించి స్వర్గలోకము నొందెనని శ్రీమహావిష్ణువు, వేనభూపాలునితోఁ బతివ్రతా మహిమమును జెప్పి, వెండియు నిట్లనియె.

దేవేంద్రుం డొకప్పుడు, సుకలా పాతివ్రత్యమును పరీక్షింపవలెనని తలంచి, రతీదేవితోఁగూడ మన్మథుని స్మరింప నతండు రతీసహితుండై దేవేంద్రుని కడ కరుదెంచి, నేను జేయు గార్యంబును దెల్పుమనిన; దేవేంద్రుండు మన్మథునితో నిట్లనియె. నేను సుకలా పాతివ్రత్యమును బరీక్షింపఁ దలంచి నిను స్మరించితిని. నీవు నాకు సహాయుండవు కమ్మనిన వల్లెయని యింద్రునితో మన్మథుం డిట్లనియె. ఓ పురందరా! నే ననేకులయిన దేవతలను, మునులను, ననాయాసముగా జయించితిని. ఈ యబలను జయించుట నాకతిసుకరం బని చెప్పి, యింద్రునితోఁ జనెను. దేవేంద్రుం డపుడు సుకలాగృహంబున కేగి యతిసుందర రూపమును దాల్చి తత్పరిసరంబునఁ దిరుగుచు నొక దూతికను, దన యభిప్రాయమును దెలియఁజేయు మని పంపెను. అపు డా దూతిక సుకలా సమీపంబున కేగి, యో నారీమణీ! నీ వెవరిభార్యవు, ఈ గృహమందు భర్తతో వినాగా నీ వొకతెవు సంచరించుటకుఁ గారణం బెయ్యది? నీ వెందు కొఱకు దుఃఖించు చుంటివి? నీ వృత్తాంతమును జెప్పు మనిన;

నా సుకల దూతికతో నిట్లనియె. సత్యవంతుండును, ధర్మాత్ముండును, సుశీలుండును, నగు నొక వైశ్యునకు, నేను భార్యను. నేను నిద్రించు సమయంబున నాకుఁ దెలియకుండగ నా భర్త తీర్థాటనపరుండై యిచటనుండి బయలు వెడలి పుణ్యక్షేత్రములను సేవించు చుండెను. ఇప్పటికి మూఁడు సంవత్సరంబు లతిక్రమించినవి. పతివ్రతలయిన కులస్త్రీలు, నిత్యము భర్త చేయు సుకృతకర్మములందు సాహాయ్యమును జేయుచుఁ దత్సన్నిధియం దుండవలెను. నేనొకతెను; భర్తతో వినాగా నీ గృహమందుండుటచే దుఃఖించు చుంటి ననిన; నా దూతిక సుకలతో నిట్లయె.

ఓ తరుణీ! నీవు మిక్కిలి సుందరాంగివి, నీ యౌవనమును నానావిధ సుఖానుభవంబుచే సార్థకముగా జేసికొనుము. రతిసుఖము లేనియెడల నీ తారుణ్యము వ్యర్థ మగును. దేశాంతరగత భర్తృవృత్తాంత మిప్పటికినిఁ దెలియక పోవుటచే కాలధర్మము నొందెనేమో యను సందియము గలుగు చున్నది. నీ భర్త సజీవుండైనయెడల మహాసాధ్వియగు నిన్ను విడిచి, యింతకాలము మఱియొక ప్రదేశమున నివసించి యుండఁడని నే నూహించితిని. కావున "నీవు తారుణ్య యుక్తుండును, సుందరాంగుండును, సమీపవర్తియు నగునీ నీపరిదృశ్యమానుండైన పురుషునితోఁ గూడి, నానావిధ శృంగారచేష్టలచే రతిసుఖము ననుభవింపుము. అతండు నిను వలచి నీ యందలి యభిలాషను దెల్పుటకై నను బంపెను. దానం జేసి నీ సమీపంబున కరుదెంచితి" ననిన, నా విరసపు వచనముల నాకర్ణించి సుకల దూతికతో నిట్లు పలికెను.

ఓదూతీ! నేను జెప్పెడు మాటలను సావధాన చిత్తముతో వినుము. "బాల్యతారుణ్య వార్ధకంబులును, సౌందర్యంబును, దేహధర్మంబులుగాని యాత్మ ధర్మంబులుగావు. ఆత్మ సదానందమయుండును, నసంగ చిద్రూపుండును, శరీరత్రయ విలక్షణుండును; శాశ్వతుండును; నై యొప్పుచుండు. మనోబుద్ధ్యహంకారంబులును, స్థూల సూక్ష్మ కారణశరీరంబులును, కల్పితంబులు గావున, నిత్యంబు లగుచున్నవి. ఈచేతనాచేతన విభాగమును సద్గురువువలన, నుపనిష ద్వాక్యములచేఁ దెలిసికొని, యపరోక్షజ్ఞాన సంపన్నులయినవారు సంసార దుఃఖ విముక్తులయి ముక్తిం బడయఁగలరు. కామ క్రోధ లోభ మోహా విష్ట చిత్తులయిన మూఢులు త్వఙ్మాంస రుధిర సహితంబును, మలమూత్ర క్రిమిజాల సంకులంబును నగు దేహమందహంకార మమకారాన్వితులయి నారీ స్తన జఘనాది సౌందర్యమును జూచి మోహసాగర నిమగ్నులయి పరస్త్రీ పరధనములను గోరుచు; యమలోకమం దనేక నరకదుఃఖముల ననుభవించి; పిమ్మట నీలోకమందు, జన్మజరామరణ రోగాద్యనేకానర్థముల నొందుచుందురు. అనేక రసాన్వితంబులయిన సాపూప సూప దధి దుగ్ధాదులచేతను, మృష్టాన్న పానఫలరసాదుల చేతను, నీ పాంచభౌతిక దేహంబు వృద్ధినొందును. అపుడు మాంసపుష్టిచే స్తనజఘనాదులు, వృద్ధినొంది కాముకులకు దర్శనమాత్రముచే మోహాకరంబులగు చున్నవి. యువతీమణుల వార్ధకసమయంబున ముఖ స్తన జఘనాద్యవయంబులు క్షయము నొందుచున్నవి. అపుడు కామాంధులయిన మూఢులును, దదవయంబులను జూచి, మోహంబు నొందరు. నఖాగ్ర

ఘర్షణంబుచే కండూతి శమించు చందంబున, స్త్రీపురుష సంయోగంబుచే కండూతి శమించినను నా కండూతి మరల జనించును, గావున స్త్రీపురుషులు మనోనిగ్రహమును సంపాదించి స్రక్చందనాది విషయ సుఖవిరక్తులయి పరమాత్మను దెలిసికొని, వాసనాక్షయమువలన ముక్తిని బొందెదరు". నినుఁ బంపిన వారి శరీరమందును, నా శరీరమందును, త్వఙ్మాంస రుధిరంబులు పూర్ణంబులయి యున్నవి. కాఁబట్టి మోహములకుఁ గొంచమయినను నవకాశము లేదు. ముజ్జగంబులందును సకల స్త్రీలకు స్తనజఘనాద్యవయవంబులు సాధారణంబులు గావున నా యందును నపూర్వంబులయిన స్తన ముఖ జఘనాదులు లేవుకదా! కాఁబట్టి నీవు స్వస్థానమునకేగి నిను బంపినవానితో నీ వృత్తాంతమును జెప్పి సుఖముగా నుండుమని సుకల, దేవేంద్ర దూతికతోఁ జెప్పి విరమించెను.

అపు డాదూతిక దేవేంద్రసమీపంబున కేగి సుకలాభిహిత వాక్యంబులను సమగ్రంబుగా విన్నవించెను. అపుడు దేవేంద్రుండు ధర్మాన్వితంబైన తద్వృత్తాంతమును దెలిసికొని యీవైశ్యభార్య, సత్యజ్ఞాన ధర్మనియమంబులచే సర్వోత్కృష్టమయినది. ఈ మహాసాధ్వి పాతివ్రత్యముచే ముల్లోకములను ధరింపగలదు. చిత్తైకాగ్ర్యంబును, యింద్రియ జయంబును, నాహార నియమంబును, నధిక్యయన బ్రహ్మచర్య నియమంబులును, నీయంగనామణికి గలవు. కాబట్టి యీమె పవిత్రమయిన దేహముకలది. అందువలన మనకు జయింప శక్యము కాదని, దేవేంద్రుండు మన్మథునితోఁ జెప్పెను. అతం డపుడాలోచించి, సాహంకారుండై దేవేంద్రునితో నిట్లు పలికెను.

ఓ దేవరాజా! మనకు శక్యముకాదంటివి, అది సరికాదు. నేను కుసుమ బాణములచే ననేక పర్యాయములు ముజ్జగంబుల జయించితిని. అనేక మహర్షులును దేవతలును, నా కుసుమ బాణాభిఘాతమును సహింపలేక, కామాంధులయి స్త్రీ జితులయిరి. ఈయబలయగు సుకలను జయించుట నాకు మిక్కిలి స్వల్పకార్యము. ఈమె పాతివ్రత్యంబును, బ్రహ్మచర్య నియమంబును, నే నతిశీఘ్రముగా నశింపఁ జేసెదను. నీవు నాసామర్థ్యమును జూడు మని యింద్రునితోఁ జెప్పెను. దేవేంద్రుండా వాక్యమును విని రతీమన్మథ సహితుండై మరల సుకలా మందిర సమీపంబున కేగి, తత్పరిసరంబున, ననేక శృంగార చేష్టల నాచరించుచు, సాభిప్రాయ కటాక్ష వీక్షణంబులం జేయుచుండెను, అపు డాసుకల దేవేంద్ర కృతంబైన శృంగారచేష్టల నవలోకించి, యితని ప్రేరణముచే దూతిక నాసమీపంబంబున కరుదెంచి, నాతో సంభాషించి చనియెను. ఇపు డితండు నా మందిర సమీపంబునఁ గుటిలహృదయుండై, మందహాస కటాక్ష వీక్షణంబులను, నానావిధ శృంగార చేష్టలను జేయుచుఁ దిరుగుచున్నాఁడని తలంచి, తనమందిర మధ్యభాగంబునకుం జనెను.

అటుపిమ్మట నా సుకల మందిర మధ్యభాగంబున నొకాసనమందు సుఖముగాఁ గూర్చుని, పతియే దైవంబని భావించి హృదయాంబుజ మందు లక్ష్మీనారాయణుల నేకాంత మందు ధ్యానించుచు, దుష్ప్రేక్ష్యంబయిన తేజంబుతో రతీ మన్మథులకును, బురందరునకును, గనుపించెను. అపు డా దేవేంద్రుండు, మన్మథునితో నిట్లనియె. సత్య ధర్మ తపశ్శౌచాది

నియమాన్వితలయిన కులాంగనలను, దేవతలయిన జయిం చుటకు సమర్థులు కారు. పూర్వకాలమందుఁ గమలాసనుండు సరస్వతీ సౌందర్యమును జూచి నీ శరాభిఘాతముచేఁ గామా కులితస్వాంతుఁడై, పరమేశ్వర ఫాలనేత్రాగ్నిచే దగ్ధుండవు కమ్మని, నిను శపించెను. పిమ్మట నీవు శాపపరాధలేశముచే దగ్ధ శరీరుండవై, యనంగుండ వైతివి. పార్వతీపరిణయంబైన పిమ్మట నుమామహేశ్వరానుగ్రహంబువలన, మనోభవుండవై ప్రగల్భోక్తుల నిపుడు పలుకుచుంటివి. మహాత్ముఁతో వైరంబు వలన, నింతకుముందు మహానర్థమును బొందితివి. ఈ పతివ్రత శపించిన మనలకు మహానర్థము సంభవింపఁ గలదని దేవేం ద్రుఁడు చెప్పి విరమించెను.

మరల పంచశరుండు పుష్పఫల పల్లవశోభితంబైన యుద్యానోపవనములందు శుకపిక శారికా నినాదంబుల నావి ర్భవింపఁజేసి, సుకలా పాతివ్రత్యమును నశింపఁ జేయుటకు నతి ప్రయత్నము గావించి, విఫలోద్యోగుం డయ్యె. అటుపిమ్మట మన్మథ సహితుండై పురందరుండు శమదమ తపస్సత్యశౌచా న్వితంబును, ధర్మదేవతా రక్షితంబును నగు మందిరంబున నివ సించుచు సుకల జయింప శక్యము కాదని తలంచి, ధర్మదేవ తను బ్రార్థించి, యా ధర్మదేవతతో నిట్లు పలికెను. ఓధర్మ దేవతా! నీవు సకలజీవులకు స్వర్గాపవర్గంబుల నిచ్చి ముల్లోకం బుల నెల్లపుడు రక్షించు చుందువు. ఇపుడు రతీసహితుండై మన్మథుఁడు మహాపతివ్రతయైన సుకలను జయించుటకు నుద్య మించి, సుకలచే జితుండై పరాభవము నొందెను! ఈమన్మథుం

డెట్లు జయింపఁగలఁడు? జయించుటకు సాధనంబెయ్యది యనిన ధర్మదేవత దేవేంద్రునితో నిట్లనియె.

ఓ దేవరాజా! పూర్వకాలమందు మహాత్ముండైన విశ్వామిత్రుండు మదనబాణ హతుండై మేనకావలోకనంబుచేఁ దపోభంగంబు నొందెను. నీవును బరమ పాపాత్ముండగు మనోభవుని సాయకంబులచే నిహతుండవై యహల్యా సంగమంబు వలన, గౌతము శాపంబు నొందితివి. వాతాంబు పర్ణాశను లయిన విశ్వామిత్ర, పరాశరాది, తపోధనుల నయినను జయించెను గాని మన్మథుం డీ సుకలను జయింప సమర్థుండు కాఁడు. ఈ సుకల మహామహిమము గల పతివ్రత, ఈమె భర్తయైన సుశీలుండు తపోధనుండు. దానంజేసి తపస్సత్య శౌచ శమ దమాది గుణంబుల తోఁగూడ నే నిచట నివసించియుందును. తపస్సత్య శౌచాన్వితులైన తపోధనులును, పతివ్రతలును, నివసించుఁ బ్రదేశంబున, వాణీ హిరణ్యగర్భులును, లక్ష్మీ నారాయణులును, పార్వతీ పరమేశ్వరులును, సకలదేవలతోఁగూడ నివసించెదరు. కాఁబట్టి యీమన్మథుండు సుకలను జయించుటకు నుద్యమించి పరాభవంబు నొందెను. ఈమె పాతివ్రత్యమును నశింపఁజేయుటకుఁ నీపన్మాత్రంబైన శక్యము కాదనిన, నా ధర్మదేవతా వచనంబుల నాకర్ణించి రతీసహితుండై మన్మథుండును దేవేంద్రుండును స్వర్గలోకంబున కరిగిరి.

అటుపిమ్మట ధర్మదేవత తపస్సత్య శౌచాది గుణంబులతో నేను నివసించు మందిరంబున మనోభవునకుఁ గొంచెమయినను నవకాశము లేకుండగ జేసెదను. శకుంతరూపంబును ధరించి నేను సుకలామందిరంబున కరిగి యామెకు భర్త్రాగమ

నమును బోధించి యామెకు విశేషమయిన హర్షముఁ గలుగఁ జేసెద నని భావించి యొక శుకరూపమును దాల్చి, సుకలా సమీపంబున కేగి ఓనారీమణీ! నీభర్త స్వల్పకాలములో రాగలఁ డు. నీవువిచారింపక సుఖముగా నుండుమని చెప్పి యంతర్హితం బయ్యె. అవు డామాటను విని సుకల, మహాహర్షముతో దైవ జ్ఞుండైన యొక బ్రాహ్మణుని బిలిచి చందన తాంబూలాదులచే నతనిఁ బూజించి, యోభూసురోత్తమా, నాభర్త స్వగృహం బున కెపుడు చనుదెంచును. నీవు దైవజ్ఞుండవు గావునఁ జెప్పు మనిన నాభూసురోత్తముండు నీ భర్త పుణ్యతీర్థములను సేవించి సుఖముగా, నేఁడుదినములలో రాగలఁ డని చెప్పి, స్వగృహం బునకుఁ జనెను. సుకల తద్వచనము నాకర్ణించి స్వస్థచిత్తయై స్వగృహమందు సుఖముగా నుండెను.

మన్మథుండు స్వర్గలోకంబున కేగి పిమ్మట మహామహు లయిన యనేక మునీశ్వరులను దేవతలను జయించితిని గాని యీసుకలను జయించుటకు నసమర్థుండ నైతినని మరలఁ జింతించి దేవేంద్రునిఁ జూచి నీవు ముఖ్యముగా సహాయుండవు కమ్మని యతి దైన్యముతోఁ బ్రార్థించి యొక దూతికను బిలిచి, నీవు సుకలాగృహంబునకుఁ జని యామె కంతరంగసఖివై పతి వ్రతా ధర్మములం బోధించి పిమ్మటఁ గపటముచే నందనవన మునకుఁ దీసికొని రమ్మని యానతిచ్చెను. ఆదూతిక సుకలా గృహంబున కేగి యామెచే సత్కారంబు నొంది తదీయ క్షేమ మును దెలిసికొని కొన్ని పతివ్రతాధర్మములను బోధించెను. ఆధర్మముల విని యాసుకల సంతసించి దూతికతోఁ దనవృత్తాం తము నిట్లు చెప్పెను.

## మన్మథ పురందరులు సుకలా పాతివ్రత్య భంగముకొఱకు నతి ప్రయత్నము గావించి పరాభవము నొందుట

నేను సర్వధర్మజ్ఞుండును, గుణవంతుడును, ధీరుండును నగు సుశీలుండను వైశ్యునికి భార్యను. సుకల యను పేరు కలదానను. నన్నొకతెను గృహమందు విడిచి నాభర్త తీర్థాటన పరుండై పుణ్యక్షేత్రములను సేవించు చుండెను. సకల సౌభాగ్యంబులకు ముఖ్య కారణంబైన భర్తను విడిచి, కులాంగనలు యొంటరిగా నుండుట ధర్మవిరుద్ధం బని తలంచి, దుఃఖించుచుంటి ననిన, నామాటను విని దూతిక సుకల నూరార్చి, హరిచందన మందార పారిజాతాది దివ్యవృక్ష పరివృతంబును, సర్వర్తు పుష్పఫల పల్లవ శోభితంబును, శుకపిక శారికా మధురధ్వని సంకులంబును, యక్షకిన్నర గంధర్వ గానాన్వితంబును, బుణ్యతీర్థోదక పవిత్రంబును నగు నందన వనమందు మనశ్శాంతి కలుగ గలదని చెప్పి, యచటికిఁ దీసికొనివెళ్ళిఁ గపటముగా మంచిమాటలచేఁ బ్రవేశింపఁ జేసి యనేకాద్భుత విచిత్రప్రదేశములను జూపించుచు, సుకలను మోహపెట్టుటకై కపటచేష్టల నాచరించు చుండెను. అపుడు దేవేంద్రుండు దేవదేవుండగు మహాదేవునిచే దగ్ధశరీరుండవౌటచే నంగహీనుండవైతివి. ఈ సుకలను నీ వెట్లు జయింపగలవనిన, దేవేంద్రునితో మన్మథుం డిట్లనియె.

నే నంగహీనుండ నైనను, స్త్రీశరీరము నాశ్రయించి పురుషులను, బురుష శరీరము నాశ్రయించి స్త్రీలను, గామా

కులిత స్వాంతులను జేయుచుండును. కాఁబట్టి నీవు దివ్యగంధాను లిప్తంబును, దివ్య మాల్యాభరణ వస్త్రాలంకృతంబును, నగు సుందర విగ్రహమును ధరించి, సుకలాపరిసరంబున సంచరించితివేని, నీ శరీరమందుఁ బ్రవేశించి సుకలను మోహాన్విత స్వాంతనుగాఁ జేసి జయించెదననిన, నాప్రార్థన నంగీకరించి, యింద్రుండు దివ్యసుందర విగ్రహుండై, తత్పరిసరంబున సంచరించుచుండెను. అపుడు వసంతుండు సకలవృక్షములను ఫల పల్లవ కుసుమ స్తబక సహితములను గావించి, మన్మథునికి సహాయుండయ్యె. దేవతారూపుండైన గంధవహుండు కుసుమ గంధయుక్తంబయిన వాయువును వీచుచుండెను. అపుడు మన్మథుండు సక్రోధుండై యక్షకిన్నర గంధర్వకృతంబైన గానంబును, శుకపిక శారికాది పక్షికూజితంబులను నావిర్భవింపఁ జేసెను. అతిమధుర రసాన్వితంబులయిన నానావృక్షఫలంబులు దర్శనమాత్రముచేతనే భక్షణేచ్ఛను గలుగఁ జేయుచున్నవి. అట్టియెడ సుకలను జూచి, రతీదూతిక లిరువురు, మందస్మిత ముఖారవిందలయి, ఓతరుణీమణీ! నీయావనమును వ్యర్థము చేయకుము. భర్తృసమావేశము నీకు దుష్ప్రాపంబు గావున, నీ సుందరపురుషునిఁ గూడి నానావిధ శృంగార భోగముల ననుభవింపు మనిన, నీ సర్వవృత్తాంతమును దూతికా కృతంబైన కపటంబునుగా నప్పుడు దెలిసికొని, యామాటలను వినక యుచ్ఛ్వాస నిశ్వాసములను మందమందముగా నియమించి, ఘ్రాణేంద్రియ వ్యాపారమును నిరోధించెను. అటుపిమ్మట ఫలములయం దాశను విడిచి; తద్రసాస్వాదనేచ్ఛను నిరసించి పతిని దైవముగాఁ దలంచుచు, నాపాతివ్రత్య భంగముకొఱకు

మన్మథపురందరులు వసంత ఋతుకాల వైభవంబు నావిర్భ వింపఁ జేసెనని భావించి, యతి శీఘ్రంబుగా స్వగృహామధ్యం బునకుఁ జని సుఖముగా నుండెను. అపుడు రతీమన్మథ పురంద రాదు లందఱు నీసుకల మహాసాధ్వి గావున మనకెన్నఁడును జయింప శక్యము కాదని విరమించి స్వర్గలోకంబున కేగి స్వస్థ చిత్తులయి సుఖముగా నుండిరి.

## సుకలాపతికి, యమధర్మరాజు సాక్షాత్కరించి, పరమ ధర్మంబును బోధించుట

అటుపిమ్మటఁ గొన్ని దినంబులకు సుకలాపతియైన వైశ్యుండు గంగాద్యనేక పుణ్యతీర్థంబులను బుణ్యక్షేత్రంబు లను సేవించి మా పితృదేవతలందఱుఁ గృతార్థులయిరి. నేను ధన్యుండ నైతినని తలంచి, తన పరివారముతో మహానందముగా స్వగృహాభిముఖుండై బయలువెడలెను. అపుడు యమధర్మ రాజు దివ్యరూపముతో సాక్షాత్కరించి, ఓవైశ్యోత్తమా! నీవు వ్యర్థముగాఁ దీర్థాటనమును జేసితివి. నీకుఁ గొంచమైన తీర్థ యాత్రా ఫలము లేదని వైశ్యునితోఁ జెప్పెను. ఆవైశ్యుండు నీవెవరవు? నాకుఁ దీర్థయాత్రాఫల మెందుకు లేదనిన, నా యమధర్మరాజు వైశ్యునితో నిట్లనియె. బ్రహ్మ క్షత్రాది నాలుగు వర్ణంబులలో బ్రాహ్మణుండు సర్వోత్కృష్టుండు. నాలుగాశ్రమంబులలో గృహస్థాశ్రమము మిక్కిలి యుత్కృ ష్టమయినది. ధర్మజ్ఞానవతియు, దేవబ్రాహ్మణ భక్త్యన్వితయుఁ బుణ్యకర్మముల నాచరించునదియు, శమదమ తపశ్శౌచాది గుణాన్వితయుఁ బతిభక్త్యన్వితయు, నగు పతివ్రతయైన భార్య

యును, తపోధనుండైన గృహస్థుండును, నివసించు గృహము పరమపావన మయినది. అచట గంగాది సర్వతీర్థంబులును, పితృదేవతలును, నింద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలకులును, నివసించి యుందురు. భార్యావిహీనుండైన పురుషునికి యజ్ఞదాన తపస్సత్యశౌచాది సుకృతంబు లధిక ఫలప్రదంబులు కావు. గృహస్థు నాశ్రయించి యితరాశ్రమాన్వితులును. నితర ప్రాణులును, జీవెంచెదరు.

పతివ్రతయైన భార్యవలన గంగాది సకలతీర్థ ఫలము సంభవింపఁ గలదు. భార్యావిహీనంబయిన గృహం బరణ్య ప్రాయంబని యెఱుంగ వలయు, సత్కళత్రాన్వితంబైన గృహంబునందు గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులును, లక్ష్మీగౌరీ సరస్వతులును, వ్యాస వసిష్ఠ పరాశరాది మహాత్ములును నివసించెదరు. పెక్కు మాటలేల గృహస్థునకు భార్యాసమంబైన సుఖసాధనంబును, బుణ్యకర్మ సాధనంబును నగు మఱియొక పదార్థము లేదు. భార్యాసహితుండైన గృహస్థునకు, సకల వేదంబులును, దద్విహిత యజ్ఞాది సుకృత కర్మంబులును, ధర్మార్థ కామాది పురుషార్థ సాధనంబు లగుచున్నవి. నీ భార్యయైన సుకల నీవు గృహమునుండి నిర్గమించిన క్షణము మొదలుకొని యిప్పటి వఱకు దుఃఖించు చున్నది. గృహస్థుండు భార్యాసహితుండై సుకృతకర్మముల నాచరింపవలయు. కడు దుఃఖాన్వితయుఁ బతివ్రతయు నైన భార్యను గృహమందు విడిచి నీవు పుణ్యతీర్థములను సేవించితివి. ధర్మాన్వితయు, నిత్యానురక్తయుఁ బతివ్రతయు నగు భార్య నొకతెను, గృహమందు విడిచి, భర్త పుణ్యక్షేత్రములను సేవించుట ధర్మవిరు

ర్ధంబుఁ గావున నీపిత్రుదేవతలు శృంఖలాబద్ధ దేహులయి దుఃఖము నొందుచున్నారు. కనుక నీకుఁ దీర్థయాత్రాఫలంబు లేదని వక్కాణించితిని. పత్నీకరాగ్ర పచితంబైన యన్నమును శ్రద్ధాభక్తులతోఁ బుత్రుఁడు పిండదానము చేసిన, పిత్రుదేవతలమృతపాన తుల్యంబగు ప్రీతి నొందఁ గలరు. నీవు భార్యను విడిచి పుణ్యతీర్థములను సేవించుటచేత నీవాచరించుఁ దీర్థశ్రాద్ధాది కర్మంబులుకూడ విఫలంబులయినవి.

అపుడు వైశ్యుండామాటలను విని నాకు ఫలసిద్ధి యెట్లుకలుగును. పిత్రుదేవత లెట్లు శృంఖలాబంధ విముక్తులయ్యెదరు. నే నెట్లు ధన్యుండ నగుదు ననిన, యమధర్మరాజు వైశ్యునితో నిట్లనియె. నీవు గృహమందుఁ బ్రవేశించి పుష్కర ప్రభాస కురుక్షేత్ర గయాప్రయాగాది క్షేత్రంబులను స్మరించి, భార్యతోఁగూడ నిత్యనైమిత్తిక దానంబులను, శ్రాద్ధాది కర్మంబులను, యథావిధిగా నాచరింపుము. భార్యను విడిచి తా నొక్కఁడు చేయు సకలకర్మంబులు వ్యర్థంబులు కావున, నిటుపిమ్మట భార్యాసహితుండవై గృహదేవతలను, పిత్రుదేవతలను, నారాధింపుమని చెప్పి యముం డంతర్హితుండయ్యె.

అటుపిమ్మట నావైశ్యుండు తన పరివారముతోఁగూడ స్వగృహమునకుఁ జనుదెంచెను. అపు డాసుకల భర్తను జూచి కడుదుఃఖాన్వితయై కనులవెంట జాఱిన నశ్రువుల, చేలాంచలంబులం దుడుచుకొనుచు, మరందాసక్తి భరంబున నరవిందంబు నావరించు మధుపంబుంబోలె ముఖారవిందంబు నావరించు, ముంగురులం గోరుల నెగదువ్వుకొనుచు, వినయవినమితోత్తమాంగయై, భర్తృపాదములకుఁ బ్రణామము

గావించెను. పిమ్మట వైశ్యుండు మిక్కిలి ప్రేమాన్వితంబు లయిన మాటలచే సత్యాదరంబుగా భార్యను నూరార్చి సర్వము విరించికృతంబని యెఱింగించి, యమధర్మరాజు చెప్పిన సకల ధర్మములను నాభార్యకుఁ జెప్పెను. ఆమె యామాటలను విని సంతసించి యత్యాదరముతో భర్తను బూజించి భర్తతోఁగూడ దేవపూజా శ్రాద్ధ దానాది పుణ్యకర్మముల నాచరించుచు, సుఖముగా నుండెను. ఇట్లు కొంతకాల మా దంపతు లిరువురు వివిధభోగముల ననుభవించుచు, సుఖముగా నుండిరి.

అటుపిమ్మట నొకప్పుడు బ్రహ్మేంద్ర రుద్రాది మరుద్గణంబులును, నేనును, యక్షకిన్నర గంధర్వ సిద్ధవిద్యాధరులును, వసిష్ఠ పరాశరాది మహర్షులును, వైశ్య గృహమునకుఁ జనుదెంచి, యభీష్టమయిన వరము నొసంగెదము వేడుమనిన, నావైశ్యుం డేపుణ్యకర్మ ప్రభావంబుచే మీరలందఱు మద్గృహంబునకుఁ జనుదెంచితిరని యడిగెను. అపుడు దేవేంద్రుండు వైశ్యునితో నిట్లనియె. ఓవైశ్యోత్తమా! నీభార్య మహాపతివ్రత. రతీమన్మథులును, నేనును, మాయోపాయములచే ననేక పర్యాయములు పాతివ్రత్య భంగముకొఱకుఁ బ్రయత్నించినను, బతియే దైవంబని భావించి, పాతివ్రత్యమును గాపాడుకొనెను. అందువలన మీరలిరువురు సర్వదేవతలకుఁ గృపాపాత్రులయిరి. ఆకారణంబుచే మేమందఱము నీకుఁ బ్రసన్నుల మైతిమనిన, నామాటలను విని వైశ్యుం డానందాశ్రు పరిపూతుండై, మీరలు ప్రసన్నులరయిన యెడల, దేవబ్రాహ్మణ భక్తిని, సత్యధర్మములయం దాసక్తిని గలుగఁ

జేసి, నాభార్యతోఁగూడ నాకును నాపితృపితామహాదులకును, వైకుంఠలోక నివాస సుఖమును గలుగఁ జేయుఁ డని ప్రార్థించెను.

అపుడు దేవతలందఱు వల్లెయని, సుకలాపాతివ్రత్యమును శ్లాఘించుచు, మహాహర్షముతో నీదంపతులకు మీఁది భాగంబునఁ బుష్పవర్షమును గురిపించిరి. గంధర్వులు గానము చేసిరి. అప్సరస లాడిరి. అనంతర మీదంపతులను శ్లాఘించుచు దేవతలందఱు స్వర్గలోకంబున కేగిరి. అటుపిమ్మట నా యనుగ్రహమువలన వైకుంఠ పార్షద ప్రవరశోభితంబును, దివ్యహంసాన్వితంబును, నవరత్న విరాజితంబును, నగు స్వర్ణ విమానంబు నధిష్ఠించి దివ్యమంగళ విగ్రహాన్వితులయి, యాదంపతు లిరువురు, వైకుంఠ లోకము నొంది సుఖముగా నుండిరి. ఈసుకలా చరిత్రమును శ్రద్ధాభక్తులతో వినువారు ధన ధాన్య సమృద్ధిని పుత్రపౌత్రా ద్యభివృద్ధినిఁ బొంది, నానా విధ దేవమానుష భోగముల ననుభవించి, యింద్రాదిదేవతా నుగ్రహముచే స్వర్గలోకము నొందఁగలరు. పతివ్రతయైన భార్య గంగాది తీర్థ తుల్యంబుగావున, భార్య తీర్థమనంబడునని మహావిష్ణువు పతివ్రతామాహాత్మ్యము నిట్లు వేనభూపాలునితో జెప్పెను.

## పితృసేవామహిమను జెప్పుట.

అటుపిమ్మట వేనభూపాలుండు "నీచే సమాఖ్యాతంబైన భార్యాతీర్థంబును విని సంతసించితిని. పుత్రులకు సర్వోత్కృష్ట ఫలదంబును సంసార సంతాప శాంతికరంబును నగు

పితృతీర్థంబును, విస్తరించి చెప్పుమనిన, “ మహావిష్ణువు వేన భూపాలునితో నిట్లనియె. పరమపవిత్రంబైన కురుక్షేత్రంబు నందు, నతివృద్ధుండును, వేదశాస్త్రకోవిదుండును నగు కుండలుండను భూసురోత్తముండు గలండు. అతనికి సుకర్ముండను సుగుణాన్వితుండైన పుత్రుండు కలండు. ఈ పుత్రుండు తండ్రి వలన వేదశాస్త్రముల నభ్యసించి ధర్మజ్ఞుండై వృద్ధులయిన తల్లిదండ్రులకు నిత్యము స్నాన భోజన పాదప్రక్షాళనాది శుశ్రూషణముఁ జేయుచు నతిమృదువైన శయ్యాతలంబున శయనింపఁజేసి, పరమభక్తితోఁ బాదసంవాహనము గావించు చుండెను.

ఆ కాలమందుఁ గశ్యప కులసంభవుండైన పిప్పలుండను విప్రుండు కలడు. అతండు శమదమాది గుణాన్వితుండును, ధర్మజ్ఞుండును, కామక్రోధ వివర్జితుండును, శీత వాతా తప సహుండును, నేకాగ్ర చిత్తుండును, బ్రహ్మధ్యానాన్వితుండును, నగుచు మందస్మిత ముఖారవిందుండై, యచలమువలె నిశ్చేష్టితుండై తీవ్రముగాఁ దపం బాచరించు చుండెను. అపుడింద్రాది దేవతలును, మహర్షులును, నత డాచరించు తపంబును జూచి, స్థాణువువలె నిశ్చలుండై యింద్రియ వృత్తులను నిరోధించి, యీ పిప్పలుండు ఘోరంబగు తపంబు నాచరించు చున్నవాఁడు. ఇప్పటికి సహస్ర సంవత్సరంబు లయినవి. ఇట్టి తపంబు నెన్నడును జూడమైతి మని మిక్కిలి యాశ్చర్యము నొందిరి. అతని శరీరోపరి భాగమందుఁ బిపీలికా విరచితంబు లయిన పుట్టలును, నానావిధ తరుగుల్మలతాదులును, బయలు వెడలినవి. ఆ పిప్పలుండు పిపీలికా భక్షిత త్వఙ్మాంస రుధిరుం

డును, శల్యావశిష్టుండును, వాయుభక్షకుండును, నగుచుఁ దపం బాచరించు సమయంబున, విషోల్బణంబులయిన కృష్ణ సర్పంబులు గఱచు చుండెడివి. అట్లు గఱచినను, నా విష జ్వాల లతనిఁ దపఃప్రభావంబుచే నశించు చుండెడివి. మేఘ మధ్యంబునుండి సూర్యకిరణంబులు వెలువడిన చందంబున, పుట్టలోనుండి వహ్నిజ్వాలలు బయలువెడలి చూచువారికి భయమును గలుగఁజేయు చుండెడివి.

ఆసమయంబున దేవత లతని మహాతపంబును జూచి సంతసించి యతనిమీఁది భాగంబునఁ బుష్పవర్షంబును గురి పించి, యోవిప్రోత్తమా! నీవు శ్రుతిస్మృతి విహిత సకల ధర్మజ్ఞుండవు. నీ తీవ్రతపంబునకు మేము సంతోషించితిమి. యభీష్టమైన వరము నొసంగెదము. కోరు మనినఁ, దద్వాక్య ములను విని, పిప్పలుండు వినయ వినమిత కంధరుండై పరమ భక్తిచే దేవతలకు నమస్కరించి, మహాహర్షాన్వితుండై, జగం బంతయు నాకు స్వాధీనమై యుండవలెను. నేను విద్యా ధరుండనై కామగంబైన నవరత్న ఖచిత స్వర్ణ విమానరూపం బగు యానంబు నధిష్ఠించి సకలలోకములను సంచరించుచు దివ్యభోగముల ననుభవించు చుండవలెనని ప్రార్థించెను. అపు డతనికి దేవత లభీష్టమయిన వరము నిచ్చి స్వర్గలోకంబున కేగిరి. అటుపిమ్మటఁ బిప్పలుండు సర్వవిద్యా విశారదుండై విద్యాధర పదంబు నొంది సకల లోకంబులను సంచరించుచు జగంబంతయు నాకు స్వాధీనంబైనది. నాతో సమానుం డేలోకంబునందును లేఁడని తలంచి యతి గర్వాంధకార యుక్తుండై యుండెను.

అపుడొక నదీతీరమందుండు నొక సారసపక్షి యో భూసురోత్తమా! జగంబంతయు నాకు స్వాధీనంబైనది. నేను మహామహిమాన్వితుండ నని గర్వించు చున్నావు. అనేక సంవత్సరంబులు ఘోర తపంబాచరించినను పరాపరంబులైన యాత్మానాత్మల నెఱుంగవు. కావున నీవు మూఢచిత్తుండవు. కుండలపుత్రుండైన సుకర్ముండను విప్రుండు పరాపరంబులైన యాత్మానాత్మల నెఱింగిన వాఁడు. అతనితో సమానుండైన జ్ఞానవంతుం డేలోకమందును లేఁడు. అతండు యాగదాన హోమాదుల నాచరింపలేదు. ఆ మహామహుండు వేదాధ్యయన సంపన్నుండు. సర్వశాస్త్ర కోవిదుండు. బాల్యము మొదలుకొని యహర్నిశంబులందుఁ బితృ భక్తియుక్తుండై పితృమాతృ సేవను జేయుచుండెడి వాఁడు. తత్సేవా ప్రభావంబుచే మహాజ్ఞాన వంతుండై యుండెను. నీవు జ్ఞానవిహీనుండవై వ్యర్థముగా గర్వము నొందు చున్నావనిన, నీవు పక్షి రూపంబుచే నన్ను నిందించు చున్నావు. బ్రహ్మవిష్ణ్వాది దేవతలలో నీవెవ్వండవు. పరాపరంబులైన యాత్మానాత్మ లెవ్వి. చెప్పుమనిన కుండలపుత్రుండైన సుకర్ముని సమీపంబునకుఁ జని, పరాపర వస్తు స్వరూపంబులను నా యథార్థ స్వరూపంబును నతని నడుగు మని చెప్పెను. ఆమాటలను విని విప్రుండు సుకర్ముని సమీపంబున కతివేగంబుగా జనెను.

అటువిప్రుడు పిప్పలుండు కుండలగృహంబున కేగి సత్యధర్మాన్వితుండును, బితృభక్తి పరాయణుండును, దల్లిదండ్రుల పాదసమీపంబునఁ గూర్చుని పాదసంవాహనము నాచరించు చున్నవాఁడును, బరమశాంతుండును నగు సుకర్ముని జూచి,

ద్వారదేశమందు నిలుచుండెను. అపు డా సుకర్ముండు, పిప్ప లుని జూచి యాసనమునుండి శీఘ్రముగా లేచి, యెదురుగాఁ బోయి పాద్యార్ఘ్యముల నిచ్చి సముచితాసనమందుఁ గూర్చుండ నియమించి, కుశలము నడిగి, నదీతీరమందుండు సారస మను పక్షిశ్రేష్ఠము నీ గర్వమును దెలిసికొని నా సమీపంబున కరు దెంచి నాతో సంభాషించుమని చెప్పుటచే నిచటకు నరుగు దెంచితివి. నీ వృత్తాంతమును నే నెఱుంగుదు నని చెప్పెను. అపుడు పిప్పలుం డామాటలను విని, యా సారసపక్షి, పరాప రంబులయిన యాత్మానాత్మలను నీ వెఱుంగుదు వని, నాతోఁ జెప్పెను. ఆ పక్షిశ్రేష్ఠ మెవరు? ఆత్మానాత్మల, నిజస్వరూపం బెయ్యది? అద్దానిని నాకు వివరించి తెలియఁజేయు మనినఁ, దద్వచనముల నాకర్ణించి సుకర్ముం డితనికి విశ్వాసమును గలుగఁ జేయుటకై, యింద్రాది దేవతలను బ్రార్థించి, ప్రత్య క్షము గావించెను.

అపుడు దేవతలు సాక్షాత్కరించి మమ్ములను స్మరిం చుటకుఁ గారణం బేది యని యడిగిన, నీ పిప్పలుం డతిథియై మా గృహంబునకుఁ జనుదెంచెను. వీని విశ్వాసము కొరకై స్మరించితిని. నా కితరమైన ప్రయోజనం బేమియు లేదు. మీరు స్వస్థానమునకు వెళ్లుండనిన, దేవత లామాటలను విని మా దర్శనము విఫలము కాదు. అభీష్టమయిన వరమును వేడుము. ఇచ్చెద మనిన, ననవరత పితృభక్తిని, మాతాపితలకు వైష్ణవ లోకమును బ్రసాదింపుఁ డని ప్రార్థించెను. అటులే పిమ్మట నభీష్ట వరము నొసంగి దేవతలు స్వస్థానంబున కరిగిరి. ఈ యద్భుత వృత్తాంతమును పిప్పలుం డవలోకించి, యాశ్చర్యావిష్ట

చిత్తుండై యతికౌతుకంబుతోఁ నా సారస పక్షిస్వరూపమును బరాపరంబులయిన యాత్మానాత్మ స్వరూపములను నాకు బోధింపు మనిన నా సారసపక్షి మహాత్ముండైన చతుర్ముఖ బ్రహ్మయని చెప్పి పరమాత్మ స్వరూపమును జెప్పుట కుపక్రమించెను.

సర్వగతుండును, సర్వజ్ఞుండును, సర్వాంతరాత్ముండును, చిత్సదానంద మయుండును, స్వప్రకాశుండును, నగు పరమాత్మ కరంబులు లేనివాఁడైనను, సర్వకార్యములను జేయువాఁడు. పాదవిహీనుండైనను గమనము చేయువాఁడు. కర్ణవిహీనుండైనను శ్రవణశీలుఁడు. నేత్రవిహీనుండైనను సర్వము జూచువాఁడు. అసంగ చిద్రూపుండగు పరమాత్మ కర పాద కర్ణ నాసాది విహీనుండైనను, సకల శరీరంబులందును, జీవాత్మ రూపుండై ప్రవేశించి జీవోపాధియైన కరచరణ కర్ణ నాసాది శరీరావయవంబులచేత సకల కార్యంబులం జేయుచుండు. సత్వ రజ స్తమో గుణాన్వితంబైన మూలప్రకృతిని శరీరముగా స్వీకరించిన యెడల నా పరమాత్మ సకల జగత్కారణంబని ఈశ్వరుండని మూర్తిత్రయ కారణంబని చెప్పంబడు. ఇయ్యది పరమాత్మ స్వరూపమని యెఱుంగ వలయు. ఇటు పిమ్మట నపరంబైన జగత్సృష్టినిఁ జెప్పుచున్నాను. సావధానుండవై వినుము. ఆపరమాత్మ మహాప్రళయ కాల సముద్రోదకమందు శేషపర్యంక శయనుండై, తన నాభిపంకజమువలనఁ జతుర్ముఖ బ్రహ్మను జనింపఁ జేసి, భూతభౌతిక సృష్టినిఁ జేయుమని యాజ్ఞాపించెను.

ఆ భూత భౌతికంబుల నాత్మయని చెప్పంబడు. అపుడు మార్కండేయుం డంధకారమందుఁ మిక్కిలి పరితపించుచు, సముద్ర తరంగములయందు నిమజ్జనోన్మజ్జనంబులం జేయుచు, దిరిగి తిరిగి విశ్రాంతి స్థానముఁ నొందక, యనేక సూర్యప్రతీకాశుండును, దివ్యాభరణ భూషితుండును, దివ్యమాల్యాంబర ధరుండును, శంఖ చక్ర గదాధరుండును, యోగనిద్రా గతుండును, శేష శయనుండును, నగు శ్రీమహావిష్ణువు నవలోకించి యో పరమేశ్వరా! నీ వవాఙ్మానస గమ్యుండవు. భక్తవత్సలుండవు. కావున నన్ను రక్షింపు మని ప్రార్థించెను. అపుడు మహావిష్ణు ప్రసాదంబుచే దంష్ట్రాకరాళ వదనంబును, కృష్ణాంజన చయోపమిత మహాకాయంబును, గల యొక మహాశక్తి ప్రసన్నంబై, నీవు వెఱవకు మని యభయమిచ్చి, యతివిస్తృతంబైన పద్మపత్రమందు గూర్చుండ నియమించి, మార్కండేయునితో సాదరంబుగా నిట్లు పలికెను.

ఓ భూసురోత్తమా! అసంగుండును సచ్చిదానంద రూపుండును నగు పరమాత్మయే, శేషపర్యంక శయనుండైన మహావిష్ణువు. అనిర్వచనీయ సకలశక్తి యుక్తంబును, యోగనిద్రా రూపంబును, సకల జగజ్జన్మాది కారణంబును, చండీ నవాక్షరీ దుర్గా పరదేవతా రూపంబును, నగు కాళరాత్రి యను వైష్ణవ శక్తినిగా నన్నునుఁ దెలిసికొను మని మార్కండేయునికిఁ జెప్పి యంతర్ధానము నొందెను. అటుపిమ్మట మార్కండేయుండు నాభికమలమందుండుఁ జతుర్ముఖబ్రహ్మను తత్కృతంబైన భూత భౌతిక సృష్టిని గాంచి, యాశ్చర్యభరిత హృదయుండై, పుష్ప భద్రానదీ తీరమందుండు స్వాశ్రమంబున

సుఖముగా నుండెను. ఈ ప్రకారముగా పరాపర వస్తుస్వరూపంబును నీకు బోధించితి ననిన, దద్వచనముల నాకర్ణించి, పిప్పలుండు నీకు సర్వోత్కృష్టమయిన మహిమంబును, నాత్మానాత్మ స్వరూప జ్ఞానంబును, గలుగుటకుఁ గారణం బెయ్యది, యని యడిగెను. అపుడు సుకర్ముండు పిప్పలునితో నిట్లనియె.

నేను మాతాపితల పాదప్రక్షాలన సంవాహనాది శుశ్రూషణంబును, స్వయముగా ననవరతముఁ జేయుచుదును. తల్లిదండ్రుల నన్నపానంబులచేతను తాంబూల శయనాచ్ఛాదనాదులచేతను, బరమ భక్తితో సేవించువారు, జ్ఞానవంతులై నిరతిశయంబగు కీర్తినిం బడయగలరు. మాతాపితల పాద ప్రక్షాళనంబు వలనఁ బుత్రులు ప్రతిదినమందును భాగీరథీ స్నాన ఫలము నొందుదురు. జితేంద్రియులును, జితాహారులును, మాతాపితల శుశ్రూషణంబు చేయు వారును, సకల తీర్థ యాత్రా ఫలము నొంది పుత్రమిత్ర కళత్ర పశువిత్తాది సుఖంబుల నొందఁ గలరు.

ఓ భూసురోత్తమా ! మాతాపితల శుశ్రూషణంబు వలనఁ గలిగిన మహిమంబును బద్మసంభవుండైన చెప్పుటకు సమర్థుండు గాడు. తలిదండ్రుల స్నాన జలబిందువులు, పుత్రుండు సేవచేయు సమయంబున నాపుత్రుని మీదఁ బడిన యెడలఁ, బరమపవిత్ర దేహుండై, యాపుత్రుండు ప్రభాస పుష్కర గంగాది తీర్థస్నానఫలము నొందఁగలఁడు. దేహసంరక్షణమం దసమర్థులును, వ్యాధిగ్రస్తులును, క్షుత్పిపాసా పీడితులును, నగు తల్లిదండ్రుల నన్నపానాది సర్వోపచారంబుల చేత భక్తిశ్రద్ధలతో సేవించుఁ బుత్రుండు మహాయోగులకైన

నప్రాప్యంబైన వైష్ణవలోక సుఖము నొందఁగలఁడు. వృద్ధులయిన తల్లిదండ్రులను సేవింపక వారినిఁ బరిత్యజించినఁ బాపాత్ముండైన పుత్రుండు రౌరవ కుంభీపాకాది నరకములఁ బొంది కాక గృధ్రాది యోనులందును, శునక సూకరాది యోనులందును, జనించి యమితి దుఃఖము నొందఁగలఁడు. తల్లిదండ్రులను ముందుగా భుజింపఁ జేయక తాను ముందుగా భుజించిన యెడల, నాపాపచిత్తుండైన పుత్రుం డనేక జన్మములందుఁ గృష్ణసర్పంబై, జనించు. పరుష వచనములచేఁ దల్లిదండ్రులను దిరస్కరించుచు నిందించు పురుషుండు, శార్దూలంబై జనించి, మిక్కిలి దుఃఖవంతుం డగును.

మాతాపితలకు, భక్తిపూర్వకముగా నమస్కరింపని యెడల, నాపాపచిత్తుండగు పుత్రుండు, కుంభీపాక నరకంబునఁ జిరకాలము నివసించు. తలిదండ్రులు గంగాది తీర్థంబులవలె మిక్కిలి పవిత్రులని భావించి లక్ష్మీనారాయణ సములని పూజించు పుత్రుండు, వైకుంఠ లోకము నొందఁగలఁడు. దానంజేసి, ననవరతము వారిని సేవించుటచే నాకు దేవతలందఱు స్వాధీనులయి యుండిరి. వారి సేవామహిమము చేతనే, సర్వజ్ఞుండ నైతిని. తల్లిదండ్రులను బూజింపని వారి యాగదాన హోమ పూజాది సుకృతకర్మంబులును, నధీత వేదశాస్త్రంబులును, నిరర్థకంబులగు చున్నవి. కావున ననవరతము, తల్లిదండ్రులను, బరమభక్తితో నుపాసించు పుత్రుండు, యజ్ఞ దాన హోమాది క్రియాఫలము ననాయాసముగాఁ బొందఁ గలఁడు. ఇట్లు మహాత్ములవలనఁ దెలిసికొని, నేను వారిని సేవించుటచేఁ, దత్ప్రసాదంబు వలన, సకల మహిమం

బులఁ బొందితిని. పూర్వకాలమందుఁ జంద్ర వంశోద్భవుండైన పూరువను రాజేంద్రుండు, పితృ ప్రసాదంబువలన, సకలైహికాముష్మిక సుఖముల నొందెను.

## యయాతి చరిత్ర

పితృ ప్రసాదంబువలనఁ బుత్రునికిఁ గలిగిన ఫలమును విస్తరించి చెప్పుమనిన, పిప్పలునితో సుకర్ముం డిట్లనియె. పూర్వకాలమందు సోమవంశ సముద్భవుండైన నహుషుండను మేదినిపతి, యనేకాశ్వమేధ వాజపేయాది క్రతువులను, భూసురోత్తముల కనేక దానములనుజేసి, ప్రజాపరిపాలన సమగ్రుండును సకల ధర్మజ్ఞుండును, వేదశాస్త్ర కోవిదుండును నగు యయాతి యను పుత్రుని రాజ్యమందు స్థాపించి, తన పుణ్యకర్మ ప్రభావంబుచే నైంద్రలోకంబు నొందెను. అటుపిమ్మట దపస్సత్య సంపన్నుండును, బరంతపుండును నగు, యయాతి మహారాజు, పితృతుల్య పరాక్రముండై సర్వశత్రువులను జయించి, సకలప్రజలను ధర్మముగాఁ బరిపాలించుచు నశ్వమేధ శతంబును, వాజపేయ శతంబును, నాచరించి భూసురోత్తముల కొఱకు, గోభూతిల హిరణ్యాద్యనేక దానంబులం జేసి, యదువు, పూరువు మొదలయిన పుత్రులంబడసి, యశీతి సహస్ర సంవత్సరంబులు రాజసుఖ మనుభవించుచు భూలోకమందు విఖ్యాతుండై యుండె. అట్టియెడ నొకప్పుడు బ్రహ్మమానస పుత్రుండైన నారదుండు, దేవేంద్ర సమీపంబునకుఁ జని యతనిచేఁ బూజితుండై, తన్నియుక్తంబైన సముచితాసన మందుఁ గూర్చుండి, కుశలము నడిగి, యయాతి కృతంబైన శతాశ్వ

మేధ వాజపేయాది క్రతువరంబులను, గో భూ తిల హిరణ్యాది దానంబులను, వాపీ కూప తటాక దేవతాయతనాది సుకృత కర్మంబులను, శ్లాఘించుచు యయాతి మాహాత్మ్యమును దేవేంద్రునితోఁ జెప్పెను.

దేవేంద్రుండు, దద్వృత్తాంతము నాకర్ణించి పూర్వ కాలంబున నహుషుం డైంద్రపదము నధిష్ఠించి, మఱియొక కారణంబుచేఁ దత్పద భ్రష్టుండయ్యె. ఈ యయాతిమహారాజు కూడ, మత్పదంబు నాక్రమింప గలండని తలంచి, యతని ధర్మంబులవలనఁ గడుభీతుండై, పురుహూతుండు మాతలితో నిట్లనియె. ఓ దేవసారథీ! నీవు యయాతి సమీపంబున కరిగి, నీవు చేయుఁ బుణ్యకర్మంబులవలన స్వర్గాది లోకంబులన్నియు నీచే జయింప బడినవి. స్వర్గలోకంబున నివసించి దివ్యభోగ ముల ననుభవింపు మని చెప్పి యీ విమానమం దతనినిఁ గూర్చుండఁ బెట్టి తీసికొని రమ్మని మాతలితోఁ జెప్పెను. ఆ మాతలి విమానాధిష్ఠితుండై యయాతి సమీపంబునకుఁ జను దెంచి, యో రాజన్యచూడామణీ! దేవేంద్రాజ్ఞచే నీ విమా నము నిచటకు నీ కొఱకు దెచ్చితిని, ఈ విమానంబు నధిష్ఠించి మను శిబీక్ష్వాకు సగర పురూరవ యువనాశ్వ కార్తవీర్యార్జు నాది రాజన్య చూడామణులతోఁగూడ, దేవేంద్ర సమీపం బున దివ్యభోగముల ననుభవించుచు సుఖముగా నివసింపు మనిన, యయాతి మాతలితో నిట్లనియె.

ఈలోకమందు పాంచభౌతిక దేహము, సకల సుకృత కర్మములకు ముఖ్య కారణము. ఈశరీరంబుచే సకల సుకృతం బుల నాచరించి, వివిధ భోగంబుల ననుభవించితిని. దానం జేసి

యీదేహమును బరిత్యజింపను. నే నీశరీరముచేతనే దివ్య భోగముల ననుభవించెద ననిన మాతలి యయాతితో నిట్లనియె. ఓరాజేంద్రా! మలమూత్ర క్రిమిజాల సంకులంబును, జరాపీడాన్వితంబును శిథిలావయవోపేతంబును నగు మానవ దేహంబు, దివ్యభోగంబుల కనర్హంబు. కావున దివ్య దేహాన్వితుండవై యింద్రరథంబు నధిష్ఠించి స్వర్గలోకంబున కేతెంచి ననుభవించుచు సుఖముగా నుండుమని చెప్పెను.

ఓ దేవేంద్రసారథీ! జరాదోషంబుచే శరీరావయవంబులు విశీర్ణంబులగు చున్నవి. అవయవ శైథిల్యముచే శరీరము క్రమముగా నశించుచున్నది. ఈశరీర నాశమునకు జరాదోషమే ముఖ్యకారణము. ఈవృత్తాంతమును నేనెఱుంగుదును. అయినను జరాదోషమునకుఁ గారణంబేది. ఆకారణంబును జెప్పుమనిన మాతలి యయాతితో నిట్లనియె.

ఓరాజేంద్రా! పాంచభౌతిక దేహమందలి జఠరానలంబు ప్రాణవాయువుచేఁ బ్రజ్వలితంబై క్షుత్పిపాసలను వృద్ధినొందించి, మధురామ్లాది రసయుక్తంబైన యాహార పదార్థముల పుష్టినిఁ గలుగఁజేయును. దానివలన శుక్లశోణితంబులు, వృద్ధినొంది కామంబును బుట్టించి రతిసుఖమును గలుగఁజేయుచున్నవి. పురుషులు నారీస్తనజఘనాది సౌందర్యమునుస్మరించి, కామాకులిత స్వాంతులై, యనవరతము సురతసుఖము ననుభవించుటచేఁ గ్రమముగాఁ దేజోవిహీనులయి, శరీరబలము క్షీణించి జరాపలిత దేహులయ్యెదరు. అనుదినమందును గామాగ్ని దగ్ధదేహుండైన పురుషుండు తేజోమాంస శోణిత సంక్షయముచే, బలహీనుండై జరాదోషముచేఁ గ్రమముగా

నాశము నొందఁగలఁడు. కాఁబట్టి దారుణంబైన కామజ్వరంబు జరాదోషంబునకుఁ గారణంబు. జితేంద్రియులును, జితప్రాణులును, జితాహారులును, నగు పురుషు లధిక తేజోయుక్తులును, నధిక మహిమాన్వితులును, నధిక బలవంతులును, నగుచు జరాదోషము నొందరు. జరాదోష యుక్తంబైన కాయంబు, పృథివియందు నశించును గావున, స్వర్గారోహణంబున కర్హంబు కాదు. పార్థివంబైన కాయంబు పృథివియందే లయము నొందవలెనని, మాతలి యయాతితోఁ జెప్పి విరమించెను.

## మాతలి యయాతితో దేహోత్పత్తి ప్రకారమును జెప్పుట

ఓ దేవేంద్రసారథీ! పుణ్య పాపకర్మంబువలన భూతలమందు మానవ దేహము పుట్టుచు నశించు చున్నది. మరల దేహ మెట్లు పుట్టుచున్నదో యా దేహోత్పత్తి ప్రకారమును విస్తరించి చెప్పుమనిన మాతలి యయాతితో నిట్లనియె. పంచ మహాభూతంబుల వలన జరాయుజాండజ స్వేదజోద్భిజ్జము లను చతుర్విధ భూతంబులు పుట్టుచున్నవి. కేవల పాపకర్మంబువలన మృగ పక్షి యూక మశక మత్కుణ మక్షికాది శరీరంబులు సంభవించు చున్నవి. మిశ్రకర్మంబు వలన మానవ దేహంబు సంభవించును. పాపకర్మము నాచరించు మానవులు, యమలోకమందు నరక దుఃఖము ననుభవించి, శునక, సూకర, ఖరాశ్వ, మహిష, సింహ, శార్దూలాది యోనులందు జనించెదరు. యాగ దాన హోమాది పుణ్యకర్మముల నాచరించు పురుషులు, స్వర్గలోకంబున కేఁగి పంచీకృత పంచమహాభూత సూక్ష్మభూతాంశ పరిణామంబైన

తేజోమయ దివ్యదేహంబును ధరించి, దివ్యభోగంబుల ననుభవించెదరు.

పుణ్యక్షయమయిన పిమ్మట నేనాచరించిన పుణ్య కర్మల ఫలము ననుభవించితిని. మరల భూతల పతనము సంభవింపఁ గలదని శోకాగ్నిసంతప్తుండనై యింతకంటె నధికపుణ్యము చేయనైతి నని దుఃఖించుటచే నా దివ్యదేహము, లయము నొందును. పిమ్మట నా జీవుండు సూక్ష్మోపాధికుండై చంద్ర మండలమందును, మేఘమండలమందును బ్రవేశించును. తదనంతర మా జీవుండు వర్షధారలతోఁ గూడ, యవవ్రీహి తిల మాషాదులయందు బ్రవేశించి, క్రమ క్రమముగా పురుష గర్భంబునఁ జొచ్చి ఋతుకాల పురుషసంయోగముచేత, స్త్రీ గర్భంబున శుక్లముతోఁ గూడఁ బ్రవేశించును. ఆ శుక్లము శోణిత సంయుక్తంబై బుద్బుద మాంస పిండాది రూపముగాఁ బరిణమించును. అటుపిమ్మట నా జీవుండు కర చరణ కంఠ పృష్ఠాద్యవయవాన్వితుండై నానాయోని సహస్రములం దనేక పర్యాయములు పుట్టుచుఁ గిట్టుచు నానావిధ స్తనములను బానము జేసితిని. పెక్కురు తల్లిదండ్రులను జూచితిని. ఈ మాతృగర్భంబున నివసించి యిపు డగ్నిదగ్ధంబులయిన సూచ్యగ్రములచే దగ్ధుండగు దేహి చందంబున మిక్కిలి దుఃఖము ననుభవించు చుంటిని. నేను జనించిన పిదప శమదమ తపస్సత్య శౌచాది గుణాన్వితుండనై సంతతము ధ్యానపూజావందనాదులచే బరమేశ్వరు నారాధించెద నని తలచు చుండును.

సకల జీవులకు గర్భవాస దుఃఖముకంటే నెక్కుడైన దుఃఖము లేదు. ఈప్రకారము జీవుండు జరాయుపరివేష్టితుండై

క్రిమిజాల తుద్యమాన శరీరుండై, మాతృగర్భంబున నొక దిక్కునసుండక, మలమూత్రములయందుఁ దిరుగుచుఁ, బున ర్గర్భవాసమునకు వెఱచుచు, విలపించుచుండును. పిమ్మటఁ బదియవ మాసంబునఁ బ్రసూతివాయువుచే వేపమాన శరీరుండై యంత్ర ప్రపీడితంబైన యిక్షుదండంబు చందంబున, యోనియంత్ర ప్రపీడితుండగుచు, నతిదుఃఖముచే నిష్క్రమించి, మలమూత్ర రక్త చిత్ర వర్ణుండై, విష్ఠాక్రిమి వగిది భూతల మందుఁ బడి రోదనము సేయుచుండును. అటుఁపిమ్మట వాఁడు శయ్యాతలంబున శయనించి మత్కుణ మశక మక్షికాదులచేఁ గఱవఁబడుచు, నభిమతార్థంబులం జెప్పనేరక దుఃఖంచుచుం డును. పిమ్మట బాల్యావస్థయందు విద్యాభ్యాస క్లేశంబును, యౌవనమందుఁ గామక్రోధాది క్లేశంబును, సహింపఁ జాలక దుఃఖంచుచుండును. దివ్యభోగముల ననుభవించి, స్వర్గలోక చ్యుతులయిన పురుషులు, పరిశుద్ధులును, శ్రీమంతులును, నగు తల్లితండ్రులకుఁ బుత్రులయి జనించి సత్పాత్రదానంబును, మధుర సంభాషణంబును, దేవబ్రాహ్మణార్చనంబును, జేయు చుందురు. దుశ్శీలత్వము, నీచజన సంగము, అతిక్రోధము, వాక్పారుష్యము, నరక లోకాగత పురుష చిహ్నంబులని యెఱుంగవలయు.

ఈజీవుండు వార్ధకావస్థయందుఁ బుత్రమిత్ర కళత్రక్షేత్ర పశువిత్తాది సంసక్త చిత్తుండై, నేను మృతినొందిన పిమ్మట ననాథులయిన నాభార్యాపుత్రాదు లెట్లు జీవించెదరని దుఃఖిం చుచు, వాత పిత్త శ్లేష్మాదులచే నిరుద్ధకంఠుండై, ఘురఘుర ధ్వనిపుట్టి, మృతినొందఁగలఁడు. పుణ్య పురుషుం డయిన

యెడల, స్వర్గలోకము నొంది, దివ్యభోగముల ననుభవించును. పాపాత్ముండైన యెడల యమకింకరుల శూల ముద్గర ముసలం బులచే హతుండై, కొనిపోవు సమయంబున దుఃఖించుచు యమలోకము నొంది రౌరవ మహారౌరవ కుంభీపాకాది నరక ముల ననుభవించి, మృగ పక్షి విడ్వరాహాది యోనులందు జనించును. దేవ తిర్యఙ్మనుష్యాది సకలజీవులు, చక్రనేమి క్రమంబుచే నిత్తెఱంగున, జన్మ మరణ జరారోగాది దుఃఖముల ననుభవించుచుఁ, గామక్రోధ లోభ మోహ మదాన్వితులయి, మరల నధికదుఃఖము ననుభవించు చుందురు. ఇత్తెఱంగునఁ గొంతకాలము గడచిన పిమ్మట నీదుఃఖ నివృత్త్యుపాయం బెయ్యది యని విమర్శించి యీజీవుండు సద్గురూపదేశంబు వలన భగవద్గీతార్థ తత్త్వమును, నుపనిష ద్వాక్యార్థమును దెలిసికొని, పరమాత్మ విజ్ఞానాన్వితుండై పునరావృత్తి రహి తంబైన మోక్ష సామ్రాజ్యంబు నొందఁగలఁడు. ఈ దేహో త్పత్తి ప్రకారము నిట్లు మాతలి యయాతితోఁ జెప్పి విరమించెను.

## మాతలి యయాతితోఁ బాపఫలమును జెప్పుట

ఓ దేవేంద్రసారథీ! నీదర్శనంబు, మాకు సర్వదా సకల శ్రేయస్సాధనంబు. మహాభాగ్యముచే నీతో సంభాషణము సంప్రాప్తంబయ్యె. మర్త్యలోకమందు జనులందఱు ననేక పాపముల నాచరించు చుందురు. ఆ పాపకర్మఫలమును నాకు విస్తరించి బోధింపు మనిన, మాతలి యయాతితో నిట్లనియె.

వేదములను, బ్రాహ్మణుల సదాచారములను, నిందించు వారును, సత్పురుషులను బాధించు వారును, దల్లిదండ్రులను సోదరీజనమును నిందించువారును, నరక దుఃఖముల నొందఁ గలరు. శ్రాద్ధకాలమందు భగినీపుత్రుని జామాతను దౌహిత్రునిఁ బరిత్యజించినయెడల శ్రాద్ధంబు నిరర్థకం బగు. ధనవంతుండైన పురుషుండు దానకాలము సంప్రాప్తంబయినపుడు తన సమీపంబునకుఁ జనుదెంచిన, సమాన విద్వాంసులయిన బ్రాహ్మణులలోఁ, గొందఱ కధికముగా దానముసేసి మఱి కొందఱ కేమియు నీయని యెడల, నా దానము దాతకుఁ బాతకావహంబై నిరర్థకంబగు. సుగుణాన్వితుండును విద్వాంసుండును సదాచార పరుండును సమాశ్రితుండును, నగు విద్వాంసుని ముందుగాఁ బూజించి యనంతర మన్యబ్రాహ్మణులం బూజింప వలయు. యజమానుండు, స్వగృహమున కరుదెంచిన బ్రాహ్మణులలో విద్వాంసులయిన బ్రాహ్మణులను ముందుగా దానముచేఁ బూజింప వలెను. బ్రాహ్మణ క్షత్రియాదులు, నిర్ధనుండైన బ్రాహ్మణుని దానములచే సన్మానింప వలెను.

శ్రాద్ధకర్త ప్రత్యాబ్దిక దినమందుఁ జేయు దానముల వలనఁ బితృదేవతలు, సంతసించి యా శ్రాద్ధకర్తకు, విద్యాధనములనిచ్చి యైహిక సకలభోగములను గలుగఁజేసి, స్వర్గాది లోకసుఖము నిచ్చెదరు. శ్రాద్ధదినమందు వేదవేదాంగ పారంగతుండైన విప్రుని నిమంత్రణము సేయవలెను. ఆదివసమందప్రయత్నముగా సంప్రాప్తించు నతిథులను, భక్తితోఁ బూజింప వలెను. శివకేశవులందును, దత్ప్రతిపాదక పురాణ

ములందును, సుకృత కర్మములందును, విశ్వాసములేని వారు, నరక దుఃఖముల నొందుదురు. గురునిందా గురుతిరస్కారం బులు కూడ నీప్రకారము నరక దుఃఖావహంబు లగుచున్నవి. భార్యా పుత్ర మిత్ర బంధుజన వర్గమును బరాభవించువారును, బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణస్తేయాదుల నాచరించు వారును, బ్రాహ్మణుల కాశాభంగము కలుగఁజేయు వారును, విద్యాభిమానముచే సభాస్థలియందు విద్వాంసులను బరాభ వించు వారును, మిథ్యా గుణములచేఁ దమ్మును శ్లాఘించు కొనువారును, అన్నదానమునకు విఘ్నముఁ గలుగఁజేయు వారును, యమలోకమందు దారుణంబైన బ్రహ్మహత్యాఫల సమాన మహానరక దుఃఖము నొందఁగలరు.

అగ్నిహోత్రాది నిత్యకర్మములం బరిత్యజించు వారును, దల్లిదండ్రులను గురువును సేవింపనివారును, కూట సాక్ష్యము నిచ్చువారును, భగవద్భక్తుల కప్రియం బాచరించు వారును, నపరాధవిహీనంబైన ప్రాణివర్గంబును వధించువారును, గోశాలలను గ్రామంబులను గృహంబులను నగ్నిచే దహించు వారును, గర్పూరాగరు కస్తూరి చందనాది సుగంధ ద్రవ్య ముల నపహరించు వారును, స్వర్ణస్తేయ సమాన పాతకంబు నొందుదురు. వివాహ యోగ్యమైన కన్యకను సదృశమైన వరునకిచ్చి వివాహము చేయనివారును, పుత్ర మిత్రుల కళత్ర ములతోడి పొందును, సవర్ణ స్త్రీగమనంబును జేయువారును, గురుతల్పసమంబైన పాతకమునొందుదురు. జ్యేష్ఠ భ్రాతనువిడిచి వివాహము చేసికొనిన వారును, గోవులను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య స్త్రీ శూద్రులను వధించువారును, భార్యా పుత్రాది

కుటుంబ పరిత్యాగముఁ జేయువారును, నుపయోగ కరంబులయిన దేవాలయ వృక్షములను ఛేదించు వారును, నధర్మము నుపదేశించు వారును, బరస్త్రీ పరధనాసక్తి కలవారును, హింసార్థమయి పశువిక్రయముఁ జేయువారును, భార్యాపుత్రులను వృద్ధులను విడిచి మృష్టాన్నము ననుభవించు వారును, గోహత్యా సమాన పాతకంబు నొందుదురు. రోగ పీడితంబైన గోవును రక్షింపని వారును, గోవులను గఱ్ఱలచేఁ దాడనము చేయువారును, వృషభ వృషణములను మర్దింపఁ జేయువారును మహాపాతక సమానంబైన పాతకము నొందెదరు. తన దేశమందునివసించు ప్రజల పాపంబులను దెలిసికొని పరిపాలించు భూపాలుం డధర్మ భీతుండై యాప్రజల నపరాధాను సారముగా శిక్షింప వలెను. శ్రద్ధాభక్తులుగల సదాచార సంపన్నులయిన పురుషులకుఁ బ్రమాదముచే నధర్మము సంభవించిన యెడల, గురువు శిక్షకుండు. అన్యాయముగా వ్యవహరించు వారలకును, పరస్త్రీ పరధనా ద్యపహారము చేయువారలకును, బరిపాలించు నృపతి శిక్షకుండు. ప్రచ్ఛన్న పాపులకు యమధర్మరాజు శిక్షకుండు. మనో వాక్కాయంబులచే నాచరించు పాతకంబు లధోగతిని గలుగఁజేయు చున్నవి. కావునఁ బాప భీతుండైన పురుషుండు స్వకృత పాపంబునకు యథావిధిగాఁ బ్రాయశ్చిత్తము నాచరింపవలెను. ఇత్తెఱంగున నీకు నధర్మ ఫలంబును జెప్పితిని. ఇటు పిమ్మట ధర్మఫలమును జెప్పుచున్నాను, సావధానుండవై విను మని చెప్పుట కుపక్రమించెను.

## మాతలి యయాతికి సుకృత కర్మఫలంబును బోధించుట

ఓరాజేంద్రా! పాపకర్మంబుల నాచరించినవారు యమ లోకము నొంది నరకదుఃఖముల ననుభవించెదరని చెప్పితిని. సుకృతకర్మంబులు; సర్వప్రాణులకు సుఖకరంబులు. కావున సకల మానవులు తత్కర్మంబుల నాచరింప వలెను. పర్వ కాలము సంప్రాప్తంబయినపుడు ధర్మజ్ఞుండైన మానవుండు యథాశక్తిగా సత్పాత్రమందు దానముల నాచరింపవలెను. ఇతర సాహాయ్యములేని యమలోకమందుఁ దా నాచరించు సుకృతకర్మము, సకల మానవులకు సహాయమై యుండు. ఛత్ర దండోపానహములను వృషభాశ్వ శకటాదులను దాన ముచేయు పురుషులు స్వర్ణమయ దివ్యవిమానము నధిష్ఠించి దివ్య దేహాన్వితులును, దివ్యస్త్రీ కరచారు చామర మరుత్సం వీజ్య మానులును నగుచు దేవలోకము నొంది దివ్యభోగముల ననుభవించెదరు. వస్త్రాలంకార కర్పూరాగరు కస్తూరీ కుంకుమ చందనాదులను, శిబికాది యానంబులను, దానము చేయు వారు, దివ్యవిమానాధిష్ఠితులయి, శీతల వృక్షచ్ఛాయలయం దక్కడక్కడ నివసించి, మృదుమధుర ఫలంబుల ననుభ వించుచు, స్వర్గలోకంబున కేఁగి, చిరకాలము దేవలోక భోగ ముల ననుభవించు చుందురు.

వాపీ కూప తటాక దేవతాయనంబులను, ధర్మశాల లను, యతీశ్వర మఠంబులను, నిర్మించువారును, దేవాగ్ని గురు విప్రులను, మాతాపితలను, నన్నదమ్ములను, నక్కసెల్లెం డ్రను సన్మానించువారును, వారికి వస్త్రాలంకారముల నొసంగు

వారును, ననాధలయిన బీదలను రోగార్తులను రక్షించువారును, వేదశాస్త్రాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణులకు గృహ దానమును గన్యాదానమును జేయువారును, దేవలోకంబున సకల భోగంబుల ననుభవించి కమలాసనాధిష్ఠితంబైన సత్య లోకంబు నొందఁగలరు. సత్పాత్ర దానము ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సాధనంబుగావున ధర్మజ్ఞులయిన పురుషులు నిరంతరము యథాశక్తిగా దానము నాచరింప వలెను.

## శివ కేశ వా రా ధ న మ హి మ ము

ఓరాజన్యచూడామణీ! శివాగమోక్తంబైన శివధర్మంబులను జెప్పెద సావధాన చిత్తుండవై వినుము. సర్వప్రాణి హింసావర్జి తులు, సత్యసంధులును, పాపకర్మ వర్జితులును, జితేంద్రియు లును, శివభక్తులును, నగు ననేక పురుషులు శివధ్యాన పూజా వందనాదులచే శివలోకము నొంది నానావిధ దివ్యభోగము ల ననుభవించిరి. ఇంద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలకు లును, యక్ష కిన్నర గంధర్వాదులును, మాంధాతృ భగీరథ సగర కకుత్థ్సాది మహారాజులును, భక్తిశ్రద్ధలతో శివధ్యాన పూజావందనాదుల నాచరించి యణిమాద్యష్టైశ్వర్యాన్విత లయి, సకల లోకములయందు దివ్య విమానారూఢులయి సంచరించుచు జ్ఞాన విజ్ఞాన సంపన్నులయి పునరావృత్తి రహి తంబయిన మోక్షసామ్రాజ్యము నొందిరి.

శివకేశవాది పూజనంబు బ్రహ్మహత్యా శతంబునైన నశింపఁజేయును. కావున భక్తిశ్రద్ధలతో శివకేశవులను బూజిం

చువారు, శివకేశవ లోకముల నొంది సుఖముగా నివసింతురు. భక్తిశ్రద్ధారహితులయి శివునిఁ బూజించినవారును, బుత్రమిత్ర కళత్రాది సుఖంబుల నొందఁగలరు. సకాములై పార్వతీపరమేశ్వరుల నారాధించువారు, భూలోకంబున బహువిత్తాది సుఖంబుల ననుభవించి స్వర్గలోకంబున దివ్యభోగంబుల ననుభవించి మరల భూలోకంబున శ్రీమంతుల గృహంబున జనించి, సకల భోగాన్వితులయి పూర్వజన్మానుష్ఠిత పరమేశ్వరారాధన సంస్కారంబుచే నీజన్మమందుఁగూడఁ బరమేశ్వరు నారాధించుచు నన్నోదక దానంబులచేతను, గో భూ తిల హిరణ్యాది దానంబులచేతను, బ్రాహ్మణులను బూజించి ఈశ్వరానుగ్రహముచే జ్ఞాన విజ్ఞాన సంపన్నులయి మోక్షము నొందఁగలరు. సకల ప్రాణులకు శరీరంబు ధర్మసాధనంబు గావున నన్నోదక దానంబులచే శరీరమును సంరక్షించువారు ప్రాణదాన ఫలము నొందుదురు. అన్నదాతలకును నుదకదాతలకును సర్వదాన ఫలంబును బరమ పురుషార్థంబును, ననాయాసముగా సిద్ధించు చున్నవి. అన్నోదక దానంబుతో సమంబైన దానంబు మఱియొకటి లేదు. కావున భక్తిశ్రద్ధలతో నన్నోదక దానంబులను, స్వర్ణ రజత వస్త్రాలంకారాది దానంబులను, జేయువారు మణిముక్తాది శోభితంబైన విమానవరము నధిష్ఠించి, దేవలోకంబున సుఖముగా నివసింతురు.

దాన ధర్మవర్జితులయిన పాపచిత్తులు యమలోకము నొంది నరకదుఃఖముల ననుభవించెదరు. శివభక్తులయిన పురుషులు శివపూజా ప్రభావముచే సూర్యసోమాగ్ని సన్నిభంబయిన దివ్యదేహాన్వితులయి శివలోకంబున నివసించెదరు.

ఒకదివసమందు శివునిఁ బూజించినను బాపవిముక్తులయి దేవ లోకము నొందెదరు. ఇత్తెఱంగున మహావిష్ణువును దుర్గాపర దేవతను బూజించువారుగూడ నాయు రారోగ్యైశ్వర్యముల ననుభవించి వైకుంఠ లోకము నొందఁగలరు. నిష్కాములయి యాగదాన హోమాదుల నాచరించువారు, బ్రహ్మలోక మున నివసించెదరు. వాపీ కూప తటాకాదులను నిర్మించు వారును, నిత్యముదానము చేయువారును, దేవేంద్రలోకంబున దివ్యభోగంబుల ననుభవించెదరు.

## పాపకర్మ ఫలమును సంక్షేపముగా జెప్పుట

ఓ రాజేంద్రా! సుకృతకర్మంబుల ఫలమును నీకుఁ జెప్పి తిని. మరలఁ బాపకర్మంబుల ఫలమును సంక్షేపముగాఁ జెప్పు చున్నాను వినుము. ప్రతిదినమందును బరులను బాధించు వారును, బ్రాణులను వధించి పాపకర్మంబుల నాచరించు వారును, బరస్త్రీ పరధనముల నపహరించువారును, భార్యా పుత్రాదులను దల్లిదండ్రులను సంరక్షింపనివారును, కుటుంబ వంతుల గృహంబులను గోశాలలను నగ్నిచే దగ్ధము చేయు వారును, యమభటుల పాశములచే బద్ధులయి, శూల ముద్గ రంబులచే నిహతులగుచు, నగ్నిపాంసు పాషాణ వర్షంబుల వలన బరితపించుచు వృక సింహ శార్దూలాది క్రూరజంతువు లచే భక్షిత దేహులయి, దుఃఖించు చుందురు. అటుపిమ్మట, దండధర గృహద్వార సమీప జాజ్వల్యమాన వైతణీ తరం గిణీ దహన జ్వాలా జాలదందహ్యమాన శరీరులయి, స్వకృ తాఘంబును స్మరించుచు, దుఃఖసాగర నిమగ్నులయి, దండ

థర నియుక్తంబులయిన ఘోర నరకంబుల ననుభవించి, శునక సూకరాది యోనులందు జనించి, జన్మ జరామరణ రోగాది దుఃఖంబుల నొందుచుందురు.

కావున బుద్ధిమంతులయిన పురుషులు సజ్జన సంగంబుచే నీ ధర్మాధర్మములను దెలిసికొని, యతిప్రయత్నముచే సుకృత కర్మముల నాచరింప వలయును. మానవులకు సుకృత కర్మం బను పణ్యంబువలనఁ, గాయంబను నావ కొనఁబడినది. ఈ నావ బద్దలు కాకుండఁగ సంసార సాగరంబును దాఁటుటకు నామానవులు శీఘ్రంబుగఁ బ్రయత్నింప వలెను. రాజేంద్రా! ఇట్లు ధర్మాధర్మ ఫలంబులను నీకుఁ జెప్పితినని, మాతలి విరమించెను.

## కర్మ భేదంబుచే కలుగు ఫలము

అవుడు యయాతి మహారాజు మాతలి వాక్యముల కచ్చెరువొంది కర్మతారతమ్యంబుచే సంభవించు దేవలోక ఫలభేదంబులను జెప్పుమనిన మాతలి యయాతితో నిట్లనియె. భూలోకంబున కూర్ధ్వభాగంబున, నంతరిక్ష లోకంబు గలదు. అందు డాకినీ యాకినీ రాక్షస గణంబులును, యక్ష కిన్నర గంధర్వాప్సరో గణంబులును, వారివారి సుకృత కర్మానుగుణం బైన విమానంబులచే సంచరించు చుందురు. మఱికొందఱు, సూర్యచంద్రాది లోకంబుల నివసించెదరు. ఆయా కాలంబునఁ దత్తల్లోక నివాసులకు స్వకృతకర్మాను గుణంబులైన భోగం బులును, విమానంబులును సంభవింపఁ గలవు. శివకేశవ హిరణ్య గర్భాదులను ధ్యానపూజా వందనాదులచే సేవించు వారు, వారి లోకములందు సుఖముగా నివసించెరు.

శివకేశవాది నామకీర్తన స్మరణంబులు, ప్రసంగాగతంబులయిన సకల పాపంబుల నశింపఁజేయును. శ్రేయస్కాములయిన పురుషులు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులయందు భేద బుద్ధిని, నొక మూర్తియందు ద్వేషంబును, జేయఁగూడదు. సర్వశక్తియుక్తుండును, నద్వితీయుండును నగు పరమాత్మ రజస్సత్వ తమోగుణంబులచే మూర్తిత్రయ రూపమై ప్రకాశించుచుండు. ఈ మూర్తిత్రయంబునకుఁ గొంచెమైన భేదంబులేదు. నీవు శివకేశవులను సమదృష్టితో భజించితివి. కావున నీకు నింద్రాది దేవతలు ప్రసన్నులయిరి. దేవేంద్ర శాసనంబుచే నీసమీపంబునకుఁ జనుదెంచితిని. సుఖకరంబైన యీ పుష్పక విమానంబు నధిష్ఠించి, దాహప్రళయ వర్జితంబైన శివకేశవాది లోకంబులను, దేవేంద్ర లోకంబును బొంది సుఖముగా నుండుమని, మాతలి యయాతితోఁ జెప్పెను. తద్వచనముల నాకర్ణించి యయాతి యత్యాదరముతో మాతలినిఁ బూజించెను.

పాపనాశకంబును, పరమ పవిత్రంబును, నగు నీకథ నెంతసేపు వినిన, నాకు తనివితీరక యాకథాశ్రవణ కుతూహల ముప్పతిల్లుచున్నది. కావున మహాప్రాజ్ఞుండును, నహుషాత్మజుండును నగు యయాతి, మాతలి వచనంబుల నాకర్ణించి, పిదప నేమి సంభాషించెనో చెప్పుమనినఁ, బిప్పలునితో సుకర్ముం డిట్లనియె.

అటుపిమ్మట మాతలితో యయాతి, యిట్లు పలికెను. సకల భోగ సాధనంబైన యీ పాంచభౌతిక దేహంబును, విడిచి, స్వర్గలోకంబున కరుగుటకు నా కిష్టము లేదు. నేనిచటనే నివ

సించి శ్రీకృష్ణానుగ్రహంబుచే దివ్యభోగంబుల ననుభవించెద నని దేవదేవుండైన పురందరునితోఁ జెప్పుము.

కాయంబు జన్మ జరామరణ రోగాది యుక్తమగుటచేత, దుఃఖదాయకంబైనను, శ్రీకృష్ణ నామామృత రసపానంబుచే నా దేహంబును, షోడశ వర్షవయోరూప లావణ్యాన్వితంబును, తేజో బల వీర్య సంయుతంబును, స్వేద దుర్గంధ గ్లాని దోషాది రహితంబును, నగునట్లు చేయఁగలను. సకల మానవులు శ్రీకృష్ణ నామామృత రసాయనమహిమమును దెలిసికొనలేక, మూఢులయి పాపకర్మంబుల నాచరించి యా కర్మంబుబవలన జరావ్యాధి పీడితులయి మరణము నొందుచున్నారు. సత్పాత్రదాన సత్యసంభాషణంబులచేతను, నియమ పూర్వకంబైన శ్రీకృష్ణధ్యాన పూజావందనాదులచేతను, నామ సంకీర్తన స్వధర్మానుష్ఠానంబులచేతను, దపంబు నాచరించుటచేతను, భూలోక నివాసులయిన మానవులందఱు, దివ్యగంధాను లిప్తంబును దివ్యాంబరాభరణా లంకృతంబును నగు దివ్య దేహాన్వితులయి, దేవలోకభోగంబుల ననుభవింపఁగలరు. కావున భక్తార్తి భంజనుండును, భక్తవత్సలుండును, భక్తపరాయణుండును నగు నారాయణుని యనుగ్రహంబుచే నీ శరీరములో నిక్కడనే నివసించి యీ లోకంబును, స్వర్గలోకంబుగావించెదను.

కాఁబట్టి నీవు స్వర్గలోకంబున కేఁగి యీ వృత్తాంతమును బురందరునితోఁ జెప్పుమనిన నపుడు దేవేంద్ర సారథి యయాతి నాశీర్వదించి తదనుజ్ఞను బడసి, స్వర్గంబున కేఁగి యీవృత్తాంతమును దేవేంద్రునితోఁ జెప్పెను. సహస్రాక్షుం

డావృత్తాంతమును విని యితండు మహాబల వీర్య తేజస్సంప
న్నుండును, మహాధీరుండును, గావున నితనిని భూలోకము
నుండి స్వర్గలోకమునకుఁ దీసికొనివచ్చుటకుఁ దగిన యుపాయం
బెయ్యది యని యాలోచించు చుండెను.

## యయాతి రాజ్యపాలనా వైభవము

ఇంద్రసారథి దేవలోకంబున కేఁగినపిదప, నా యయాతి
మహారాజు ప్రజల నెట్లు పరిపాలించెను. ఏ ప్రకారము వేద
విహిత కర్మంబుల నాచరించెను. తద్వృత్తాంతమును జెప్పు
మనిన నా పిప్పలునితో సుకర్ముం డిట్లనియె. తదనంతరం బా
యయాతి మహారాజు దూతలను బిలిచి వారలతో నిట్లనియె.
మీరలందఱును బయలువెడలి సకలగ్రామములందును, బుర
ములందును, దేశములందును, సంచరించుచు, సకలజనులకు
నాయాజ్ఞచే వేదవిహిత జ్యోతిష్టోమాది సకల నిత్యనైమిత్తిక
కర్మముల నాచరింపవలెనని శాసింపుఁడు. శ్రీకృష్ణుండు
భక్తార్తి భంజనుండును భక్తజన పరాయణుండును గావున,
నతనిని ధ్యాన పూజావందన కీర్తనాదులచే సేవింప వలెనని
బోధింపుఁడు. ఇట్లుచేయక రాజశాసన పరాఙ్ముఖులయినవారు,
రాజకృతంబైన దండనంబు నొందఁగలరని, రాజదండనంబును
గూడ దెలియఁజేయుఁడని యానతిచ్చెను.

అనంతర మా రాజభటులు, సకల దేశంబులందును,
గ్రామ నగరంబులందును, బరిభ్రమించుచు "ఓజనులారా!
మీరలందఱు రాజశాసనముచే వేదవిహిత నిత్యనైమిత్తిక
కర్మముల నాచరింపవలెను. శ్రీమహావిష్ణు ధ్యానపూజా వం

దన కీర్తనాదులం జేయవలెను. అటుపిమ్మట వివిధ భోగముల ననుభవించి ముక్తిం బడయగలరు. ఈప్రకారము సకలజనులు యథావిధిగా నాచరింపవలెను. అట్లు జేయనివారు రాజకృత దండంబు నొందఁగలరు. ఇయ్యది రాజాజ్ఞ" యని సకలజను లకు నుపదేశించిరి.

అపుడు భూతలమందుండు సకలదేశ జనులు దూతల వలన రాజశాసితంబైన పుణ్యాశరోప్మదేశంబును విని యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధి రూపాష్టాంగ యోగయుక్తులయి, జ్యోతిష్టోమాది యాగ దాన హోమంబుల నాచరించుచుఁ జతుర్వర్గ ఫలప్రదుండైన యజ్ఞేశ్వరు ననవరతము నారాధించు చుండిరి. సూర్యసంచా రముచే సూర్యప్రకాశ మున్నంతవఱకు భూమండలమందుండు సకల మానవులు పరమభక్తితో నెల్లపుడు విష్ణుధ్యాన పూజా వందన కీర్తనంబుల నాచరించుచుఁ, బరమ భాగవతోత్తము లయి యుండిరి. అట్టియెడ సకలజనులు శ్రీకృష్ణానుగ్రహంబుచే జరామరణ వర్జితులును, ధనధాన్య సంపన్నులును, బుత్రపౌత్రా న్వితులును, నై ప్రతిగృహద్వారమందుండు కల్పవృక్ష కామ ధేను చింతామణులచే సంప్రాప్తంబైన దివ్యభోగంబుల ననుభ వించు చుండిరి.

స్త్రీలందరు విష్ణుధ్యాన పరాయణులయి తాలలయా న్వితంబులయిన సుస్వరంబులచే విష్ణుగీతంబులం బాడుచుండిరి. సకల పురగ్రామ గృహంబులును, బవిత్రంబులయిన దేవా లయాది స్థానంబులును, నుపవనోద్యాన వనంబులును, శంఖ చక్ర గదాపద్మాంకితంబులయి, యుచ్ఛ్రితధ్వజపతాకాదులచేఁ

ప్రకాశించుచుండెను. అపుడు భూలోక విభవంబు, స్వర్గలోక విభవంబు నతిక్రమించి యుండుటం జేసి యాస్వర్గలోక విభవంబును బరిహసించుచునట్లు కనంబడుచుండెను. కాఁబట్టి భూలోకమందలి సకలజనులు, స్వర్గవైకుంఠలోక సుఖము ననుభవించుచుండిరి.

సకలజనులు, తులసీవనములను బెంచి తులసీదళంబుల చేతను, బిల్వపత్రంబులచేతను, చామంతికా వకుళ చంపకమల్లికాదులచేతను బూజించుచు యజ్ఞేశాచ్యుత గోవింద వాసుదేవ జగన్మయ కృష్ణవిష్ణో హృషీకేశ మాధవానంత కేశవ నిను శరణంబు నొందితిమి. నీవుశరణాగత రక్షకుండవు. గావున మమ్ము రక్షింపుమని యెల్లపుడు ప్రార్థించుచు శ్రీకృష్ణ మంత్రంబును, వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రంబును, జపించుచుండెడివారు శయనాసన గమనములయందును, స్నాన భోజనాది సమయములంపును. విశ్వమంతయు విష్ణుస్వరూప మని భావించుచు, స్త్రీ బాల వృద్ధులందరు, కమలనయన, వాసుదేవ, విష్ణో, ధరణిధర, అచ్యుత, శంఖచక్రపాణె, శరణం భవ, మాం పాహి, యని తన్మయులయి, శ్రీకృష్ణుని సతతము నమస్కరించుచుండెడివారు.

నహుష పుత్రుండైన, యయాతి భూపాలుని ప్రభావంబుచే మహీమండలంబు వైకుంఠ లోకసమంబై దివారాత్రంబులందు హరినామ కీర్తనంబుచేఁ దేజరిల్లు చున్నది. ఎక్కడఁ జూచిన, దేవాలయాగ్ర భాగంబులందును, దదితరంబులయిన మఱికొన్ని హరిమందిరములందును, ప్రభాతకాల భాసమాన భాస్కరబింబ సన్నిభంబులయిన సుదర్శన చక్రంబులు ప్రకా

శించు చుండెడివి. యయాతి పాలించుకాలమందు, సకల విప్రో త్తములు వేదశాస్త్ర కోవిదులును, జ్ఞాన విజ్ఞాన సంపన్నులును, నాధివ్యాధి జరామరణ వర్జితులును, నానావిధ దివ్య భోగాన్వితులును, బుత్ర పౌత్ర సహితులును, బరోపకార రతులును, దాన ధర్మపరులును, రాజోపదేశముచే విష్ణుభక్తులును, నగుచు నెల్లపుడు విష్ణుధ్యాన పరాయణులై యుండిరి. అపుడు యయాతిమహారాజు భక్తిశ్రద్ధలతో సుకృత కర్మముల నాచరించుచు విష్ణుధ్యాన పరాయణుండగుటచే పంచవింశతి వత్సర వయోరూప లావణ్యాన్వితుండై శ్రీకృష్ణానుగ్రహంబుచే నతి దృఢంబును, మిక్కిలి మనోహరంబును నగు శరీరసహితుండై సుఖముగా నుండెను. అతనివలెనే ప్రజలుకూడ, పంచవింశత్యబ్ద పరిమిత వయోరూప లావణ్యాన్వితులును, గామక్రోధ వర్జితులును, జరారోగ వర్జితులును, వటదూర్వాంకురంబుల పగిది ప్రవృద్ధ వంశాన్వితులును, నగుచు మరణ దుఃఖవర్జితులయి, సుఖముగా నుండిరి. మరణశోక వర్జితంబును, స్వర్గ వైకుంఠ భువనతుల్యంబును నగు భూలోకంబు నవలోకించి యమభటులు, విష్ణుదూతలచేఁ బరాహతులయి యమసమీపంబున కేఁగి, యమునితో నిట్లు విన్నవించిరి.

నహుషాత్మజుని శాసన పూర్వకంబైన వైష్ణవధర్మోపదేశంబుచే మహీలోకంబున సకలమానవులు, విష్ణుభక్తులును విష్ణుధ్యాన పరాయణులును జరామరణ శోక వర్జితులును నగుచు, మధుసూదనానుగ్రహంబుచే సుఖముగా నుండిరి. మేము మహీలోకంబున విష్ణుదూత సంతాడితులమయి నీ సమీపంబున కేతెంచితి మనినఁ దద్వచనంబుల నాకర్ణించి

శమనుం డొకక్షణకాలము మిక్కిలి విస్మయావిష్ట చిత్తుండై యాలోచించెను.

## యయాతి దేవేంద్ర కృతంబైన కపటంబుచే ధర్మ విముఖుం డగుట

అపుడు యమధర్మరాజు, స్వభట సహితుండై స్వర్గ లోకంబున కేగి బృందారక బృంద పరివేష్టితుండైన దేవేంద్రునిఁ జూచి యతనిచేఁ బూజితుండై తన్నియుక్తంబైన సముచితాసనంబునఁ గూరుచుండి, భవదాగమన కారణం బెయ్యది యనిన దేవేంద్రునితో శమనుం డిట్లనియె. నహుషాత్మజుం డనవరత విష్ణుధ్యాన పరాయణుండై సకలజనులకు వైష్ణవధర్మంబుల నుపదేశించి, మహీతలంబును దేవలోక తుల్యంబుగాఁ జేసెను. తదుపదేశంబుచే వారలందఱు విష్ణుధ్యాన పూజా వందనాదుల నాచరించుచు, శ్రీకృష్ణానుగ్రహంబుచే జరామరణ రోగవర్జితులయి, దివ్యభోగంబుల ననుభవించుచు సుఖముగా నుండిరి. సకల మానవులు పాపరహితులయి, మరణవిహీను లగుటంజేసి, నేను నిర్వ్యాపారుండ నైతి ననిన, దేవేంద్రుండు శమనునితో నిట్లనియెను.

స్వర్గమునకుఁ దీసికొని రావలెనని యింతకుముందు మాతలిని బంపితిని. మహీతలంబును స్వర్గసమంబుగాఁజేసి యిక్కడనే స్వర్లోక భోగముల ననుభవించెదను. నీవు వచ్చిన రీతిగా దేవేంద్ర పాలికిఁ బొమ్మని చెప్పెను. పిమ్మట రాజ కృతంబైన విష్ణుధర్మోపదేశంబుచేత, సకల జనులు విష్ణుధ్యాన పరాయణులయి తత్ప్రసాదంబువలన దివ్యభోగంబుల ననుభ

వించుచు సుఖముగా నుండిరి. మాతలివలన నీవృత్తాంతమును విని భీతుండ నైతినని, నామాటను విని శమనుండు పురందరునితో నిట్లనియె. ఏయుపాయంబుచేతనైన నిచటకు నా భూపతినిఁ దీసికొని వచ్చుటకుఁ బ్రయత్నింప వలెనని చెప్పి, శమనుండు సపరివారుండై సంయమనీ పురంబున కరిగెను. పిమ్మట సహస్రాక్షుండు కొంతఁదడ వాలోచించి, రతీమన్మథులను బిలిచి మీరిరువురు, మాధవ మలయానిల గంధర్వాప్సరోగణంబులతోఁగూడ, భూలోకంబున కేగి నహుషాత్మజుని సులలిత లాస్యహాస్య గీతంబులచే మోహిత చిత్తునింజేసి, యిచ్చోటునకుఁ దీసికొని వచ్చుటకు నధిక ప్రయత్నముఁ జేయవలెనని చెప్పెను. ఆమాటలను విని రతీమన్మథు లిరువురు, పరివార సహితంబుగా మహీతలంబున కరుదెంచి, మాయచే విప్రవేష ధరులయి, నహుషాత్మజు నవలోకించి, యాశీర్వదించి యతిరమ్యంబగు నృత్తగీత వాద్యంబులచే నాటకాభినయ ప్రదర్శనముఁ జేసెదమని యయాతితోఁ జెప్పిరి.

తదనంతరం బాభూకాంతుని యాజ్ఞవడసి, మన్మథుండును, సూత్రధారుండును, మాధవుండు పార్శ్వవర్తియు, రతీదేవి నటీవేషధారిణి యగుచు, వామనచరిత్రంబును నాటకంబుగాఁ బ్రదర్శించి వీరందఱు సులలిత నృత్తగీత వాద్యంబులచే నా భూపతిని నానందింపఁ జేసిరి. అతఁ డపుడు మోహావేశము నొంది యప్సరోగణ కృతంబైన చేష్టలచేఁ గామాకులిత స్వాంతుండయ్యెను.

## యయాతి మృగయాకుతూహలంబుచే మహారణ్యంబుల కేగుట

అటుపిమ్మట యయాతిమహారాజు విషయపరాజితుండయి వికలేంద్రియుండయ్యె. అపుడు మదనుండు యయాతిని మోహావిష్ట చిత్తునిం జేసితిని కావున దేవేంద్ర శాసనం బనుష్ఠితం బయ్యె. ధర్మాత్ముండై జితేంద్రియుండైన భూపతి యజితేంద్రియుండై ధర్మవిముఖుం డయ్యెనని, సంతసించెను. అట్టియెడ నొకప్పుడా భూకాంతుండు మలమూత్రములను విసర్జించి, పాదప్రక్షాళనంబు సేయక, సింహాసనాధిష్ఠితుం డయ్యె. ఆ సమయమును దెలిసికొని జరాదోషము శరీరమందుఁ బ్రవేశించెను. పిమ్మట నొకప్పుడు యయాతి ధనుర్బాణ ధరుండును రథారూఢుండును నగుచు మృగయాకుతూహలాన్వితుండై మహారణ్యంబుల కేగు సమయంబున, సువర్ణమయ దేహాన్వితంబును, నింద్ర నీలమణిమయ నయనాన్వితంబును, రత్నశృంగ సహితంబును, రౌప్యఖుర శోభితంబును నగు, హరిణంబు నవలోకించి, తదాకృష్టుండయి వకుళాశోక పూగ పున్నాగ ఖర్జూర నారికేళాది పుష్ప ఫలద్రుమ షండమండితంబైన మహారణ్యంబునం జొచ్చి, కమల కల్హార నీలేందీవరాది శోభితంబైన యొక సరస్సు నవలోకించి తత్సౌందర్యంబున కచ్చెరువొంది, మార్గశ్రమచే పిపాసాన్వితుండై డస్సి తనివితీర తదీయ జలంబులం గ్రోలి సరస్తీరంబున నొక శీతల వృక్షచ్ఛాయ నాశ్రయించి, విశ్రమించెను.

అపుడా హరిణం బంతర్హితంబయ్యె. అటుపిమ్మట నా రాజేంద్రుండు తత్సరోవర మధ్యభాగమందలి యొక భవనంబున, నతిమనోహర వయోరూప లావణ్యాన్వితసఖీజన పరివృతయుఁ, బీనోన్నత బిల్వఫల తుల్య పయోధరాన్వితయుఁ, బక్వ బింబాధరయు, సర్వాలంకార శోభితయు, నిరుపమ వయోరూప లావణ్యాన్వితయు, మందస్మిత ముఖారవిందయు, వీణాగానాన్వితయు నగు నొక కాంతామణిం గాంచి, యాగాన ధ్వనిని విని కుసుమ శరసాయక విద్ధుండై తత్సంగమాలింగన సుఖాభిలాషచేఁ దత్సమీపంబునకుఁ జని నీ నామధేయంబె య్యది నీ వెవరి కూఁతురవని యడిగెను. అపుడామాటను విని విశాలయను చెలికత్తె యయాతితో నిట్లనియె.

తొల్లి మన్మథుం డీశ్వర ఫాలనేత్రాగ్నిచే దగ్ధుండై యనంగుండయ్యె. అపుడు ప్రియవిరహ దుఃఖముచే నిచట రతీదేవి చిరకాలము నివసించి రోదనము చేయుచు నీశ్వరుని బ్రార్థించెను. కొంతకాలమునకు రతీదేవికిఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుండై మన్మథుని మరల జీవింపఁజేసి యామెకుఁ బ్రియవిరహ దుఃఖమును శమింపఁజేసెను. ప్రియ సమాగమ సమయంబున రతీదేవికి నధికానందంబుచే నానందాశ్రువులు బయలువెడలి పద్మాకర మధ్యమందలి పద్మమధ్యంబునఁ బడినవి. ఆ పద్మమధ్యభాగము నుండి యశ్రు బిందుమతి యను పేరుకల రతీపుత్రిక జనించినది. ఈకోమలాంగి రతీమన్మథులకు నతిప్రేమాస్పదంబైనది. కావున వారిచే సంరక్షింపబడుచు నిచట వీణాగానము చేయుచున్నది. నేను వరుణదేవుని కుమార్తెను. విశాలయను పేరుకల దానను. ఈ యువతీమణి యందలి ప్రేమాతిశయంబుచే

నే నెల్లపు డిచట నివసించి యుంటిని. ఈచిన్నదాని కొక నియమము కలదు. దానిం జెప్పెద వినుము.

సకల వేదశాస్త్ర కోవిదుండును, దేవబ్రాహ్మణ పూజకుండును, జ్ఞానైశ్వర్య బలతేజో వీర్యశక్తి సంపన్నుండును, పరిపూర్ణ యౌవన రూపలావణ్యాన్వితుండును, ప్రజ్ఞావంతుండును, జ్యోతిష్టోమాది యాగదాన శీలుండును, నారాయణ పరాయణుండును, పురందర సముండును నగు ప్రాణనాథు నపేక్షించు చున్నదనిన, విమ్మట యయాతి మహారాజు యీ నారీమణిని జూచినది మొదలు నయినప్రీతి, చిత్తాసంగ, సంకల్పంబులను నిద్రాచ్ఛేద, శరీర కార్శ్య విషయ భోగేచ్ఛానివృత్తులను త్రపానాశోన్మాద మూర్ఛావస్థలను బొందుచుం గామాకులిత స్వాంతుండ నైతిని, కావున తత్సంగమాలింగన సుఖాభిలాషచే గాంధర్వ విధ్యుక్తమైన పరిణయంబునకుం బ్రయత్నించు చున్నాననిన నామాటలను విని యాసఖురాలు యయాతితో నిట్లనియె, ఓరాజేంద్రా! నీవు మహావిష్ణు సముండవనియు ధర్మాంత్ముండవనియు నే నెఱుంగుదును. ఒక జరాదోష విహీనుండ వైనయెడల, నీవు సర్వగుణంబుల చేతను, మా చెలికత్తెకు, నభిమతుండవు ఇపుడు జరాదోష సహితుండవు గావున, నిన్నును భర్తనుగాఁ జేకొనుటకు మా చెలియ యంగీకరింపదు. దానవ గురుండగు శుక్రుండు, నీకు జరావినిమయ వరంబు నొసంగెను. కావున, నీపుత్రులలో నొకరియం దీజరాదోషంబు నుంచి, వాని తారుణ్యమును గైకొనిన, మాచెలికత్తె నిన్ను భర్తనుగా గ్రహింప గలదని చెప్పెను. అపుడు రాజన్యుండు తద్వచనముల నాకర్ణించి,

యీప్రకారము చేసెదనని చెప్పి, స్వగృహంబునకుఁ జనుదెంచి పుత్రుల నందఱను బిలిచి, వారందఱు వినుచుండగా, నీవృత్తాంతమును దుర్వసుండను బుత్రునితోఁ జెప్పెను.

## యయాతి తనపుత్రుండైన పూరువుని తారుణ్యంబును గైకొనుట

అటుపిమ్మట తుర్వసుండను పుత్రుం డీవృత్తాంతమును విని శమ దమ తపస్సత్య శౌచాది గుణాన్వితులును, ధర్మాత్ములును, నగు మీ కీజరాదోష మెట్లు సంభవించె ననినఁ, బుత్రునితో యయాతి యిట్లనియె. కొందఱు నర్తకులును, నప్సరస్స్త్రీలును, నతి మనోహర నృత్తగీతంబులచే నామనంబు నాకర్షించి, దుర్విషయాసక్తునిం జేసి కామాకులిత స్వాంతుని గావించిరి. కామాగ్ని సంతాపముచే జరాయుక్తుండ నైతిని. తదనంతరంబున నొకప్పుడు మృగయాసక్తుండనై యొక మహారణ్య మధ్యంబున కేగి నిరుపమాన వయోరూప లావణ్యాన్వితయైన యొక కాంతామణి నవలోకించి, యగ్నిచే సంతప్తంబైన జలంబువగిది, కామాగ్నిచే సంతప్త స్వాంతుండనై, తత్సంగమాలింగన సుఖము నభిలషించి గాంధర్వ విధిచేఁ బరిణయంబునకుఁ బ్రయత్నించితిని. అపు డా కాంతామణికి సఖియైన విశాల యను వరుణ పుత్రిక, నీవు సకలగుణాన్వితుండవైనను మా చెలియ, యొక జరాదోషంబుచే నిన్నును భర్తనుగాఁ జేకొనదు. కాఁబట్టి భార్గవుండైన శుక్రుని వరంబుచే నీకు జరాదోష వినిమయంబున కవకాశము కలదు. కావున నీ పుత్రులలో నొకరికి, జరాదోషంబు నిచ్చి, వాని తారుణ్యం

బును జేకొనిన, నిన్నును భర్తనుగా గ్రహింపఁగలదని నాతోఁ జెప్పెను. అందువలన నాజరాదోషంబును గ్రహించి నీతారుణ్యంబును నాకొసంగు మనిన తుర్వసుండు యయాతితో నిట్లనియె.

సకల పురుషార్థ సాధనంబైన యీ శరీరము జననీ జనకులవలనఁ బుట్టినది. వారి యాజ్ఞను శిరమున వహించి పుత్రునకు తదభీష్టం బవశ్య కర్తవ్యంబైనను, వార్ధకమందు శీతవాతాది బాధలను, క్షుత్పిపాసాది దుఃఖంబులను, సహించుటకు సమర్థుండను గాను. కావున జరాదోషమును నేను గ్రహింపజాలననిన, తద్వచనము నాకర్ణించి యయాతి క్రోధారుణ లోచనుండై గోమాంస భక్షకుండును, మహాపాపాత్ముండును, బ్రాహ్మణ హింసకుండును, సగోత్ర నారీవివాహితుండును నగు మ్లేచ్ఛుండవై క్రూరుండవయ్యెదవు. నీ వంశ సంభవులందఱు తురుష్కులవుదు రని శపించి, పిమ్మట యదువను పుత్రుని బిలిచి నీ తారుణ్యంబును నా కొసంగి నా జరాదోషంబును నీవు గ్రహింపు మనిన, నా మాటను విని యదువు, యీ జరాదోషమును వహించుటకు నేను సమర్థుండను గాను నన్నును గరుణతో రక్షింపు మని వేడెను. నా యాజ్ఞ నతిక్రమించితివి. కావున రాజ్యాధికార విహీనుండవు కమ్మని, యయాతి నతనిని శపించెను.

అపుడు యదు వా శాపంబును దెలిసికొని కృతాంజలిపుటుండై నేనపరాధ విహీనుండను నన్ను శపించుట యుచితంబు గాదు. నీవు శరణాగత వత్సలుండవు. సకల ధర్మజ్ఞుండవు. నన్నును గరుణతోఁ బ్రోవు మనిన దద్వచనంబుల నాక

ర్ణించి యయాతి కరుణార్ద్ర హృదయుండై, నీవు నా శాపం బుచే రాజ్యాధికార విహీనుండ వైనను, జగన్నాథుండైన శ్రీనాథుండు నీవంశంబునం బుట్టుటచే, నీయన్వయంబు పరమ పావనంబై ముల్లోకములందును, బ్రసిద్ధిం జెందఁగలదని వరంబు నొసంగి, పూరువను పుత్రునిం బిలిచి, నా జరాదోషంబును నీవు గ్రహించి నీతారుణ్యంబును నాకొసంగుము. పితృవాక్య పరిపాలనచే నిహతకంటకంబైన రాజ్యలాభంబు నొంది యిహ పర సుఖంబుల ననుభవింప గలవనిన, పూరువను పుత్రుండా వచనములను విని, బద్ధాంజలి పుటుండై, భవదాజ్ఞాను సార ముగా భవదభిమతంబును జేసెద ననిచెప్పి, పితృభక్తి యుక్తుం డయి జరాదోషంబును దాను గ్రహించి, తనతారుణ్యంబును తండ్రికి సమర్పించెను. అంతట నతండు, సంతుష్టాంతరంగుండై విశాల సమీపంబునకేగి నేనిపుడు తారుణ్యంబుఁ గైకొని వచ్చితిని. నీచెలికత్తెను నాకు గాంధర్వవిధిం బరిణయంబు సేయింపుము.నీసఖురాలు ముల్లోకములందును,నితరదుష్ప్రాపం బయిన వస్తువులలో నెద్దాని గోరినను, దానిం దెచ్చి యిచ్చె దను చెప్పినపనులను ముఖ్యముగాఁ జేసెదననినఁ దద్వచనం బుల నాకర్ణించి, విశాల యను నంగనామణి యయాతితో నిట్లనియె.

## యయాతి యశ్రుబిందుమతిని గాంధర్వ విధిం బరిణయంబై సుఖంబులం బడయుట

ఓ రాజేంద్రా ! నీవు దుష్టంబైన జరాదోషంబును బరి త్యజించినను నీకు శర్మిష్ఠా దేవయానలను భార్యలిద్దఱుఁ

గలరు. సపత్నీ దుఃఖంబు, దుస్సహంబు గావున, సర్పవేష్టితంబైన చందన వృక్షంబు చందంబున, సకల గుణాలంకృతుండవైనను, శర్మిష్ఠా దేవయానా సహితుండవై యుండుటవలన, నిన్నును భర్తనుగాఁ జేకొనుటకు మాసఖయైన యశ్రుబిందుమతి యంగీకరింప దనిన, నపు డా మాటలను విని యయాతి తత్పార్శ్వవర్తినియైన యశ్రుబిందుమతితో నిట్లు పలికెను.

శర్మిష్ఠా దేవయానల వలన నాకుఁ గొంచెమయిన ప్రయోజనంబు లేదు. వారిరువురు పుత్రవంతులు, గావునఁ బుత్రసంరక్షితులయి సుఖముగా నుండగలరు. ముల్లోకంబులందును నీ వెద్దానినిఁ గోరిన దానిని నీకుఁ దెచ్చి యిచ్చెదను. సకల వసుంధరామండలంబును, నారాజ్యంబును, సకల కోశాగారంబులును, నా దేహంబును, నీ యధీనము చేసెదను. గాంధర్వ విధిచేఁ బరిణయం బయ్యెదవేని, నాతోఁగూడి సకల భోగంబుల ననుభవింప గలవని యా కాంతా హస్తమందుఁ దన హస్తమునుంచి శపథము చేసెను. ఆమాటల కచ్చెరువొంది యశ్రుబిందుమతి యియ్యకొనెను. అపుడు యయాతి యమందానంద సందోహాన్వితుండై గాంధర్వవిధిం బరిణయంబై కామకన్యకయగు నశ్రుబిందుమతితోఁ గూడ సముద్రతీరమందును, పర్వతాగ్ర భాగములందును, నదీతీరంబులందును, నానావిధ శృంగార చేష్టలచే రతికేళి సుఖము ననుభవించుచుండెను.

ఓ భూసురోత్తమా ! పురందర ప్రేరితుండైన మన్మథునిచేఁ గల్పితంబులైన మహామాయలచే మోహిత చిత్తుండై రాత్రిం దివంబులందుఁ గామకన్యా వశంగతుండై గడచిన

కాలంబు నించుకంతైన నెఱుంగక, ననేక సంవత్సరంబులు రతి క్రీడా సుఖము ననుభవించు చుండెను. అట్టియెడ నా కామ కన్యక, తనకు వశంగతుండైన భూకాంతు నవలోకించి నాతోఁ గూడఁ గ్రతువరంబైన నశ్వమేధము నాచరింపు మనిన, నందుల కతం డంగీకరించి పూరువును బిలిచి యీ భార్యతోఁగూడ నశ్వమేధంబు నాచరించెదను. ఋత్విగ్గణంబులను సంభారంబులను, బ్రయత్నించి సంపాదింపు మనిన నతండు వినయావన మిత కంధరుండై వారిగుపురకు నమస్కరించి మీ యాజ్ఞను శిరంబున వహించి, యట్లు చేసెదనని చెప్పి, ఋత్విగ్గణంబులను బిలిపించి, యాగోపకరణంబులయిన ద్రవ్యంబులను సంపాదించి, భూపాలకుల నందఱను బిలిపించి, కప్పంబిచ్చుటకును పారితోషికంబుల నిచ్చుటకును నియోగించి, యీ వృత్తాంతమును దండ్రితో విన్నవించెను. అపుడు యయాతి సంతుష్టాంతరంగుండై యశ్రుబిందుమతితోఁగూడ నశ్వమేధ యాగంబున దీక్షితుండై విప్రోత్తముల కనేక దానంబుల నొసంగి, యింద్రాది దేవతలకు హవిర్భాగంబుల నిచ్చి, యజ్ఞపురుషు నారాధించి మహాసంతోషముతో నవబృథ స్నాతుండై, బ్రాహ్మణుల తోడను, బంధువులతోడను, రాజన్యులతోడను బయలు వెడలి స్వగృహమందుఁ బ్రవేశించి సుఖముగా నుండెను.

అపుడు బ్రాహ్మణాశీర్వచనంబులును, మంగళవాద్యంబులును, జయజయ ధ్వనులును, ముల్లోకములందును నిండెను. అపుడు యయాతి యోకాంతామణీ! యథావిధిగా నశ్వమేధ యాగంబు నాచరించి యజ్ఞపురుషు నారాధించితిని. నీ యభీష్టంబుఁ దీర్చితిని. మఱియొక యభీష్ట కార్యమునుగూడఁ జెప్పి

తివేని జేసెదను. ఇతరుల కసాధ్యంబైనను నాకు సాధ్యంబైన కార్యమును జెప్పుము. ఆకార్యమును ముఖ్యముగాఁ జేసెద ననిన, నత్తఱి యాకామకన్యక బ్రహ్మ విష్ణు శివలోకంబులను నింద్రలోకంబును నాకు జూపింపు మనిన, నా మాటను విని యయాతి కామకన్యకతో నిట్లనియె. ఓ కాంతామణీ! నీవు స్త్రీస్వభావమువలన నవివేకముచే నిట్లు చెప్పుచున్నావు. ఈ మానవ శరీరంబుతో స్వర్గాది లోకంబుల నొందుటకు నెవరి కిని శక్యంబుగాదు. కావున నాకియ్యది యసాధ్యంబు. దీర్ఘ కాలము తపం బాచరించి, యాగదాన హోమాదులచే నింద్రాదుల నారాధించు మహాత్ములు, దివ్యదేహాన్వితులయి స్వర్గాది లోకములం బడయఁ గలరు. నీవట్లు ప్రార్థించుట యనర్థంబని బోధించిన, విని యాకామకన్యక తత్కాలమం దూరకుండెను.

ఓ భూసురోత్తమా! యయాతి కామకన్యకంగూడి నానావిధ భోగంబుల ననుభవించు సమయంబున శర్మిష్ఠా దేవయాన లెత్తెఱంగున, సంచరించిరి. వారి వృత్తాంతమును జెప్పుమనిన, సుకర్ముండు పిప్పలునితో నిట్లనియెను.

అటుపిమ్మట శర్మిష్ఠా దేవయాన లిరువురు యత్రుబిం దుమతీ వయోరూప లావణ్యంబులను, నామె చేయు దాన ధర్మాదులను, నధిక్షేపించుచు, మిక్కిలి స్పర్థాన్వితులయి యుండిరి. ఈవృత్తాంతమును గామకన్యక, దెలిసికొని, భర్తతోఁ జెప్పెను. అవుడతండు క్రోధారుణ లోచనుండై యదువును బిలిచి మీతల్లుల నిరువురను శిక్షించి హితవాక్యములను బోధింపు మనిన, నతం డట్లు శాసించి శ్రుతి స్మృతి విహిత

ధర్మంబులను, పతివ్రతా ధర్మంబులను, బోధించి వారిరువుర స్పర్థను శమింపఁ జేసెను. అటుపిమ్మట యయాతి మహారాజు సుకృతకర్మంబుల నాచరించుచు విష్ణుధ్యాన పరాయణుండై యాకాంతామణింగూడ దివ్యభోగంబుల ననుభవించుచుఁ చిర కాలము రాజ్యమును బాలించెను. అపుడు సకల జనులు, జరామృత్యువర్జితులును, శమ దమ తపస్సత్యశౌచాన్వితులును; విష్ణుధ్యాన పూజా వందనాది పరాయణులును, నగుచు మిక్కిలి సుఖవంతులయి యుండిరి.

యయాతి తన తప్పును తెలిసికొని చింతిల్లుట.

అటుపిమ్మట దేవేంద్రుండు యయాతిచేయు యాగ దాన హోమాదులను, నతని పరాక్రమంబును, జూచి భీతుండై మేనకను బిలిచి నీవు భూలోకంబునకేగి కామకన్యకం జూచి, నీ కౌశలముచే నహుషాత్మజు నిచటకుఁ దీసికొనివచ్చుటకుఁ, దగిన ప్రయత్నముచేసి తీసికొని రమ్మని యాకామకన్యకతోఁ జెప్పుమనిన, మేనక తద్వచనము నాకర్ణించి వల్లెయని భూలోకంబునకుఁ జనుదెంచి, కామకన్యకతో నీ వృత్తాంతంబును జెప్పెను. అంతట నాకామకన్య దేవేంద్రాభిప్రాయమును మేనకవలనఁ దెలిసికొని నహుషాత్మజునితో నిట్లనియె.

ఓరాజేంద్రా! నీవు సత్యసంధుండవు. సర్వధర్మజ్ఞుండవు. నాహస్తమందు నీహస్తమునుంచి నీకభీష్టంబైన కార్యమును ముఖ్యముగాఁ జేసెదనని నాపాణిగ్రహణ కాలమందు ప్రతిజ్ఞను జేసితివి. ఇపుడు స్వర్గాది లోకంబులను జూపింపుమనిన, నా కసాధ్యంబని నుడివితివి. కాఁబట్టి నిను బరిత్యజించి పితృమందిరంబునకుఁ బోవుచున్నానని చెప్పెను. నహుషాత్మ

జుం డామాటలను విని ఓసుందరాంగీ! నీవు చెప్పినకార్యము నాకు సాధ్యమైన యెడలఁ జేసెదను. ఆకార్యంబు నా కసాధ్యం బని యింతకుముందు జెప్పితిని. ఈ యభినివేశమును విడిచి, నీవు నాతో సుఖముగా నుండుమనిన, నట్టియెడ కామకన్యక యయాతితో నిట్లనియె.

ఓరాజన్యచూడామణీ! నీవు సర్వలక్షణ సంపన్నుండవు. సర్వధర్మాన్వితుండవు. తేజో బలవీర్యజ్ఞాన సంపన్నుండవు. విష్ణుభక్తులలో నగ్రగణ్యుండవు. విష్ణుధ్యాన పరాయణుండవు. నీయుపదేశ వాక్యంబులచే సకలజనులు జరామృత్యు విహీను లయి గృహద్వారములందుఁ గల్పవృక్ష కామధేను చింతామణి మొదలయిన దేవభోగ్యంబుల ననుభవించు చుండిరి. నీవు శమనపురందర విరోధముచే సకలజనులను మర్త్యలోకంబు నందు విష్ణుధ్యాన పరాయణులను గావించి, స్వతేజో బలవీర్య జ్ఞాన శక్తులచే మహీతలమును స్వర్గలోక తుల్యంబుగాఁ జేసితివి. కావున ముల్లోకములయందును నీతో సమానుండైన భూపాలకుండు లేఁడు. నీవు నాతోకూడ స్వర్గాదిలోకంబుల కేగుటకు శక్యంబు కాదంటివేని నాతోఁ బ్రతిజ్ఞా పూర్వకంబుగాఁ జెప్పినమాటలన్నియు నసత్యంబులగును. అసత్యము వలనఁ బూర్వపుణ్యము నశింపఁ గలదు. నీయభీష్టంబును ముఖ్యముగా నెరవేర్పగలనని, నుడివితివి. నీవు నాతోఁగూడ స్వర్గాది లోకంబుల కరుదెంచి, త్రిల్లోక వైభవంబును నాకుఁ జూపి' సత్యప్రతిజ్ఞుండవై యితర దుష్ప్రాపంబైన యశంబు నొందుము. మీఁదిలోకంబులను జూచి మర్త్యలోకంబునకు రావలెనిన మిక్కిలి యుత్సాహము కలిగినది. కనుక నా

యభీష్టము నెరవేర్చి నీసత్యమును బరిపాలింపుమని ప్రార్థించెను. అవు డామాటలనువిని నీయభీష్టమును నెరవేర్చెదనని యా కామకన్యకతోఁ జెప్పి యంతరంగంబునఁ దానిట్లు చింతించెను.

కాలము సర్వప్రాణులకు మిక్కిలి బలవత్తరమైనది. కాలముచేతనే సకల వృక్షంబులు పుష్ప ఫల పల్లవ శోభితం బులగు చున్నవి. ఒకప్పు డంతర్జల చరంబైన మత్స్యంబు కాల వశంబున జాలంబుచే బంధనంబు నొందుచున్నది. వాయు సమాన వేగంబుగల ఖగ మృగంబులును గాలవశంబున వలల యందు బడి మిక్కిలి దుఃఖము నొందుచున్నవి. సకల ప్రాణుల హాని వృద్ధులకును, మానావ మానములకును, అనాది నిధ నంబైన కాలమే ముఖ్యకారణంబు. తల్లిదండ్రులును, సోదరు లును, బంధుమిత్ర భృత్యులును, మంత్రజపంబులును, తపో దానంబులును, గాల పీడితుండైన పురుషుని రక్షించుటకు సమ ర్థంబులు గాఁజాలవు. జన్మ మరణంబులును భార్యాపుత్ర క్షేత్ర విత్తాదులును, బురుషునికిఁ గాల కర్మకృతంబులయిన పాశంబు లని యెఱుంగ వలయు. ఆకాశంబునందు వాయువేగంబుచేఁ బరిభ్రమించు జలధరంబుల చందంబునఁ, గాలకర్మ స్వభావం బులచే ముల్లోకంబులు పరిభ్రమించు చుండు. కాలవేగ ప్రేరి తంబులయిన కర్మంబులచే సకలజనులు సుఖదుఃఖముల ననుభ వించు చుందురు.

కాలకర్మ స్వభావంబులచే బద్ధులయిన సకలజీవులకు మృగ పక్షి విడ్వరాహాది జన్మంబులును, యక్ష కిన్నర గంధర్వ సిద్ధ విద్యాధర దేవ మానవాది జన్మంబులును, సంభవించు చున్నవి. ఆయుః కర్మ విత్త విద్యా నిధనంబులైదును, సకల

జీవులకు గర్భప్రవేశ కాలమందే కాలకర్మ స్వభావంబులచే నిర్ణీతంబులగు చున్నవి. పురాకృత కర్మం బెవరికి ననుభవింపక తీరదు. ధేనుసహస్రంబులలో వత్సంబు తన తల్లియగు ధేనువును బొందు చందంబున, కాలప్రేరితంబైన కర్మంబు కర్తను బొందును. రాత్రిందివంబులవలెను, చక్రనేమి క్రమంబువలెను. దిరుగుచు సుకృత దుష్కృతంబులు, సకల జీవులకు సుఖదుఃఖంబులం గలుగఁ జేయు చుండును. కాలధర్మంబులచేఁ బీడితుండైన పురుషుని, గ్రహ రోగ విషసర్పంబులును, డాకిన్యాది రాక్షస గణంబులు, బీడించు చుండును. సకల బంధుగణంబుచే నరక్షితుండైనను జనుండు సర్వరక్షకుండైన పుండరీకాక్షునిచే రక్షితుండై, చిరకాలము సుఖముగా నుండు. వారిచే నతిప్రయత్నముగా రక్షితుండైనను నొకప్పుడు పురుషుండు దైవహతుండయి వినాశంబు నొందు. తైలక్షయముచే నశించు దీపంబు చందంబునఁ గర్మక్షయంబుచే జీవుండుశరీరనాశంబు నొందును.

తొల్లి దేవరాజు ప్రేషితుండై మాతలి నాసమీపంబునకు జనుదెంచిన సమయంబునఁ దద్వచనంబులను నిరాకరించితిని. తత్పరాభవంబుచే నాగృహంబునకు నటీనర్తకాదులందఱు జనుదెంచి నన్నును, మోహావిష్ట చిత్తునింజేసి నందువలన, కామాగ్ని సంతాపంబుచేఁ దేజోవిహీనుండనై జరాగ్రస్తుండనైతిని. పిమ్మట జరాదోషంబును భార్గవ వరంబుచేఁ బుత్రున కిచ్చి, వాని తారుణ్యమును గ్రహించి చిరకాలము కామకన్యకతోఁగూడ సకల భోగముల ననుభవించినను, కామము శమింపదయ్యె. ఇట్లు చిరకాలము కామాంధుండై విషయాశామహాపాశ బద్ధుండైన పురుషుని జూచి వీఁడు వివేక విహీనుం

డని లోకులు పరిహాసించెదరు. కావున వైరాగ్యంబును తత్వ బోధంబును మనశ్శాంతిని, శ్రేయస్కాముండైన పురుషుండు సంపాదింపవలెను.

ఇపుడు నేను కామకన్యాభీష్టమును నెరవేర్పనియెడల, సత్య ధర్మంబుల రెండింటిని, నశింపఁజేసిన వాఁడనగుదును. దైవంబు దురతిక్రమంబు గావునఁ దత్కర్మ విపాకం బిప్పుడు సంప్రాప్తంబయ్యెనని, మిక్కిలి చింతాకులితస్వాంతుండై శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణుండును, నాశ్రిత కృపాసాగరుండును, నరక్షిత రక్షకుండును, నగు పుండరీకాక్షుని మనోవాక్కాయంబులచే నమస్కరించి, ననురక్షింపుమని ప్రార్థించెను.

అపుడు కామకన్యక ఈప్రకారముగా చింతాకులిత స్వాంతుండైన కాంతునిం గాంచి, చింత మిక్కిలి దుఃఖకరంబు గావున ప్రాజ్ఞుండైన పురుషుండు చింతను బరిత్యజింప వలెను. నీచింతకుఁ గారణం బెయ్యది యనిన, నపు డాకాంతామణితో నహుషాత్మజుం డిట్లనియె.

ఓకాంతామణీ! నేనింతకుముందు నిక్కడనే స్వర్గంబు చేసెదనని మాతలితోఁ జెప్పితిని. ఇపుడు నీతోఁగూడ స్వర్గాది లోకంబులకుఁ జనినయెడల పరాభవము సంప్రాప్తం బయ్యెనని తలంచు చుంటిని. అదియునుంగాక, నేను స్వర్గలోకంబును బొందిన పిమ్మట నేనుఁ బాలించు సకలజనులు శమదమ తప స్సత్య శౌచస్వాధ్యాయ విహీనులై విష్ణుధ్యాన విముఖులయి దీనులయ్యెదరు. పిమ్మట వ్యాధిగ్రస్తులయి జరామృత్యు పీడితులగుచు యమమందిరము నొందగలరు. అందువలనఁ గొంచెము మనంబున నాలోచించు చుంటినని, యాకాంతామణితోఁ

జెప్పి, పుత్రులలో నుత్తముండును, మతిమంతుండును, సర్వ ధర్మజ్ఞుండును, జరాయుక్తుండును, నగు పూరువను పుత్రుని బిలిచి, పుత్రకా! నీవు మిక్కిలి ధర్మాత్ముండవు. నా శరీరమం దుండు తారుణ్యంబును గ్రహించి నీశరీరమందలి జరాదోషం బును నా కొసంగుము. సకల కోశ బల వాహనాన్వితంబును, జతుస్సముద్ర పరివేష్టితంబును, గిరి నదీ నద గ్రామ నగరారణ్యా న్వితంబును నగు రాజ్యంబును, దుష్ట నిగ్రహ శిష్టపరిపాలన పూర్వకంబుగా ధర్మశాస్త్ర పరాయణుండవై విమర్శించుచు జ్ఞానవృద్ధులచే రక్షితుండవై, న్యాయ్యంబుగాఁ బరిపాలింపుము. మృగయా ద్యూతపానాది సప్తవ్యసన వర్జితుండవై ప్రతిదిన మందును బ్రజల వాంఛితార్థ పరిపూర్తిని జేయుచు, యాగ దాన హోమాది పరాయణుండవై వేదశాస్త్రార్థ తత్వమును దెలిసికొని, బ్రాహ్మణులకు నిత్య దానంబు సేయుచుఁ, బ్రజ లను సుఖముగాఁ బోషింపుము. స్త్రీలను శత్రువులను సేనలను విశ్వసింపక వారి వృత్తాంతమును దెలిసికొనుచు జాగరూకుం డవై యుండుము. పరస్త్రీ పరధన విముఖుండవై శత్రువులను జయించుచు నిత్యానంద పరిపూర్ణుండవై, రాజ్యభోగంబుల ననుభవించుచుండుమని యయాతి హితవాక్యముల నుపదే శించి పూరువు నాశీర్వదించి, సంతుష్టాంతరంగుండై పితృపితా మహాది క్రమంబుచే ప్రాప్తంబైన, నవరత్న ఖచిత స్వర్ణసింహా సనంబున స్వయముగాఁ బుత్రుని స్థాపించి పట్టాభిషేకము గావించి స్వకీయంబైన జరాదోషంబును గ్రహించి తారుణ్యం బును కుమారున కొసంగి, స్వర్గలోక ప్రయాణోన్ముఖుండై యుండె.

## యయాతి సకలజన సహితుడై వైకుంఠలోకంబు నొందుట.

అటుపిమ్మట నహుషాత్మజుండైన యయాతి, సకల జనులను బిలిచి, పూరువను నా తనూజుండు మిమ్ములను కుటుంబములతోఁగూడ సుఖముగాఁ బాలింపఁ గలఁడు. నేను నాభార్యలతోఁగూడ నుత్తమ సుఖదాయకంబైన హరిహర హిరణ్యగర్భ లోకంబులను, నింద్రలోకంబును, బొందఁగలననిన, నతనితో సకలజను లిట్లు విన్నవించిరి. ఓరాజేంద్రా! సకల శ్రుతిస్మృతి పురాణేతి హాసంబు లందును, ప్రఖ్యాతంబైన ధర్మంబు శ్రుతంబుగాని దృష్టంబుగాదు. ఇపు డాధర్మంబు కర చరణా ద్యవయవాన్వితంబైన శరీరాకృతిం బూని, నీస్వరూప ముగా మాకుఁ బ్రత్యక్షమై మమ్ములను బాలించు చున్నది. నీవు సకల ధర్మతత్త్వజ్ఞుండవు. సకల కల్యాణ గుణాన్వితుండవు. సదాచార ప్రవర్తకుండవు. కావున సకల ధర్మస్వరూపుండ వైతివి. మే మందరము ధర్మంబు మూర్తీభవించి, నహుషా త్మజ రూపంబై, జనించె నని యానందించు చున్నాము.

నీవు నిఖిల ప్రజలను నౌరస పుత్రులవలె నింతవఱకు బాలించితివి. కావున నీతో వినాగా నీమహీతల నివాసము కొంచమైన మాకు సుఖకరంబు గాదు. ఇప్పుడు మేమందఱము బయలువెడలి నీవు నివసించు స్వర్గాది లోకములయందు నీతోఁగూడ నివసించెదము. ఈమహీతలమందు మాకు భార్యాపుత్ర క్షేత్ర విత్తాదులచేతను, జీవితముచేతను, గొంచ మైన ప్రయోజనంబు లేదనిన వారి వచనంబుల నాకర్ణించి,

యా యయాతి, మిక్కిలి సంతసించి, తదాగమనంబునకు సమ్మ తించి, వైకుంఠ పార్షద ప్రవర సమానీతంబును, దివ్య హంస యుక్తంబును, శంఖ చక్రాంకిత పతాకా లంకృత హేమధ్వజ విరాజితంబును, నానావిధ రత్నఖచిత సువర్ణ కలశాన్విత శ్వేత ఛత్ర విరాజితంబును, దివ్యస్త్రీ కరచారు చామర శోభి తంబును, నగు నవరత్న ఖచిత కాంచనమయ విమాన వరం బును, శర్మిష్ఠా దేవయాన కామకన్యకలతోఁగూడ దివ్యదేహ ముతో నధిష్ఠించి తపోబలంబుచే స్వర్గలోకంబున కేగెను.

అప్పు డతనితోఁగూడ మహీతల నివాసులయిన సకల జనులు, తత్సమాన రూప ధారులై, వైకుంఠ లోకమును బొంది, సకల సురముని గణసేవితుండును, ప్రపన్నార్తి హరుండును నగునారాయణునికి నమస్కరించి, తత్ప్రసాదంబుచే తల్లోకంబున సుఖముగా నివసించి యుండిరి. నహుషాత్మజుండు ముందుగా స్వర్గలోకంబున కేగి, దేవేంద్రునకు నమస్కరించెను. అపుడు సహస్రాక్షుండు యక్షకిన్నర గంధర్వ సిద్ధవిద్యాధర సురముని గణంబులతోఁ గూడ నెదురుగా వచ్చి, నతని స్వాగతంబును శ్లాఘించుచు, మీ తపోబలంబుచే సంపాదితంబులయిన దివ్య భోగంబుల నీలోకమునందు యథేచ్ఛముగా ననుభవింపుడనిన, నహుషాత్మజుండు మందస్మిత ముఖారవిందుడై తా మాచ రించు గౌరవంబునకు సంతసించితిని, సనాతనంబైన బ్రహ్మ లోకంబున కేగుచుంటిని. నాకానతిండని దేవేంద్రునిఁ బ్రార్థించి బృందారక బృందస్తూయమానుండై, బ్రహ్మలోకంబునకుం జని యతనిచే సన్మానితుండై శివలోకంబున కరిగి సకల సుర ముని బూజితులయిన పార్వతీపరమేశ్వరులకు నమస్కరించి,

భార్యలతోఁగూడఁ గొన్ని దినములు శివమందిరంబున నివసించెను. అపుడు పార్వతీపరమేశ్వరు లిరువురు నామహీకాంతునితో నిట్లనిరి.

ఓరాజోత్తమా! చిరకాలము మమ్ములను శ్రీమహావిష్ణువును భేదబుద్ధి రహితుండవై ధ్యానపూజా వందనాదులచే నారాధించితివి. కావున మాకు మిక్కిలి ప్రియుండవు. శ్రీమహావిష్ణ్వారాధనచే విష్ణుభక్తుండవు కావున నీతపఃప్రభావ సంప్రాప్తంబులైన శివకేశవ లోకములందు నివసించి యథేచ్ఛంబుగా నితర దుష్ప్రాపంబులయిన దివ్యభోగంబుల ననుభవింపు మనిన, దద్వచనముల నాకర్ణించి కొంతకాల మచ్చట దివ్యభోగంబుల ననుభవించుచు నివసించి యుండెను. అటుపిమ్మట యయాతి వినయ వినమిత కంధరుండై భక్తిపూర్వకంబుగా నుమామహేశ్వర పాదారవిందంబులకు నమస్కరించి యద్వితీయ చిదానంద రూపంబగు పరమాత్మ, గుణభేదముచే మూర్తి త్రయాత్మకంబై తేజరిల్లుచున్నది. కావున మూర్తిత్రయంబునకుఁ గొంచెమైన భేదంబు లేదని నేనెఱుంగుదును. మీ రిరువురు నతికల్యాణ రూపులు ధ్యాన పూజావందనాదులచేఁ బురాణ దంపతులయిన మిమ్ముల నారాధించు భక్తులు సకల కల్యాణంబుల నొందఁగలరు. మీ యనుగ్రహంబుచే నేనుసార్వభౌముండను. సకల కల్యాణ గుణాన్వితుండను. సకల ధర్మపరుండనునై భూలోకంబునఁ జిరకాలము దివ్యభోగంబుల ననుభవించి, మీ సమీపంబునకుఁ జనుదెంచి సనక సనందనాది దుష్ప్రాపంబైన మీ దివ్యమంగళవిగ్రహము నవలోకించి కృతార్థుండ నైతిని.

ఇపుడు భగవదాజ్ఞను బొంది వైకుంఠ లోకంబున కేగెద నని, వారితో విజ్ఞాపనంబు చేసి, తదాజ్ఞావశంబునఁ దల్లోకంబున కేగి, నిఖిల సురమునియక్ష కిన్నరగంధర్వాది సేవితుండును, శంఖచక్ర గదాపద్మహస్తుండును, పీతకౌశే యాంబర ధరుండును, వనమాలికా ధరుండును, రమణీయ కౌస్తుభాలంకృత కంధరుండును, మహాలక్ష్మీ సహితుండును, మహాయోగి హృదయారవింద సంస్థాపిత చరణకిసలయుండును, భక్తాభీష్ట ఫలప్రదుండును, పరమ పురుషార్థ దాయకుండును, శ్వేతఛత్ర చామర సంశోభితుండును, నగు మహావిష్ణువు నవ లోకించి యయాతి భార్యలతోఁగూడ నమస్కరించెను. అపుడు మధుసూదనుండు యయాతిని జూచి సంతసించి, నతనితో నిట్లనియె. ఓరాజేంద్రా! నీవు చిరకాలము భక్తిశ్రద్ధలతో శమదమాది గుణాన్వితుండవై నన్నారాధించితివి కావున, నాకుఁ బ్రియభక్తుండ వైతివి. నీ కభీష్టంబైన వరము నొసం గెద వేడుమనిన సంతతము నీపాదారవింద భక్తిని, దాస్య మును, నా కొసంగు మని ప్రార్థించెను. పిమ్మట మధుసూద నుండు వల్లెయని యంగీకరించి, భార్యలతోఁగూడ నీ వీలోకం బున దివ్యభోగంబుల ననుభవింపు మని చెప్పెను. తదనంతరం బారాజన్యుండు మధుసూదనాజ్ఞచే వైకుంఠ లోకంబున నివ సించి దివ్యభోగంబుల ననుభవించు చుండెను.

## పితృ వాక్య పరిపాలనా ఫలము

ఓ భూసురోత్తమా! పుత్రులకు సకల సుఖప్రదంబును సంసార తారకంబును, పాపనాశకంబును, లోకప్రసిద్ధంబును

నగు యయాతి చరిత్రంబును నీకుఁ జెప్పితిని. పూరువను పుత్రుండు పితృవాక్య పరిపాలనంబుచే సకల రాజ్యలాభంబు నొందెను. యదువు మొదలయిన పుత్రులందఱుఁ బితృశాపంబుచే రాజ్యవిహీనులై యనేక దుఃఖముల నొందిరి. తల్లిదండ్రులను భక్తిశ్రద్ధలతోఁ బూజించుచు వారి యాజ్ఞను బాలించు పుత్రులు గంగాస్నాన పృథ్వీదానాది సకల పుణ్యకర్మ ఫలంబు నొందఁగలరు. తల్లిదండ్రులు సర్వదేవతాస్వరూపులును, గంగాది సకలతీర్థ రూపులును, గావున వారు పుత్రులను బిలిచినపు డత్యాదరముతో వారి సమీపంబున కరుదెంచి వారుచెప్పిన పనులను భక్తిశ్రద్ధలతోఁ జేయుచుండ వలయును. అనుదినమందును వారి పాదసంవాహనము చేయ వలయు. అట్లు చేయు పుత్రులు స్వర్గాపవర్గముల ననాయాసముగాఁ బొందఁగలరు. వారికి బ్రతికూలముగా సంచరించుచుఁ బితృమాతృ భక్తిలేనివారు, నరక దుఃఖముల ననుభవించి పిమ్మట హీనయోనులందు జనించెదరు. కావున మహాత్ముల వలన నేనీధర్మములను దెలిసికొని యనుదినమందును భక్తిశ్రద్ధలతోఁ బితృమాతృ శుశ్రూషణంబు సేయుచు వారి యనుగ్రహంబు వలన జ్ఞానవిజ్ఞాన సంపన్నుండ నైతిని. కావున నీవును బితృమాతృ శుశ్రూషణంబువలన విజ్ఞాన సంపన్నుండవై యైహికాముష్మిక సుఖంబుల నొందఁగలవనినఁ, దద్వచనముల నాకర్ణించి పిప్పలుండను విప్రుండు సుకర్మునకు నమస్కరించి, తదనుజ్ఞను గైకొని, పితృమాతృ సంరక్షణంబుచేసి తత్ప్రభావంబువలన స్వర్గలోకంబున కేగి, విమానారూఢుండై సకల దివ్యభోగముల ననుభవించి క్రమముగా ముక్తుండయ్యె

ఈప్రకారము సుకర్ముండును పితృమాతృ శుశ్రూషాప్రభావం బుచే నైహికాముష్మికసుఖంబుల ననుభవించి, మోక్ష సామ్రాజ్యంబు నొందెను. ఓ వేనమహారాజా! యిత్తెఱం గున నీకుఁ బితృసేవా ప్రభావంబును వక్కాణించితిని. మఱియొక వృత్తాంతము నడిగితివేని, జెప్పెద ననిన, మహావిష్ణువుతో వేన భూపాలుం డిట్లనియె.

## కుంజరంబను శుకంబు పుత్రులతో సంభాషించుట

దేవదేవా! నీవు సర్వజ్ఞుండవు, కావున నీవలన నధిక పుణ్యప్రదాయకంబులైన భార్యాతీర్థ పితృమాతృ సేవామహి మంబులను విని సంతసించితిని. గురుతీర్థ మహిమంబును జెప్పు మనిన, శ్రీ మహావిష్ణువు వేనభూపాలునితో నిట్లనియె.

ఓ రాజేంద్రా! గుర్వనుగ్రహంబువలన సకల శిష్యులు ధర్మజ్ఞులయి యనేక సుకృతకర్మముల నాచరించి జ్ఞానవిజ్ఞాన సంపన్నులయి నానావిధ భోగముల ననుభవించి పునరావృత్తి రహితంబైన మోక్ష సామ్రాజ్యంబు నొందఁగలరు. సూర్య చంద్రులు, దివారాత్రంబులందు సకల లోకాంధకారంబును, దీపంబు గృహమధ్యాంధకారంబును, నశింపఁ జేయుచందం బున శిష్యహృదయాంధకారంబును గురువు నశింపఁజేయును గావున, వేదశాస్త్ర కోవిదుండైన గురువుతో సమానుండు మఱియొకండు లేఁడని తెలిసికొనుము. ఈ యర్థమం దొక పురాతనేతిహాసంబు గలదు. దానిం జెప్పెద సావధానుండవై వినుము. భార్గవ కులోత్పన్నుండైన చ్యవనుండను మునిసత్త ముండు, తీర్థయాత్రాపరుండై గంగా గోదావరీ నర్మదా

మొదలయిన మహానదులందు స్నానసంధ్యాతర్పణాదుల నాచరించి, నర్మదా దక్షిణకూలమందుండు బ్రహ్మేశ కపిలేశ మార్కండేయేశ్వరామర కంటకేశ్వరాదిలింగంబులం బూజించి స్తుతిచేసి నమస్కరించి యొక వటవృక్ష మూలంబున శీతలం వృక్షచ్ఛాయయందు సుఖసుప్తుండై కొంతసేపటికి మేల్కాని వృక్షాగ్రస్థిత శుకంబుల సంభాషణంబును వినుచుఁ గూరుచుండెను.

ఆవృక్షాగ్రమందు కుంజరంబను వృద్ధశుకంబు భార్యతోఁగూడ నివసించి యుండెను. ఆవృద్ధ శుకంబునకు నుజ్జ్వలుండనియు, సముజ్జ్వలుండనియు, విజ్జ్వలుండనియుఁ, గపింజలుండనియు, నలుగురు పుత్రులుగలరు. ఆపుత్రులు నానాదేశ గిరికందరాదులయందుఁ బరిభ్రమించి క్షుత్పిపాసాదులను శమింపఁజేసికొని, యమృత తుల్యంబులైన ఫలంబులను జలంబులను దీసికొనివచ్చి యాఫలజలంబులచేఁ దల్లిదండ్రులకుఁ దృప్తిసిఁ గలుగఁజేసి పక్షవాతంబుచే వీచుచు వారి సమీపంబునఁ గూరుచుండిరి. అపు డావృద్ధశుకంబు భార్యతోఁగూడ నాహారముచేఁ దృప్తినొందిన పిమ్మట నుజ్జ్వలుండను పుత్రుని బిలిచి. నీ వెక్కడెక్కడఁ దిరిగితివి. ఏ యపూర్వ వృత్తాంతము నవలోకించితివి. చెప్పుమనిన నాపుత్రుండు వినయ వినమితకంధరుండై తండ్రికి నమస్కరించి చెప్పుటకు నుపక్రమించెను.

నే నాహారముకొఱకు నతిప్రయత్నములో నక్కడక్కడ సంచరించుచు నొకప్పుడుఁ బ్లక్షద్వీపంబున కేగితిని. అక్కడ మధుర ఫలంబులను జలంబులను గ్రోలి తృప్తినొంది సుఖముగా సంచరించు సమయంబున నత్యాశ్చర్య కరంబైన

రయొక్క వృత్తాంతమును జూచితిని. ఆద్వీపమందు గిరినదీ నదా న్వితంబులును, కమల కల్హార నీలేందీవర శోభిత సరోవరాన్వి తంబులును, నగు ననేక పురవరంబులును, గ్రామంబులును, గలవు. అందుండు సకలజనులు దాన దాక్షిణ్యాది గుణాన్వితు లును, సత్య ధర్మపరాయణులును, మహాతేజో వంతులును, నగుచు సుఖముగా నివసించియుండిరి. ఆద్వీపమం దొక పుర వరంబున, దయా సత్యశౌచాన్వితుండును, దుష్టనిగ్రహ శిష్టా నుగ్రహ దక్షుండును, మహాతేజోవంతుండును, నగు దివో దాసుండను మహారాజు ప్రఖ్యాతుండై యుండె. అతనికి నిరు పమ వయోరూపలావణ్యాన్వితంబైన దివ్యదేవి యను నారీ రత్నము కూతురై జనించె. యాబాలిక, దినదిన ప్రవర్ధ మానయై శుక్లపక్ష చంద్రరేఖవలె వృద్ధినొందు చుండెను. అంతట దివోదాసుం డాచిన్నదాని వివాహవ యస్సు నవలో కించి, చిత్రసేనుండను నొకరాజు పుత్రునకు యథావిధిగానిచ్చి వివాహము గావించెను.

అటుపిమ్మట వివాహ మధ్యకాలంబున, నాచిత్రసే నుండు దైవవశంబున మృతినొందెను. అపుడు దివోదాసుం డతిచింతాకులిత స్వాంతుండై, వేదశాస్త్ర కోవిదులైన బ్రాహ్మణులను బిలిచి, నాకుమార్తె విషయమయి నేనేమి చేయవలయు నని యడిగిన నాభూసురోత్తములు, రజస్వల కాకుండా యున్నకాలమందు ముందుగా భర్త కాలధర్మము నొందినయెడల, మఱియొక వరునకిచ్చి వివాహము చేయవచ్చు నని చెప్పిరి. అపుడు దివోదాసుం డింద్రప్రస్థపురంబున కేగి యింద్రసేనుండను రాజుపుత్రుని కొఱకుఁ దనపుత్రిక నిచ్చి

మరల వివాహము చేసెను. ఆవరుండును బురాకృత కర్మం బుచే లగ్నదోషంబువలనఁ గాలధర్మము నొందెను. ఇట్లు అంగు వనేకవింశతి భర్తలు మృత్యులయిరి. అపుడు దివోదా సుండు మంత్రులతో నాలోచించి స్వయంవరమును జేసెను. ఈబాలికావయోరూప లావణ్యంబులచే ననేక మహారాజులు విని కామాకులిత స్వాంతులై మోహావిష్ట చిత్తులయి, సమ రాంగణమందు స్వభుజ పరాక్రమముచే హతులయి మృతు లయిరి. ఈప్రకారంబుగా మహాత్ములయిన క్షత్రియుల నాశం బును విని, యా దివ్యదేవి యతిదుఃఖార్తయై, కరుణముగా విలపించుచు గిరికందర మధ్యంబున నివసించి యుండెను. ఈ యపూర్వ వృత్తాంతమును నేను జూచితిని. ఈకన్యకా వైధ వ్యంబునకుఁ గారణంబును సవిస్తరముగా జెప్పుమనిన, నా పుత్రునితో వృద్ధశుకం బిట్లనియె.

పుత్రకా! నీవు సావధాన చిత్తుండవై వినుము, సకల పాపనివర్తకంబును, బరమ పవిత్రంబును, నగు వారాణసియను పురవరంబు గలదు. అచట మహాప్రాజ్ఞుండును, ధనధాన్య సమ న్వితుండును, నగు సువీరుండను వైశ్యుండు గలఁడు. అతనికి నిరుపమ వయోరూపలావణ్యాన్వితయైన చిత్రాదేవియను భార్యకలదు. ఆభార్య యెల్లపుడు భర్తను నిందించుచుఁ గలహ ప్రియురాలై కులాచారములను బరిత్యజించి పరపురుషులతో హాస్యము చేయుచు యథేచ్ఛముగా విహరించు చుండెడిది. అనుదినమందును, పరగృహములందు నివసించి సాధుబాధా న్వితయై, పరచ్ఛిద్రముల నవలోకించుచు ననేక కులస్త్రీలకు

భర్తలతో ద్వేషమును భర్తృమరణ దుఃఖములను, గలుగఁ జేయు చుండెడిది. అపుడు భర్తయైన సువీరుం డిది మహా పాపాత్మురాలని తలంచి, దానినిఁ బరిత్యజించి, మఱియొక కన్యకను వివాహము చేసికొనెను.

## చిత్రాదేవి చరిత్ర

అటుపిమ్మట నాచిత్రాదేవి యతిపాపాత్మురాలయిన పర పురుషులతో ననవరతము, సంగమాలింగన సుఖంబుల ననుభ వించుచు, మహాపతివ్రతలైన స్త్రీలను, ధనాశచేతను, విశ్వాస కర వాక్యంబులచేతను, వస్త్రభూషణంబులచేతను, స్వాధీనము చేసికొని వారికిఁ బరపురుష సమావేశమును గలుగఁజేయుచు ననేక గృహాశతంబులను నశింపఁజేసెను. పిమ్మట మరణము నొంది యమలోకమందు రౌరవాది మహానరక దుఃఖముల ననుభవించి, పూర్వజన్మాచరిత దుష్కృతానుసారముగా, నీ జన్మమునందు ననేక భర్తృమరణ దుఃఖంబును, సమరాంగ ణమం దనేక క్షత్రియ నాశదుఃఖంబు ననుభవించి, గిరికందర మధ్యంబున రోదనము చేయుచుండెను. పురాకృతం బెవరికి ననుభవింపక తీరదు. కావున ననేక స్త్రీలకు దూతీకర్మంబుచే భర్తృమరణ దుఃఖమును గలుగఁజేయుటవలనను, విషదానం బుచే ననేకులు మృతినొందుటవలనను, ననేక పర్యాయములు భర్తృమరణ దుఃఖము ననుభవించె ననినఁ, దద్వృత్తాంబును విని, యుజ్జ్వలుండు వృద్ధశుకంబుతో నిట్లనియె.

ఆదివ్యదేవి యేపుణ్యకర్మ ప్రభావంబుచే మహారాజ పుత్రికయై జనించెనో యాపుణ్యకర్మంబును జెప్పుమనిన, వృద్ధ

శుకంబు పుత్రునితో నిట్లనియె. తొల్లి సువీరుండను వైశ్యునకు భార్యనైయున్న సమయంబున, మహాతేజోవంతుండును, సిద్ధపురుషుండును, నగు నొక మహాయోగీశ్వరుండు, గ్రీష్మ సంతాపముచే డస్సి, క్షుత్పిపాసా పీడితుండై, శీతల ఛాయా పేక్షచే గృహద్వార సమీపంబునకు జనుదెంచెను. అపు డా మహాయోగినిఁ జూచి సువీరపత్ని యాసనపాద ప్రక్షాళన స్వాగతవాక్యంబులచే సాదరంబుగా గారవించి గోధూమ చూర్ణశర్కరాఘృత దధిదుగ్ధంబులచేతను, నానావిధ సుపక్వ ఫలంబులచేతను, సుస్వాదు పానీయంబులచేతను, క్షుత్పిపాసాది పరిశ్రమను బోఁగొట్టి, కొంతకాలము నివసింపఁజేసి పాద సంవాహనాదులచేఁ జిరకాలము సేవించెను. అతం డక్కడఁ గొన్నిదినంబులు నివసించి యొక మహారణ్యంబునకుఁ జనెను.

అటుపిమ్మట మఱికొన్ని దినంబులకుఁ గర్మవశంబున మృతినొంది యమలోకంబున రౌరవాది మహానరక దుఃఖముల ననుభవించి, యామహాయోగి ప్రసాదంబుచే దివోదాస పుత్రికయై, మృష్టాన్న పానంబుల ననుభవించుచు సుఖముగా నుండెను. అనేక స్త్రీలకు భర్తృమరణ దుఃఖమును గలుగఁజేసి యనేక గృహములను నశింపఁజేయుటచేతను, మఱికొన్ని పాపకర్మంబులచేతను యీజన్మంబునందు, వైధవ్య దుఃఖము సంప్రాప్తంబయ్యె ననినఁ, దద్వచనముల నాకర్ణించి యుజ్జ్వలుం డిట్లనియె. ఈ రాజపుత్రికయైన దివ్యదేవి యేకాకినియై మహారణ్యమధ్యంబున మిక్కిలి దుఃఖించుచున్నది. ఈదుఃఖ నివృత్త్యుపాయం బెయ్యది. యనిన, నావాక్యమును విని యొకక్షణకాల మాలోచించి తిర్యగ్జన్మంబుచే నావివేకంబు నష్టప్రాయ

మైనను వటవృక్ష సంగంబుచేతను, నర్మదా ప్రభావంబుచేతను, శ్రీమహావిష్ణ్వనుగ్రహంబు చేతను, పాపవిముక్తనై మోక్షోపాయంబైన ధర్మంబును జెప్పుచున్నాను. వినుము.

శ్రీ మహావిష్ణుని, పారమార్థిక స్వరూపజ్ఞానముచేతను, సగుణస్వరూప ధ్యానముచేతను, వ్రతభేదంబులచేతను, నామసంకీర్తనంబుచేతను, సకల దురితక్షయంబు నొంది, దివ్యదేవి, ముక్తింబడయఁ గలవు. ముందుగా నిరాకారంబైన విష్ణుస్వరూపమును జెప్పుచున్నాను. ప్రజ్వలించునగ్ని, దారుచయంబును, సువర్ణమలమును, నశింపజేయు చందంబున జ్ఞానాగ్ని సకల పాపములను నశింపఁజేసి మోక్షమును గలుగఁజేయును. అంత ర్యామియైన పరమాత్మ జన్మ జరామరణ వర్జితుండును, త్వక్చక్షు శ్రోత్రాది జ్ఞానేంద్రియ వర్జితుండును, వాక్పాణి పాదాది కర్మేంద్రియ వర్జితుండును; చిదానంద మయుండును, గావున స్థూల సూక్ష్మ కారణశరీర విహీనుండును, సర్వసాక్షియు, నగుచు సకల శరీరంబులందును నేకరూపంబుగాఁ బ్రకాశించువాఁడు. సూర్యలోకంబుచేఁ బ్రకాశించు జగంబు వగిది యాత్మచైతన్య ప్రకాశంబుచే సకల ప్రపంచంబు, నతని యందుఁ బ్రకాశించు చుండు. సకల ప్రపంచోపాదాన కారణంబును నఖిలాధారంబును నగు పరమాత్మయందు జలమందావిర్భవించు ఫేన బుద్బుద తరంగాదులవలె జగంబులు స్వర్గ స్థితిలయంబులం బొందు చుండు. కావున నిది యనిత్యంబనియు, సర్వసాక్షియగు కూటస్థుండు నిత్యమనియుఁ, దెలిసి కొనిన ముక్తిం జెందెదరు. ఇట్లు నిరాకారంబైన విష్ణుస్వరూపంబును జెప్పితిని. సాకారంబైన విష్ణుస్వరూపమును జెప్పెద

వినుము. పూర్ణేంద్రునిభవక్త్రుండును, వనమాలాలంకృత కంధరుండును, శంఖచక్ర గదాపద్మహస్తుండును, శ్రీవత్స కౌస్తుభాలంకృత వక్షుండును, పీత కౌశేయాంబర ధరుండును, గరుడారూఢుండును, నగు శ్రీమహావిష్ణువును, ధ్యాన పూజావందనాదులచే నారాధించు వారు, సకల పాపవిముక్తులయి వైకుంఠ లోకము నొందఁగలరు.

## ద్వాదశోత్తరనామ శతకము

ఇటుపిమ్మట విష్ణువ్రత భేదంబులను, ద్వాదశోత్తర నామ శతకంబును, జెప్పుచున్నాను సావధానుండవై వినుము. ఏకాదశీ వ్రతంబును, కృష్ణాష్టమీ వ్రతంబును, ద్వాదశీ వ్రతంబును, బంచ పర్వంబులు, నశూన్య శయనవ్రతంబును, శ్రీరామనవమీ వ్రతంబును, విష్ణుప్రీతికరంబులై మోక్షసామ్రాజ్యము నొసంగుచున్నవి. ఇపుడు ద్వాదశోత్తర నామ శతకంబును వినుము.

అస్యశ్రీ ద్వాదశోత్తర విష్ణునామ శతస్తోత్ర మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రీఛందః. హృషీకేశ ఇతి బీజం. కేశవఇతి శక్తిః. మధుసూదనఇతి కీలకం. సకలకామనాసిద్ధ్యర్థే మోక్షార్థేచ నామపాఠె వినియోగః.

శ్లో॥ నమామ్యహం హృషీకేశం కేశవంమధుసూదనం
సూదనం సర్వదైత్యానాం నారాయణ మనామయం॥ ౧
శ్రీకరం విజయం కృష్ణ మనంతం వామనం తథా
విష్ణుం విశ్వేశ్వరం జిష్ణుం విశ్వాత్మానం సురార్చితం॥ ౨

అనఘం త్వఘహర్తారం నారసింహం శ్రియఃప్రియం
శ్రీపతిం శ్రీధరం శ్రీదం శ్రీనివాసం మహోదయం॥ ౩
శ్రీరామం మాధవం శౌరిం కుమారూపం జనార్దనం
సర్వజ్ఞం సర్వవేత్తారం సర్వేశం సర్వదాయకం॥ ౪
హరిం మురారిం గోవిందం పద్మనాభం ప్రజాపతిం।
ఆనందం జ్ఞాన సంపన్నం విజ్ఞానం జ్ఞానదాయకం॥ ౫
అచ్యుతం సబలం చంద్ర వక్త్రం వ్యాప్తపరావరం।
యోగేశ్వరం జగద్యోనిం బ్రహ్మరూపం మహేశ్వరం॥ ౬
ముకుందం చాపి వైకుంఠ మేకరూపం కవిం విభుం।
వాసుదేవం మహాదేవం బ్రహ్మణ్యం బ్రాహ్మణప్రియం॥ ౭
గోప్రియం గోహితం యజ్ఞం యజ్ఞాంగం యజ్ఞవర్ధనం।
యజ్ఞస్య ఫలభోక్తారం వేదవేదాంగపారగం॥ ౮
వేదజ్ఞం వేదరూపం తం విద్యావాసం సురేశ్వరం।
ప్రత్యక్షం చ మహాహంసం శార్ఙ్గపాణిం పురాతనం॥ ౯
పుష్కరం పుష్కరాక్షం చ వారాహం ధరణీధరం।
ప్రద్యుమ్నం కామపాలంచ వ్యాసారాధ్యం సురేశ్వరం॥ ౧౦
సర్వసౌఖ్యం మహాసౌఖ్యం సాంఖ్యం చ పురుషోత్తమం।
యోగరూపం మహాత్మానం యోగీశ మజితంప్రియం॥ ౧౧
అసురారిం లోకనాథం పద్మహస్తం గదాధరం।
గుహావాసం సర్వవాసం పుణ్యవాసం మహాజనం॥ ౧౨

బృందానాథం బృహత్కాయం పావనం పాపనాశనం।
గోపీనాథం గోపసఖం గోపాలం గోగణాశ్రయం॥ ౧౩
పరాత్మానం పరాధీశం కపిలం కార్యమానుషం।
నమామ్యహం సదాభక్త్యా మనోవాక్కాయ కర్మభిః॥ ౧౪

ఈ విష్ణుద్వాదశోత్తర నామశతకంబును సాలగ్రామ సమీపమందైనను, విష్ణుక్షేత్రమందైనను, భక్తిశ్రద్ధలతోఁ గాలత్రయమందుఁ బఠించువారును, శ్రీకృష్ణుని ధ్యానపూజా వందనాదులచే నారాధించు వారును, అశూన్య శయనవ్రతం బును శ్రీకృష్ణ జన్మాష్టమీ, శ్రీరామనవమీ వ్రతంబులను నేకాదశ్యుపవాస జాగరణంబులను జేయువారును, కార్తిక మాసమందును మాఘమాసమందును ప్రాతస్స్నాన మాచ రించి శ్రీకృష్ణునిఁ బూజించువారును, విగత పాపులయి జ్యోతిష్టోమాప్తోర్యామ పౌండరీక వాజపేయాశ్వమేధాది యాగఫలంబుల నొంది వైకుంఠ లోకంబున సుఖముగా నివ సించెదరు. బ్రాహ్మణుం డీనామ శతకంబును బఠించిన, వేదార్థ తత్వజ్ఞుండును, క్షత్రియుండు పఠించిన, శత్రుజయాన్వి తుండును, వైశ్యుండు ధనధాన్యసమృద్ధుండును, శూద్రుండు బ్రాహ్మణునివలన వినినయెడల, భావిజన్మంబున విప్రుండై జనించి వేదాధ్యయన పూర్వకంబైన సుకృతకర్మంబులను బొందఁగలరు. సకల జీవులకు నైహికాముష్మిక సుఖ సాధ నంబు గావున నీ నామశతకంబును భక్తిశ్రద్ధలతోఁ బఠించు వారు, సకలాభీష్టంబుల నొందఁగలరు.

## దివ్యదేవి వైకుంఠమును బొందుట

ఓపుత్రకా! పరమాత్మ స్వరూప విజ్ఞానంబును, సాకార విష్ణుధ్యానంబును, నశూన్య శయనాది వ్రతభేదంబులను, ద్వాదశోత్తర విష్ణునామ శతకంబును, నీకు నుపదేశించితిని. కావున నీపక్కడనుండి బయలువెడలి, యా దివ్యదేవి సమీపంబున కేగి, యీనాలుగిటిని నామెకు బోధింపుము. శ్రీమహావిష్ణ్వనుగ్రహంబుచే విముక్త పాపయై వైకుంఠ లోకము నొందగలదనిన, నుజ్జ్వలుండు తద్వాక్యములను విని తల్లిదండ్రులకు నమస్కరించి, యతివేగముతోఁ బ్లక్షద్వీపంబున కేగి, నానావిధ రత్నమయ శృంగాన్వితంబును, సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వసేవితంబును, నానానదీ ప్రవాహ సంకులంబును, ననేకవిధ విహంగమ కలకలధ్వని సంకులంబును, నప్సరోగణ సహితంబును, నగు సర్వతో భద్రగిరి వరమండలి కందర మధ్యభాగంబున, రోదనము సేయుచున్న రాజకన్యకను గాంచి, నీ వెవ్వతెవు. ఈవిజన ప్రదేశమం దొంటరిగా నుండి నీవు దుఃఖించుటకుఁ గారణం బెయ్యది. నీవృత్తాంతమును సమగ్రంబుగాఁ జెప్పుమనిన నా రాజకన్యక యుజ్జ్వలునితో నిట్లనియె.

ఓ మహాత్మా! నా పూర్వపుణ్యంబుచేఁ బక్షిరూపంబు నొంది యిచటకుఁ జనుదెంచి మనుష్యవాక్కులచే సంభాషించు చున్నావు. నీవు కృపార్ద్రహృదయుండును, సిద్ధపురుషుండును నగు మహాయోగీంద్రుండ వని భావించెదను. మహాభాగ్యముచే నిన్నును జూచి నేను ధన్యురాల నైతిని. నా

వృత్తాంతమును జెప్పెద వినుమని తన వృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పి దుఃఖించెను. అపు డుజ్జ్వలుం డింతకుముందు నీ వృత్తాంతంబును సమగ్రంబుగా విని యీ దుఃఖ నివృత్త్యుపాయం బేది యని, మా జనకు నడిగి తన్నివృత్త్యుపాయంబును దెలిసికొని నీ సమీపంబున కేతెంచి, తదాజ్ఞచేఁ జెప్పుచుంటిని. సావధాన చిత్తముతో వినుమని రాజకన్యకతో నుజ్జ్వలుం డిట్లనియె.

ఓనారీమణీ! నీవు తొల్లి వారాణసీ పురవరంబున సువీరుండను వైశ్యునకు భార్యవై యెల్లప్పుడు భర్తను నిందించుచు, నతిపాపచిత్తులును యౌవనవంతులును నగు పరపురుషులతోఁగూడి మందస్మితముతో సంభాషించు చుండెడిదానవు. పరగృహములందుఁ దఱుచుగా నివసించి పతివ్రతలైన స్త్రీలను ధనలోభంబుచేతను, విశ్వాసకర వాక్యంబులచేతను, స్వాధీనము చేసికొని, యాస్త్రీలకు పరపురుషులను సంఘటింపఁ జేయుచు విషదానముచే భర్తృమరణ దుఃఖమును గలుగఁజేసి యనేక గృహాశతములను నశింపఁజేయుటచే నీజన్మంబున ననేక భర్తృమరణ దుఃఖంబుల ననుభవించితివి. ఇపు డింద్రియంబులను జయించి యాహారనియమంబుతో నధశ్శయన బ్రహ్మచర్య నియమమును స్వీకరించి దేహేంద్రియ మనోబుద్ధి విలక్షణుండును సర్వసాక్షియు సర్వాధారుండును నగు పరమాత్మను దెలిసికొని సాకారంబైన విష్ణుస్వరూపమును హృదయాంబుజంబునందు ధ్యానించుచు, నశూన్య శయనవ్రతంబును, శ్రీకృష్ణ జన్మాష్టమీ వ్రతంబును, శ్రీరామ నవమీ వ్రతంబును, నేకాదశ్యుపవాస జాగరణంబులను, భక్తిశ్రద్ధలతో నాచరింపు

మని చెప్పి పూర్వోక్త విష్ణునామ శతకంబును నుపదేశించి యీ ద్వాదశోత్తర విష్ణునామ శతకంబును సర్వకాలమందును బఠింపుము. ఈవైష్ణవ ధర్మాచరణంబుచే నిఖిల పాపంబులు నశింప గలవు. పిమ్మట పరిశుద్ధురాలవై విష్ణులోకము నొంద గలవని చెప్పి, యాకాశమార్గంబున కెగిరి. స్వస్థానము నొందెను.

అపుడా రాజకన్యక కామక్రోధ వర్జితయై యాహార నియమంబుతో వైష్ణవధర్మంబుల నాచరించుచు, మూఁడు సంవత్సరంబులు తీవ్రతపం బాచరించెను. అటుపిమ్మట నింద్ర నీల ఘనశ్యాముండును, శంఖ చక్ర గదా పద్మహస్తుండును, పీతాంబరుండును, సర్వాభరణ శోభాన్వితుండును, మహేశ్వరుండును, వరదుండును నగు జనార్దనుండు ప్రసన్నుండై యభీష్టమయిన వరము నొసంగెద వేఁడుమనిన నపుడా దివ్యదేవి యా దేవునికి నమస్కరించి విష్ణుతేజోధర్షితయై బద్ధాంజలిపుట యయి, వేపమాన గాత్రంబుతోను, గద్గద స్వరంబుతోను, నిట్లు పలికెను. ఓ దేవదేవా! నీవు మహామహుండవు. మహాను భావుండవు. సర్వశక్తి యుక్తుండవు. నే నబలను, వివేకము లేనిదానను, ఆ కారణమువలన నీ మహిమంబును నే నెఱుంగను, హరిహర హిరణ్యగర్భులలో నీవు కమలాసనుండవో, జనార్దనుండవో, మహేశ్వరుండవో నాకుఁ దెలియదు. నీ స్వరూపమును నాకు బోధింపుము. నీవు భక్తవత్సలుండవు. కృపాసాగరుండవు. కావున నా పాపంబులను, సకల దుఃఖంబులను, బోఁగొట్టి యపార సంసార సాగరంబువలన నన్నుద్ధరిం

పుము. నీకు నమస్కారమనిన, నా రాజకన్యా వాక్యంబులను విని, యపుడు జనార్దనుండు, రాజకన్యకతో నిట్లనియె.

ఓ యంగనామణీ? నీ వాచరించిన నశూన్యశయన వ్రతాది నియమంబులచేతను, ద్వాదశోత్తర నామశత పాఠంబు చేతను, నేను సంతసించితిని. త్రిమూర్తులలో మాకుఁ గొంచె మైనను భేదములేదు. కావున నొకరినిఁబూజించినను, మూర్తి త్రయంబును బూజితంబగు. నేను మాధవుండను. మూర్తిత్ర యంబును నాకంటె వేఱుగాలేదని తెలిసికొనుము. హరిహర హిరణ్యగర్భులయందు భేదబుద్ధి కలవారు రౌరవాదినరకదుఃఖ ముల నొందఁగలరు. నీవు నా యనుగ్రహంబుచేఁ బాపవిము క్తవై వైకుంఠలోకంబు నొందఁగలవని చెప్పి, జనార్దనుం డంతర్హితుం డయ్యె. అటుపిమ్మట నా రాజకన్యక వైకుంఠ నాథ ప్రేషితంబును, పార్షద ప్రవరశోభితంబును, దివ్యహంసా న్వితంబును, వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ పద్మరా గాది మణిగణ ఖచితంబును, కాంచనమయంబును, నగు దివ్య విమానంబున దివ్యమాల్యాంబరాభరణాలంకృతంబును, దివ్య గంధానులిప్తంబును, నగు దివ్యదేహముతో నధిష్ఠించి, కాంచన దండమండితంబును పూర్ణేందు మండలసన్నిభంబును నానారత్న విశోభి హేమకలశాన్వితంబును, భాస్వన్మౌక్తిక పరివృతంబును నగు శ్వేతఛత్రంబును ధరియించి, దివ్యస్త్రీ కర చారుచామర మందమారుత ప్రకంపిత కేశపాశాన్వితయై వైకుంఠలోకంబున కేగి సుఖముగా నివసించి యుండెను. ఈ వృత్తాంతమును దెలిసికొని యుజ్జ్వలుండు మహాహర్షముతోఁ దండ్రి సమీపంబున కేతెంచి యావృద్ధశుకంబుతో నీవృత్తాం

తమును జెప్పెను. పిమ్మట నావృద్ధశుకంబులన్నియుఁ దద్వృత్తాంతమును విని మహాహర్షము నొందినవి.

## గంగా ప్రయాగ పుష్కర ప్రభాస తీర్థముల చరిత్ర

అటుపిమ్మట కుంజరంబను వృద్ధశుకంబు, రెండవ పుత్రుండైన సముజ్జ్వలుని బిలిచి, నీవు చూచిన యపూర్వ వృత్తాంతమును జెప్పుమనిన, సముజ్జ్వలుం డావృద్ధ శుకంబుతో నిట్లనియె. ఓతండ్రీ! నే నాహారంబు కొఱకు హిమవత్పర్వత సమీపంబున సంచరించుచు నొక యపూర్వ వృత్తాంతమును జూచితిని. దానిం జెప్పెద సావధాన చిత్తముతో వినుము.

చంచుచరణంబులందు నీల వర్ణంబును శరీరమం దంతట శుక్లవర్ణంబును గల నాలుగు హంసలు, శరీరమందంతట శుక్లవర్ణంబు కల మఱికొన్ని హంసగణంబులును, మానససరోవరంబున కేగినవి. పిమ్మట నాలుగు హంసలును యాసరోవరంబున స్నానం బాచరించి తత్తీరంబునఁ గూరుచున్నవి, అపు డానాలుగు హంసలను జూచి శుక్లవర్ణంబులయిన హంసగణంబులు, మానస తీర్థస్నానంబాచరించినను, నాలుగు హంసలకుఁ జంచు చరణనీలిమ నివర్తింపదయ్యె నని పరిహాసించు చుండెడివి. అటుపిమ్మట శ్యామ బృహత్కాయంబుగల మఱియొక హంసము మానసతీర్థంబునుండి బయలువెడలి తత్తీరమందలి సకల హంసలతోఁగూడ గగనమార్గంబున కెగిరి నర్మదానదియందలి కపిలా సంగమమందు శ్యామ బృహత్కాయంబుగల హంసయు నాలుగు హంసలును స్నానం బాచరించి నీలిమారహితంబయిన పరిశుద్ధ దేహముకలవై, శుక్లవర్ణంబులయిన హంస

గణంబులతోఁగూడ బయలు వెడలి గగనమార్గంబున కేగి యదృశ్యంబు లయ్యెను.

అటుపిమ్మట నొకప్పుడు వింధ్యాచల మహారణ్యంబున నాహారార్థమయి నేను సంచరించు చుంటిని. అపు డొక కిరాతకుండు భార్యాసమానీతంబైన యన్నంబుచేతను, జలపానంబుచేతను, దృప్తుండై శీతల వృక్షఛాయలందుఁ గూర్చుండి మృగంబులను బక్షులను వధించుచు భార్యతోఁగూడ సూర్యరశ్మి సంతప్తుండై యాసంతాపమును సహింపఁ జాలక, నర్మదానదియందుండుఁ గపిలాసంగమంబున భార్యాసహితుండై స్నానం బాచరించి తనివితీర, జలంబులం గ్రోలి, భార్యతోఁగూడ శుద్ధచిత్తుండయ్యె. అవుడు కిరాత దంపతు లిరువురుఁ, గపిలాసంగమ ప్రభావంబుచే విగతపాపులయి, నేను జూచుచుండగా మత్పురోభాగంబున దివ్యదేహాన్వితులయి దివ్యవిమానము నధిష్ఠించి, స్వర్గలోకంబున కేగిరి. నీవు విచక్షణుండవు గావునఁ బ్రసాద సుముఖుండవై యీరెండు వృత్తాంతములను నాకు సవిస్తరముగాఁ జెప్పుమని సముజ్జ్వలుండు ప్రార్థించెను.

## ఇంద్రునకు సర్వతీర్థములు దర్శన మిచ్చుట

అపు డావాక్యములను విని కుంజరుండను వృద్ధశుకంబు పుత్రునితోఁ జెప్పుటకు నుపక్రమించెను. పుత్రకా! సకల సంశయచ్ఛేదకరంబును, బవిత్రంబును, బాప నాశకరంబును, నగు నీ వృత్తాంతమును జెప్పుచున్నాను సావధానుండవై వినుము.

పూర్వకాలంబున నారదుండు సకలతీర్థంబులను సేవించి స్వర్గలోకంబున కేగి యింద్రాది సురపూజితుండై యింద్ర దత్తంబైన సింహాసనంబునం గూరుచుండెను. అపుడు దేవేంద్రుండు మునివరా! మీర లెందుండి యిందుల కరుదెంచితి రనిన, నారదుండు సకలతీర్థంబులను సేవించి వచ్చితినని పలికెను. సకలతీర్థంబులలో నుత్కృష్ట తీర్థం బేది యనిన, సకల తీర్థంబులు పరమపావనంబులు గావున సమాన ఫలంబు కలవే యని పలికెను. అపు డింద్రుండు సకల తీర్థాభిమాన దేవతలను స్మరించెను. అటుపిమ్మట తీర్థంబులన్నియు మూర్తీభవించి కొన్నితీర్థంబులు కాంచన పుష్పమాలికలను పీతాంబరాభరణంబులను ధరించి, మఱికొన్ని తీర్థంబులు శుక్లమాల్యాంబరాభరణంబులను, ధరించి, సాక్షాత్కరించినవి. తదనంతరం బా దేవేంద్రుండు, మీలో మహాపాతకోపపాతకంబులను నశింపఁ జేయు తీర్థంబు లెవ్వియనిన, గొన్నితీర్థంబులు "మహాపాతకాది సర్వపాతకంబులను నశింపఁజేయుటకు బ్రహ్మదేవుండు గంగా ప్రయాగ తీర్థంబులను బుష్కరతీర్థంబును బ్రభాసతీర్థంబును సృజియుంచెను. ఆ నాలుగు తీర్థంబులు సకలదురితంబులను నశింపఁ జేయఁగలవు. మే మందఱము యుపపాతకంబులను మాత్రము నశింపఁజేయుదు"మని దేవేంద్రునితోఁ జెప్పినవి. అపుడు దేవేంద్రుండు మహా హర్షాన్వితుండై సకల తీర్థంబులను స్తుతిచేసి యాతీర్థదేవతలకు నమస్కారముచేసెను.

అటుపిమ్మట సకలతీర్థాభిమానదేవతలు నంతర్హితులయి స్వస్థలము నొందిరి. పిమ్మట నొకప్పుడు సహస్రాక్షుండహల్యాజారుండై యగమ్యాగమన పాతకంబుచే దుఃఖ

పీడితుం డగుచుఁ జిరకాలము తపం బాచరించెను. పిమ్మట మాళవదేశమందు సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వులు, దేవేంద్రునకు గంగా ప్రయాగ పుష్కర ప్రభాసతీర్థ పూరితంబులయిన సువర్ణ కలశంబులచే, వేదమంత్ర పూర్వకంబుగా నభిషేకము గావించిరి. అపుడు సహస్రాక్షుండు విగత పాపుండై సుప్రసన్నుండై తీర్థములలో సర్వోత్కృష్ట మహిమంబు మీకు సిద్ధింపఁగలదని యానాలుగుతీర్థంబులకు వరము నిచ్చెను. అనంతరం బాతీర్థంబులు, స్వస్థానంబున కరిగినవి. అదిమొదలుకొని యీనాలుగు తీర్థంబులు తీర్థరాజంబులని ప్రఖ్యాతిం బొందినవి. మాళవదేశంబుఁగూడ దేవేంద్రుని వర ప్రభావంబువలన, ధనధాన్య సమృద్ధంబయ్యె. ఇట్లుండగాఁ బాంచాలదేశమందు విదురుండను క్షత్రియుండు బ్రాహ్మణుని వధించి శిఖాయజ్ఞోపవీత వర్జితుండును, ఫాలప్రదేశమందుఁ దిలకవర్జితుండును, నగుచు, నేను బ్రహ్మహత్య చేసిన మహాపాతకుండనని సకలజనులకుఁ దెలియఁ జేయుచు గృహముల యందు భిక్షను యాచించు చుండెను. పిమ్మట పశ్చాత్తాప సంతప్తుండై తీర్థాటనమువలన బ్రహ్మహత్యా మహాపాతకంబు నశించునని విచక్షణులవలన దెలిసికొని నానాతీర్థంబులను సేవించెను. అయినను, బాపవిముక్తి నొందక యొకవృక్షచ్ఛాయ నాశ్రయించి దూయమాన మానసుండై తద్వృక్షమూలంబునఁ గూరుచుండెను.

అటుపిమ్మట మగధదేశ నివాసియు, ధనలోభంబుచే గురుఘాతకుండును నగు, చంద్రశర్మయను బ్రాహ్మణుండును, నగమ్యాగమనము నాచరించిన వేదశర్మయను బ్రాహ్మణుం

డును, సురాపాన మత్తుండై యొక గోవధ నాచరించిన వైశ్యుండును, దద్వృక్షమూలంబున కేగి, యొకరి వృత్తాంతము నొకరు తెలిసికొని, దుఃఖ నివృత్త్యుపాయంబు నెఱుంగక, పరితపించుచుఁ, దీర్థాటన క్రమంబుచేఁ గాలంజర పర్వత సమీప ప్రదేశంబు నొందిరి.

అటుపిమ్మటఁ గాలంజర పర్వత సమీపంబున సిద్ధ పురుషుండైన యొక మహాయోగీశ్వరుండు, వీరలకుఁ గనుపించెను. అపుడీ నలుగురును దత్సమీపంబున కేగి యతనికి నమస్కరించి, తమ వృత్తాంతంబును జెప్పి పాపవిముక్త్యుపాయమును బ్రార్థించిరి. అపు డతండు వారి మాటలవలనఁ దన్మన స్సంతాపమును దెలిసికొని, కృపార్ద్రహృదయుండై "గంగా ప్రయాగ పుష్కర ప్రభాసతీర్థంబులకుఁ జని మీరలు నలుగురు స్నానం బాచరించినయెడల, విముక్త పాపులయ్యెద"రని చెప్పి వారు చూచుచుండగ నదృశ్యుండయ్యె. అపుడు వీరు నలుగురుఁ దద్వచనము నాకర్ణించి, యా తీర్థరాజ సమీపంబున కేగి యచట యథావిధిగా స్నానం బాచరించి, విగత పాపులయి పరిశుద్ధులయిరి. పిమ్మట నా తీర్థరాజంబులు నాలుగు, వారి పాపంబులను వహించి, నీల చంచు చరణాన్విత హంస రూపంబులను దాల్చి, హంసరూపంబులయిన మఱికొన్ని తీర్థంబులతోఁగూడ మానస సరోవరంబున కేగి, యా సరోవరంబున నాలుగు తీర్థరాజంబులును స్వపాప విముక్తికొఱకై స్నానం బాచరించినవి. యా పాపమును నశింపఁ జేయలేక మానస సరోవరంబుఁగూడ లజ్జించుచు, శ్యామబృహచ్ఛాయ హంసరూపంబును దాల్చి యీ నాలుగు హంసలతోఁగూడ

బయలువెడలి నర్మదానదియందలి కపిలాసంగమంబున స్నానం బాచరించి, విగతపాపయైనది. ఇట్టి పాపనాశ సామర్థ్యము మానస సరోవరంబునకు లేకపోవుటంజేసి దానింజూచి యితర హంసలన్నియుఁ బరిహాసించినవి. ఈ నాలుగు తీర్థరాజంబులు మానస సరోవరంబుతోఁగూడ నర్మదానదియందలి కపిలా సంగమంబున స్నానం బాచరించుటచేత శుద్ధ స్ఫటిక సంకా శంబులై యితర హంసలతోఁగూడ నదృశ్యంబులై స్వస్థానం బున కేగినవి. పరమ పాపాత్ములయినను గిరాతక దంపతు లిరువురు విగతపాపులయి, దివ్యదేహంబుతో విమానము నధి ష్ఠించి స్వర్గలోకంబు నొందిరి. దానంజేసి నర్మదానదీ ప్రభా వంబు మిక్కిలి సర్వోత్కృష్టమయినది. ఈ నర్మదానదీ ప్రభా వంబును భక్తిశ్రద్ధలతో వినువా రశ్వమేధ ఫలంబు నొంది స్వర్గలోక సుఖంబు నొందఁగలరు.

## సుబాహువు చరిత్ర

అటుపిమ్మట వృద్ధశుకంబు విజ్వలుండను తృతీయ పుత్రుని బిలిచి, నీవు చూచిన యపూర్వవృత్తాంతమును జెప్పు మనిన, విజ్వలుండు వృద్ధశుకంబుతో నిట్లనియె.

మేరుపర్వత సమీపంబున, దివ్యవృక్ష సమాకీర్ణం బును, పుష్పఫల పల్లవ విరాజితంబును, సురముని సిద్ధ సాధ్య యక్షకిన్నర గంధర్వ సేవితంబును, ననేకరత్నరాజివిరాజమాన విమాన సంకులంబును, నప్సరోగణనృత్త గీత లయాన్వితం బును, శుక పిక శారికాది ధ్వనిసంకలితంబును, వాపీ కూప తటాక నదీప్రస్రవణ సంయుతంబును, నగు నానంద కాననంబు

గలదు. తత్సమీపంబున, కమలకల్హార నీలేందీవరాన్వితంబును, సుస్వాదు జలాన్వితంబును, హంస కారండవ జలకుక్కుటాన్వితంబును, నగు నొక సరోవరం బుండెను. నిరుపమాన వయోరూపలావణ్యాన్వితుండును, యక్షకిన్నరగంధర్వ సేవితుండును, సువర్ణ దండాలంకృత శ్వేతచ్ఛత్ర శోభితుండును, దివ్యస్త్రీ కరచారు చామరమరుత్సంవీజితుండును, నగు సుబాహువను నొక మహారాజు దివ్యమాల్యాంబరాభరణాలంకృతయు, పీన శ్రోణిపయోధరయు, రతీదేవి వలె సుందరాంగియు నగు భార్యతోఁగూడ, సువర్ణ ధ్వజపతాకాలంకృతంబును, హేమ కలశాన్వితంబును, నగు విమానవరంబు నధిష్ఠించి, యాసరోవర సమీపంబున కేగి, విమానవరంబునుండి యాదంపతు లిరువురుదిగి యాతటాక తీరమందున్న రెండుశవంబులం జూచి తత్సరోవరంబున స్నానం బాచరించి, పురుషశవంబును, బురుషుండును నతని భార్య స్త్రీశవంబును, శస్త్రంబుల ఛేదించి, తనివితీర భక్షణంబుగావించి, యథేచ్ఛగా సరోవరజలంబులం గ్రోలి క్షుత్పిపాసావిరహితులై ముహూర్తకాలం బచ్చట సుఖముగా విశ్రమించి, మరల వారిరువురు విమానారూఢులయి, స్వర్గలోకంబున కేఁగిరి.

ఈప్రకారముగాఁ బ్రతిదినమందు నాదంపతు లిరువురు నీసరస్తీరమున కరుదెంచి, శవమాంసమును భుజించి, జలపానంబుచేసి, మరల విమానారూఢులై స్వర్గలోకంబున కేఁగుచుండెడివారు. ఆ సరస్తీరమందుండు సకలజను లీవృత్తాంతము నవలోకించి హాహాకారము సేయుచు, నాసాగ్రన్యస్త తర్జనులై విస్మయావిష్ట చిత్తులయిరి.

అటుపిమ్మట విజ్జ్వలుం డాదంపతుల వృత్తాంతమును జెప్పుమనిన నావృద్ధశుకంబు విజ్జ్వలునితో నిట్లనియె.

పుత్రకా! యీ దంపతుల వృత్తాంతమును జెప్పుచున్నాను సావధానుండవై వినుము. ఈదంపతు లిరువురు భక్తిశ్రద్ధలతో నన్నోదక దానంబులను జేయక యతిథులను నిందించుచు, శాల్యన్న సూపాపూప దధిదుగ్ధ ఘృతంబులచే స్వశరీరమును బెంచుచుండిరి. బ్రాహ్మణులకొంటకు సగౌరవంబుగా నీయని దోషంబుచే మృష్టాన్నపుష్టస్వకళేబర మాంస భక్షణంబు చేయుచు, సకలలోక గర్హితులయిరి. సకల ప్రాణులకు స్వకృత శుభాశుభకర్మంబు సుఖదుఃఖ కారణంబు గావున, సకలజీవులు కర్మపాశబద్ధులై తత్ఫలము ననుభవించుచుందురు. శిల్పకారుండు మూషాసిక్త ద్రుతతామ్రాదుల కూటంబులను తన్నిభంబుగాఁ జేయు చందంబున సకలజీవులు, స్వకృత కర్మానుగుణంబుగా సుఖదుఃఖముల నొందుదురు. స్వభుక్త పదార్థానుసారముగా సంభవించు రూపంబు చందంబున, స్వకృత కర్మానుగుణంబుగా ఫలంబు సంభవించును. ఈలోకంబున యాగదాన హోమాది సుకృతకర్మంబుల నాచరించుటచే నిది కర్మభూమి యనియుఁ గర్మఫలానుభవంబుచే స్వర్గలోకంబు భోగభూమి యనియుఁ జెప్పంబడుచున్నది.

తొల్లి చోళదేశమందు గుణవంతుండును, రూపవంతుండును, బరాక్రమయుక్తుండును నగు సుబాహువను నొక భూపాలుండు గలఁడు. అతఁడు విష్ణుధ్యాన పూజావందనాదులచే విష్ణువు నారాధించుచు విష్ణుభక్తుండై యుండెడివాఁడు. యాగ దాన హోమాదుల నాచరించు సమయంబున, దేవ

బ్రాహ్మణభక్తిరహితుండై, దేవతలను నతిథులను గర్హిం
చుచు, నసూయాకలిత స్వాంతుండై యుండెడివాఁడు. అపుడు
పురోహితుండైన జైమిని, రాజుతో నిట్లనియె. ఓరాజేంద్రా!
నీవు భక్తిశ్రద్ధా రహితుండవై దానపాత్రులైన విప్రోత్తములను
గర్హించుచు నిచ్చుచున్నావు. ఇంద్రాదులకు భక్తిశ్రద్ధారహి
తుండవై పురోడాశాది హోమముల నాచరించుచున్నావు.
భక్తిశ్రద్ధారహితంబైన కర్మంబు నిష్ఫలంబు. ఇంద్రాది దేవ
తల నుద్దేశించి భక్తిశ్రద్ధలతోఁ జేయు యాగంబులును,
బ్రాహ్మణులకొఱకుఁ జేయు గోభూతిల హిరణ్యాన్నోదక దానం
బులును, నైహికసుఖంబును, స్వర్గలోక సుఖంబును గలుగఁ
జేయుచున్నవి. సత్పాత్రదానంబుచేత విద్యాలాభంబును,
యువతీజన సుఖంబును, వ్యాధినాశంబును, శత్రుజయంబును,
గలుగుచున్నవి. సకల జనులు లోభమోహావిష్టచిత్తులై కృషి
వాణిజ్య సేవాద్యనేక క్లేశములను సహించి, ధనమార్జించు
చుందురు. ఇట్లతి కష్టముచే సంపాదించిన ధనమును దానము
చేయుట మిక్కిలి దుష్కరంబు గావున లోభమోహంబులను
విడిచి భక్తిశ్రద్ధలతో నన్నోదకాదిదానంబులం జేయువా
రీలోకంబున, సకల భోగంబుల ననుభవించి, దానప్రభావంబు
చేతనే స్వర్గలోకంబునకేగి దివ్యభోగంబుల ననుభవించు
చుందురు. అన్నోదక దానంబులం జేయువారు, ప్రాణదానము
చేసి సకల ప్రాణులను బ్రతికింపఁ జేసినవారగుదురు. కాఁబట్టి
నీవనాదరమును విడిచి, భక్తిశ్రద్ధా సహితుండవై యన్నోదక
దానంబులను జేయుమని, జైమిని మహర్షి సుబాహు భూపా
లునితోఁ జెప్పి విరమించెను.

జైమిని సుబాహువునకు స్వర్గగుణంబులం జెప్పుట

అప్పుడు సుబాహు భూపాలుండు స్వర్గగుణంబులను నాకు బోధింపుమనిన జైమిని సుబాహువుతో నిట్లనియె. ఓరాజోత్తమా! స్వర్గగుణంబులను జెప్పుచున్నాను వినుము. స్వర్గలోకంబునందు పరమపావనంబులును, సర్వకామప్రదంబులును, నతిరమ్యంబులును నగు నందనాది వనంబులు గలవు. ఆవనంబులయందుఁ దరుణాదిత్య సంకాశంబులును, ముక్తాజాల పరివేష్టితంబులును, నప్సరోగణ సేవితంబులును, గామగంబులును నగు విమానంబులును, ననేక హేమశయ్యాసనంబులును గలవు. యాగ దాన హోమాది సుకృతకర్మముల నాచరించువారు సర్వదుఃఖ వర్జితులయి, కామ భోగముల ననుభవించుచుఁ దరుణార్క సన్నిభంబయిన కామగయానంబులందు సుఖముగా సంచరించు చుందురు. నాస్తికులును, స్వర్ణస్తేయాది మహాపాతకులును, నజితేంద్రియులును, క్రూరస్వభావముగలవారలును, భోగాయతనంబైన పాంచభౌతిక దేహమందహంకార మమకారాన్వితులును, కృతఘ్నులును దేవేంద్రలోకము నొందజాలరు. జరావ్యాధి మరణదుఃఖంబులును, శీతాతప క్షుత్పిపాసాది క్లేశంబులును, స్వేదగ్లాని మనస్సంతాపంబులును, నాలోకమం దెన్నడును సంభవింపవు. ఆలోకమందుండు ననేక గుణంబులను, జెప్పితిని. దోషంబులను జెప్పుచున్నాను వినుము.

నిత్యోపాసనాగ్న్యాధానజ్యోతిష్టోమాప్తోర్యామ పౌండరీకాది మహాక్రతువుల నాచరించినవారును, సర్వభూత దయా సత్యశౌచాన్వితులును, నిత్యాన్నదాతలును, వాపీకూప తటాక

దేవలయాది పుణ్యకర్మముల నాచరించువారును, బుణ్యకర్మ ముల తారతమ్యముచే నుత్కృష్టాపకృష్ట సుఖముల ననుభ వించు చుందురు. కావున నధికపుణ్య ఫలము ననుభవించువారిని జూచి స్వల్పపుణ్యఫలము ననుభవించువారు, రాగద్వేష దూషితస్వభావాన్వితులయి, మనస్తాపము నొందుచుందురు. ఫలతారతమ్యంబుచే హర్ష విషాదంబులును, బతనభయంబుచే శోకంబును, దల్లోక నివాసులకు సంభవించుచున్నవి. భూలో కంబు గర్మభూమియనియు, స్వర్గలోకంబు భోగభూమియనియుఁ జెప్పంబడు. ఆకారణంబుచేఁ గర్మభూమియందు గర్మాచరణం బును, భోగభూమియందు దివ్యభోగానుభవంబును, విహితంబు లని తెలిసికొనవలెననిన, నపుడు జైమిని వచనముల నారాజ న్యుండు విని, రాగద్వేషాది రహితంబయిన శాశ్వత లోకం బును జెప్పుమనిన, జైమిని యారాజేంద్రునితో నిట్లనియె.

ఓ రాజోత్తమా! స్వర్గాది లోకంబు లన్నియు రాగ ద్వేషాది దోషాన్వితంబులగుటచే విచక్షణు లాలోకంబుల నొందుటకుఁ బ్రయత్నింపరు. స్వర్గాది లోకంబులకు నుపరిభా గంబున,సనాతనంబును, జ్యోతిర్మయంబును, బరమాత్మరూపం బును నగు, మహావిష్ణు లోకంబు గలదు. అహంకార మమ కార వర్జితులును, గామక్రోధ లోభ మోహ దంభాసూయాది వర్జితులును, విష్ణుధ్యాన పూజావందనాదుల నాచరించువారును దల్లోకంబున నివసించి పునరావృత్తి వర్జితంబైన మోక్షసుఖంబు నొందగలరు. ఇట్లు నీ వడిగిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబు చెప్పితి ననిన, జైమినితో సుబాహు భూపాలుం డిట్లనియె. భక్తిశ్రద్ధలతో యాగదాన హోమాదుల నాచరించువారు

స్వర్గలోకంబు నొంది దివ్యభోగంబుల ననుభవించిన పిమ్మటఁ బుణ్యక్షయంబుచేఁ బతనంబు నొందఁ గలరు. ఫలాసక్తిచేఁ గర్మాచరణంబు, పతన కారణంబు. కావున నేను ఫలము నపేక్షించి భక్తిశ్రద్ధాన్వితుండనై కర్మముల నాచరింపను, ఫలేచ్ఛారహితుండనైనను, సాదరంబుగాఁ విహితకర్మంబుల నాచరించు పురుషుండు, బద్ధుండగు. దానం జేసి ప్రవృత్తి మార్గమం దాదరమును బరిత్యజించి శ్రీపతియు, యజ్ఞపురుషుండును నగు మహావిష్ణువును ధ్యానయోగముచే సాదరంబుగా భజించి విష్ణులోకంబు నొందఁగల ననిన, జైమిని యా రాజన్యునితో నిట్లనియె.

పూర్వకాలమం దనేక రాజన్యులు భక్తిశ్రద్ధలతో యాగ దాన హోమాదులను, ఫలకామనా రహితులయి, యాచరించి సాదరముగా నింద్రాది దేవతలకు హవిర్భాగముల నొసంగి శుద్ధచిత్తులయి స్వర్గాది లోకంబుల నొందిరి. అనేక మహాదాతలు, భక్తిశ్రద్ధలతో బ్రాహ్మణులకు నన్నోదక దానంబులను, గో భూ తిల హిరణ్యదానంబులను జేసి తద్దాన ప్రభావంబుచే స్వర్గలోకంబున దివ్యమాల్యాంబరాభరణాలంకృతులయి, క్షుత్పిపాసాది దుఃఖవిరహితులయి, దివ్యభోగంబుల ననుభవించిరి. సకలవేదంబులును, బ్రాహ్మణులును, నింద్రాది దేవతలును, మహావిష్ణు స్వరూపంబు గావున, వేదవిహితంబులయిన యాగంబుల నాచరించి యజ్ఞపురుషు నారాధింపవలెను. బ్రాహ్మణుల నన్నోదక దానంబులచేతను, నింద్రాది దేవతలను హవిర్భాగంబులచేతను బూజింపవలెను. అట్లు పూజించిన యెడల మహావిష్ణువు పూజితుండై వైకుంఠలోక సుఖమును

గలుగఁ జేయును. ఇట్లు చేయనివారు క్షుత్పిపాసా పీడితులయి మనస్సంతాపము నొందగలరు. ఓ రాజేంద్రా! నీవును బ్రాహ్మణులకొఱకు భక్తిశ్రద్ధలతో ననోదక దానంబులను జేసి నింద్రాదుల కొఱకు హవిర్భాగంబులను సాదరంబుగా నిచ్చి, యా సుకృతంబువలన జ్ఞానంబును, జ్ఞానంబువలన వైకుంఠలోక సుఖంబును, బొందఁగలవని జైమిని సుబాహు భూపాలునితోఁ జెప్పి విరమించెను.

## సుకృత దుష్కృత ఫలములు

అటుపిమ్మట సుబాహురాజేంద్రుండు నరకదుఃఖ సాధనంబైన పాపకర్మంబుల నాచరించుచు వారిని, స్వర్గసుఖ సాధనంబైన పుణ్యకర్మముల నాచరించువారిని, జెప్పు మనిన జైమిని యారాజన్యునితో నిట్లనియె. లోభ మోహావిష్ట చిత్తులయి పరమపవిత్రమయిన బ్రాహ్మణ్యమును విడిచి నింద్యకర్మంబులచే జీవించువారును, నాస్తికులును, వర్ణాశ్రమ ధర్మంబులను బరిత్యజించువారును, నిరంతర కామాకులితస్వాంతులయి స్త్రీలయం దతిమోహము కలవారును, దాంభికులును కృతఘ్నులును నరకదుఃఖము నొందెదరు. బ్రాహ్మణులకొఱకుఁ బ్రతిజ్ఞాతంబైన ధనము నీయనివారును, పరస్త్రీ పరధనముల నపహరించువారును, కలహ సంపాదకమైన వచనములను జెప్పి భేదమును గలుగఁజేయువారును, బరుల భార్యా పుత్ర క్షేత్ర విత్తాది సంపదలను జూచియు సహనముచేఁ బరితపించువారును, పరనిందా పరహింసా రతులును నరకదుఃఖము నొందఁ గలరు. వాపీ కూప తటాకారామంబులను, పానీయ శాలలను, పాడు

చేయువారును, భార్యాపుత్త్రాదులను బరిత్యజించినవారును నతిథులను, వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణులను, బూజింపనివారును, దేవతలను బిత్రుదేవతలను హవ్యకవ్యంబులచే నారాధింపని వారును, శివకేశవులను సమబుద్ధితో ధ్యాన పూజావందనాదులచే సేవింపని వారును, శుద్ధచిత్తులును, యౌవన రూపలావణ్యాన్వితులును నగు కులస్త్రీలను బలాత్కరించువారును, గురువులను సాధువులను నిందించువారును, కాష్ఠ పాషాణ కంటకాదులచేతను మార్గావరోధము గలుగఁ జేయువారును, సదాచారమును బరిత్యజించి సర్వవర్ణముల యందు భుజించువారును, వస్త్రశస్త్రాదులను విక్రయించు వారును, వృద్ధుండును ననాథుండును విష్ణుభక్తుండును దీనుండును రోగార్తుండును నగు సత్పురుషుని ధనసంపన్నులయి, సమర్థులయి యుండియు, దయతోఁజూచి రక్షింపని వారును, నిరయంబుల నొందఁగలరు.

ఓరాజోత్తమా! పిమ్మట స్వర్గలోకంబు నొంది దివ్య భోగంబుల ననుభవించు వారినిఁ జెప్పెదను వినుము. దయా సత్య శౌచములు గలవారును, గో భూతిల హిరణ్యాది దానంబులం జేయువారును, నిత్యనైమిత్తిక కర్మంబుల నాచరించు వారును, బరహింసా వర్జితులును, దుష్టప్రతిగ్రహ నివృత్తులును, భక్తిశ్రద్ధలతోఁ దల్లిదండ్రులను గురువులను సత్పురుషులను బూజించు వారును, స్వర్గలోకంబు నొంది దివ్యభోగంబుల ననుభవింపఁగలరు. శత్రువులనుగూడ నిందింపనివారును, బరశ్రేయస్సహనము గలవారును, వ్యాస వసిష్ఠపరాశరాది స్మృత్యుక్త ధర్మంబుల నాచరించువారును, శివకేశవాది

దేవతలను ధ్యానపూజా వందనాదులచే నారాధించువారును, సకలదివసంబులను సత్కర్మంబులచేతను, శివకేశవ కథాశ్రవణ కీర్తనంబులచేతను, సఫలముచేయువారును, భయసంత్రస్థులయిన బ్రాహ్మణులను, స్త్రీలను, రక్షించువారును, ముందుగా గ్రహించిన నియమమును నజితేంద్రియులయి పరిత్యజింపని వారును, జితేంద్రియులును, శాంత చిత్తులును, యూకమశక మత్కుణ హింసావర్జితులును, గయాప్రయాగ గంగాపుష్కరాది తీర్థములయందుఁ దీర్థశ్రాద్ధంబుల నాచరించి పితృదేవతలకుఁ బిండదానము చేయువారును, స్వర్గలోకంబు నొందఁగలరు. ఓరాజోత్తమా! సుకృత దుష్కృత కర్మంబులవలనఁ గలిగెడు సుగతిని దుర్గతిని నీకు బోధించితి నని చెప్పి, జైమిని విరమించెను.

## దేవతలను పితృదేవతలను బ్రాహ్మణులను పూజింపకపోవుటచేఁ గలుగు ఫలము

అటుపిమ్మట నారాజేంద్రుండు జైమిని చెప్పిన ధర్మాధర్మగతినిఁ దెలిసికొని యాజైమినితో నిట్లనియె. ఓ విప్రోత్తమా! భక్తిశ్రద్ధలతో బ్రాహ్మణుల కొఱకు నన్నోదక దానంబులను, నింద్రాదిదేవతలకొఱకు హవిర్భాగ హోమంబులను, నే నాచరింపను. వివిధ యజ్ఞంబులచేతను, ధ్యాన పూజావందనాదులచేతను, సకల జగత్కారణుండైన వాసుదేవుని సేవించి, విష్ణులోకము నొందఁగలనని తలంచి, తన జీవిత కాలమందు భార్యతోఁగూడ మధుసూదను నారాధించి మరణము నొందిన పిమ్మట నాదంపతు లిరువురు దివ్యమా

ల్యాంబరాభరణాలంకృతులయి, వ్యోమయానము నధిష్ఠించి వైకుంఠలోకంబున కరిగిరి.

అటుపిమ్మట నారాజేంద్రుండు భార్యతోఁగూడ, క్షుత్పిపాసాపీడితుండై, మహావిష్ణు సందర్శనశూన్యుండగుచు, మహాశోకాకులిత స్వాంతుండై, భార్యతో నిట్లనియె. సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వులచేత సంస్తూయమానుండనై విమానవరము నధిష్ఠించి వైకుంఠ లోకమందంతటను దిరిగితిని. క్షుత్పిపాసలు తీవ్రముగా వృద్ధినిబొందుచున్నవి. వైకుంఠలోకంబునకుఁ జను దెంచినను,మహావిష్ణు సందర్శనముగాదయ్యె. మహావిష్ణ్వారాధనంబువలన గూడ సంపూర్ణముగా ఫలము లభింపదయ్యె. నేనేమి చేయుదు ననిన, నా రాజన్యునితో రాజభార్య యిట్లనియె.

ఓ ప్రాణనాథా! నాకుఁగూడ క్షుత్పిపాసలచే నధిక దుఃఖము కలుగుచున్నది. విప్రోత్తముల కొఱకు నాదరపూర్వకంబుగా నన్నోదకములను నీయని కారణంబుచే, మనకీ దుఃఖము సంభవించెనని తలంచు చుంటినని, యారాజభార్య చెప్పెను. అపు డారాజన్యుండు, మిక్కిలి పరితపించుచు, వైకుంఠలోకమునుండి భార్యతోఁగూడ బయలువెడలి, దివ్య వృక్ష సమాకీర్ణంబును, బుణ్యతోయ పరిపూరిత సరోవరాన్వితంబును, బహుపుష్ప ఫలోపేతంబును, బక్వఫల కదళీవన పరివేష్టితంబును నగు నందనోద్యానవనంబునం బ్రవేశించి, సూర్యసన్నిభుండును బ్రహ్మవర్చసంబుచే భాసమానుండును, మధుసూదన పదారవింద మకరంద రసాస్వాద తుందిలస్వాంతుండును, యోగాసనాసీనుండును, నగు వామదేవుండను

మహర్షి నవలోకించి, యతనికి భార్యతోఁగూడ నమస్కరించి, పాద్యార్ఘ్యములచేఁ బూజితుండై యారాజన్యుండు తదనుజ్ఞచే సముచితాసనమందుఁ గూర్చుండెను. అటుపిమ్మట వాసుదేవుండు చోళదేశ నివాసియైన సుబాహువను భూపాలునిగా దివ్యదృష్టిచేఁ దెలిసికొని, నిరామయుండవై భార్యతోఁగూడ సుఖముగా నుంటివిగదా యని యడిగెను. పిమ్మట నారాజన్యుండు తద్వచనముల నాకర్ణించి, మీయనుగ్రహంబుచే భార్యతోఁగూడ నిరామయుండనై యుంటిని. కమలాప్రియుండైన జనార్దను నతిభక్తితో నారాధించి వైకుంఠలోకంబున కేగితిని. అచ్చట మహావిష్ణుం డదృశ్యుండయ్యె. నేను భార్యతోఁగూడ దారుణంబైన క్షుత్పిపాసలచేఁ గడుదుఃఖము నొందుచుంటిని. నీవు ప్రసాదసుముఖుండవై తత్కారణంబును నాకు బోధింపుమనిన, నారాజన్యునితో వాసుదేవుం డిట్లనియె.

ఓరాజోత్తమా! నీవు పరమభక్తితో భార్యతోఁగూడ మధుసూదను నారాధించితివి. తదారాధనప్రభావంబుచే మీరలిరువురు దివ్యమాల్యాంబరాభరణాలంకృతులరై వైకుంఠలోకంబు నొందినను, విష్ణుకలారూపంబులైన దేవబ్రాహ్మణులను, బిత్రుదేవతలను, భక్తిశ్రద్ధలతో హవ్యకవ్యాది దానంబులచే నారాధింపక పోవుటచేత, విష్ణుప్రధానాంగములను దిరస్కరించిన వారలయితిరి. ఆకారణంబుచే విష్ణుసందర్శనవిహీనులరై దారుణంబైన క్షుత్పిపాసలవలన దుఃఖించుచుండిరి. గో భూ తిల హిరణ్యాది దానంబులను, నన్నోదకదానంబులను, మృత్యుకాలమందు గోభూతిల హిరణ్య రజతాది దానంబులను, నాచరించువారు దేవలోకంబులయందును, బ్రహ్మవిష్ణు

శివ లోకముల యందును. నానావిధ దివ్యభోగంబుల ననుభ వించుచు సుఖముగా నివసించెదరు. మృష్టాన్నమును భక్షించి నీశరీరమును బోషించుచు నీవు రాగద్వేష యుక్తుండవై దేవతలను, బ్రాహ్మణులను, పితృదేవతలను హవ్యకవ్యంబులచే భక్తిశ్రద్ధలతో నారాధింపని వాఁడవైతివి. దానంజేసి నీవు క్షుత్పిపాసలచేఁ గడుదుఃఖమును బొందుచున్నావు. కావున నీవు భార్యతోఁగూడ స్వర్గమునుండి బయలువెడలి, నీ శరీర పతన ప్రదేశము నొంది, మీరిరువురు శస్త్రములచేఁ బురుష శరీరమును నీవును, స్త్రీశరీరమును నీభార్యయు, ఛేదించి యా శరీర మాంసమును భక్షించిన యెడల మీ దంపతులకు క్షుద్బాధా నివృత్తికాగలదు. స్వకృతకర్మఫలం బెవరికి ననుభ వింపక తీరదనిన, నావాక్యములను విని, యారాజన్యుండు వామదేవునితో నిట్లనియె.

ఓ వామదేవా! మే మెంతకాలము స్వశరీర మాంస మును భుజింపవలెనో, తత్కాల ప్రమాణమును జెప్పుమనిన, నా మాటను విని వామదేవుండు సకల పాపనాశకరంబైన వాసుదేవ స్తోత్రము నెపుడు వినగలవో, తత్కాలమందు మోక్షము నొందగలవని చెప్పి విరమించెను. అది మొదలు కొని భార్యతోఁగూడ స్వశరీర మాంసమును భక్షించుచుం డెను. ఆ కళేబరములు రెండును బ్రతిదినమందు వారు వచ్చు సమయమునకు మరల మాంసపూరితంబులై యుండెడివి. ఈ భూపతి చరితంబును నింద్రాదిదేవతలు చూచి పరిహసించు చుండెడివారు. ఈ ప్రకారముగా నూఱు సంవత్సరములు గడ చిన పిమ్మట నా రాజన్యుండు, లోభ మోహముల చేత నిం

ద్రాదిదేవతలను, బ్రాహ్మణులను, పితృదేవతలను, భక్తి శ్రద్ధలతో నారాధింప నైతినని, పశ్చాత్తాపము నొందుచుండెడి వాఁడు. అపుడు విజ్జ్వలుండు సుబాహువృత్తాంతము నిట్లు, తండ్రివలనఁ దెలిసికొని, విష్ణుపద ప్రాపకంబగు వాసుదేవ స్తోత్రమును జెప్పుమనిన, వృద్ధశుకంబు వాసుదేవునకు నమస్కరించి, హృదయాంబుజంబునందు, శ్రీనాథుని స్మరించుచునా వాసుదేవస్తోత్రమును విజ్జ్వలునకు నుపదేశించెను.

## వామదేవుఁడు సుబాహువునకు వాసుదేవ స్తోత్ర ముపదేశించుట

అటుపిమ్మట విజ్జ్వలుండు తండ్రివలన వాసుదేవ స్తోత్రమును విని, తండ్రియనుజ్ఞను బొంది యాకాశ మార్గంబున కెగిరి, పరమపావనంబైన యానంద కాననంబునం బ్రవేశించి, సుబాహు విమానాగత సమయంబును బ్రతీక్షించుచు, నొక వృక్షచ్ఛాయ నాశ్రయించి యుండెను. అపుడు యక్ష కిన్నర గంధర్వ సహితంబును, నప్సరోగణ సంకీర్ణంబును, కింకిణీజాల మండితంబును నగు విమాన వరంబు నధిష్ఠించి, భార్యతోఁ గూడ నీయరణ్యంబునకు జనుదెంచి విమానవరమునుండి దిగి శవమాంస భక్షణంబుకొఱకుఁ బ్రయత్నించు రాజేంద్రు నవలోకించి, ఓరాజోత్తమా! నీవతిగర్హితంబైన మాంసభక్షణంబు కొఱకుఁ బ్రయత్నించు చుంటివేమి. నీచే సమలంకృతంబైన దేశంబేది. నీనామంబెయ్యది. యనిన నాశ్చర్య భరిత హృదయుండై "యింతవఱకు నన్నుఁజూచి నాతో సంభాషించు వారెవరును లేరు. ఈ పక్షిరూపధరుండైన మహామహుండింద్ర

యమ వరుణ కుబేరాదులలో నెవరైన నొకరు కావలెను. తదితరులు గారని" భార్యతోఁ జెప్పి యపు డారాజేంద్రుండు బద్ధాంజలి పుటుండై నమస్కరించుచు, నాపక్షిశ్రేష్ఠంబుతో నిట్లు పలికెను.

ఓమహాత్మా! నీవు పక్షిరూపంబును ధరించి నాభాగ్యవశంబుచేఁ జనుదెంచిన జ్ఞానసిద్ధుండవు. నను రక్షింపుమని ప్రార్థించి, సుబాహువు సమగ్రంబుగా తనవృత్తాంతమును విజ్జ్వలునితోఁ జెప్పి, నీవృత్తాంతమును జెప్పుమనెను. పిమ్మట విజ్జ్వలుండు తద్వృత్తాంతమును విని కృపార్ద్ర హృదయుండై నేను నర్మదాదక్షిణ కూలమందుండు వటవృక్షమందు నివసించిన విజ్జ్వలుండను పక్షిశ్రేష్ఠుండను. నీ వృత్తాంతమును మాతండ్రివలనఁ దెలిసికొని, నీదుఃఖవిముక్తికొఱకు వాసుదేవస్తోత్రమును నీకుఁ జెప్పుటకై మాతండ్రి యనుమతిని గైకొని, యిచటకుఁ జనుదెంచితిని. ఆస్తోత్రమును జెప్పుచున్నాను సావధానుండవై వినుము.

అస్య శ్రీ వాసుదేవస్తోత్ర మహామంత్రస్య, నారదఋషిః, అనుష్టుప్ఛందః. పరమాత్మా దేవతా, దురితక్షయ ద్వారా చతుర్విధ పురుషార్థసిద్ధ్యర్థే, పారాయణె వినియోగః. ఓంనమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ పరమం పావనం పుణ్యాం వేదజ్ఞం వేదమందిరం
విద్యాధారం మఖాధారం, ప్రణవం తం నమామ్యహం॥ ౧

శ్లో॥ మహాకాంతం మహాత్మానం, మహామోహ వినాశకం
స్రష్టారం సర్వవిశ్వస్య, గుణాతీతం నమామ్యహం॥ ౨

శ్లో॥ తారకం సర్వలోకానాం, నౌరూపేణ విరాజితం
సంసారార్ణవ మగ్నానాం, నమామి ప్రణవంహరిం॥ ౩

శ్లో॥ యస్యమాయాం ప్రవిష్టాస్తు, బ్రహ్మాద్యాశ్చ సురాసురాః
నవిందంతి పరం శుద్ధం, మోక్షద్వారం నమామ్యహం॥ ౪

శ్లో॥ ఆనందకందాయ చ కేవలాయ
శుద్ధాయహంసాయ పరావరాయ
నమోస్తు తస్మై గుణనాయకాయ
శ్రీ వాసుదేవాయ మహాప్రభాయ॥ ౫

శ్లో॥ శ్రీ పాంచజన్యేన విరాజమానం
రవిప్రభేణాపి సుదర్శనేన
శ్రీనందకేనాపి విరాజమానం
విష్ణుం సదైవం శరణం ప్రపద్యే॥ ౬

శ్లో॥ అచింత్య మవ్యక్త మనంత మాద్యం
శ్రీశం మహేశం జగదాది హేతుం
సర్వేశ్వరం సర్వగతం వరేణ్యం
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౭

శ్లో॥ ఏకార్ణవే నౌరివవిద్యమానో
బిభర్తిలోకాన్ సచరాచరాంశ్చ
అంతర్గతో లోకమయస్సదైవ
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౮

శ్లో॥ యః కేవలో జ్ఞాన మయశ్చ శుద్ధో
విద్యోతమానో రవి తేజసోర్ధ్వం

రాత్రౌ క్షపానాథమయో మహాత్మా
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౯

శ్లో॥ దైత్యాంతకం దుఃఖ వినాశమూలం
శాంతం పరం శక్తిమయం విశాలం
సంప్రాప్య దైత్యావిలయం ప్రయాంతి
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౧౦

శ్లో॥ అంభోధిమధ్యే శయనంహి యస్య
నాగాంకభోగే శయనే విశాలే
శ్రీః పాదపద్మద్వయ మేవ సేవతే
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౧౧

శ్లో॥ దేవై స్సుసిద్ధై ర్మునిభి స్సదైవ
నుతం సుభక్త్యా హ్యురగాధిపైశ్చ
తత్పాదపంకేరుహ మేవ పుణ్యం
శ్రీవాసుదేవస్య నమామి నిత్యం॥ ౧౨

శ్లో॥ యస్యాపి పాదాంభసి మజ్జమానాః
పూతా దివంయాంతి వికల్మషాస్తే
మోక్షం లభంతే మునయః ప్రహృష్టా
స్తం వాసుదేవం శరణం ప్రపద్యే ॥ ౧౩

శ్లో॥ పాదోదకం తిష్ఠతి యత్రవిష్ణో
ర్గంగాది తీర్థాని సదైవ తత్ర
త్యజంతి ప్రాణాంశ్చ విపాపదేహాః
ప్రయాంతి శుద్ధా స్స్వగృహం మురారేః॥ ౧౪

శ్లో॥ పాదోదకేనా ప్యభిషిచ్య మానా
అప్యుగ్రపాపైః పరిలిప్త దేహాః
తే యాంతి ముక్తిం పరమేశ్వరస్య
తస్యైవ పాదౌ సతతం నమామి॥ ౧౫

శ్లో॥ నైవేద్య మాత్రేణ సుభక్షితేన
సుచక్రిణ స్తస్య మహాత్మనశ్చ
తే వాజపేయస్య ఫలం లభంతే
సర్వార్థయుక్తా శ్చ నరాభవంతి॥ ౧౬

శ్లో॥ నారాయణం దుఃఖవినాశకం తం
మాయావిహీనం సకలం గుణజ్ఞం
యం ధ్యాయమానా స్సుగతిం వ్రజంతి
తం వాసుదేవం శరణం ప్రపద్యే॥ ౧౭

## వాసుదేవ స్తోత్ర శ్రవణ ఫలము

ఇత్తెఱంగునఁ బరమపవిత్రంబును సకల పాపహారంబును గల్యాణప్రదంబును నగు వాసుదేవ స్తోత్రమును భక్తిశ్రద్ధలతో నారాజన్యుండు భార్యతోఁగూడ విని విగతపాపుండై, క్షుత్పిపాసారహితుండగుచు సుఖవంతుండై, యాలక్ష్మీపతి నతి భక్తితో హృదయకమలంబున ధ్యానించెను. అపుడు శ్రీనాథుండు శంఖ చక్ర గదాపద్మధరుండును, నీలేందీవర శ్యాముండును, పీతకౌశేయాంబర ధరుండును, వ్యాసవసిష్ఠ గర్గపరాశర శాక్యవనారదవాల్మీకి జాబాలిప్రముఖ బ్రహ్మర్షి సంస్తూయమానుండును, శ్రీవత్సకౌస్తుభ విరాజిత వక్షుండును మహా

లక్ష్మీసహితుండును, గరుడాసనాసీనుండును, బ్రహ్మేంద్ర రుద్ర సురసిద్ధ సాధ్య యక్షకిన్నర గంధర్వాగీయమానుండును, నగుచు నారాజన్యునకుఁ బ్రసన్నుండై మేఘగంభీరమైన వాక్కు చేత నోరాజేంద్రా! నీవు విగతపాపుండవైతివి. నీకు నభీష్టంబైన వరము నొసంగెదఁ గోరుమని పలికెను.

అపు డారాజన్యుం డనంతకల్యాణ గుణపరిపూర్ణంబైన భగవంతుని దివ్యమంగళ విగ్రహము నవలోకించి, యానందాశ్రు పరిపూరిత లోచనుండై సాష్టాంగ దండప్రణామము గావించి, యోపరమేశ్వరా! నీవు శరణాగతరక్షకుండవు. నేను శరణాగతుండను, దాసుండను. నీదర్శనంబుచే నేను ధన్యుండనైతిని. భార్యతోఁగూడ నన్నును విగతపాపునిం జేసి, సకల దుఃఖములం బోగొట్టి రక్షింపుమని ప్రార్థించి, నాకీఁదగిన వరమును ముందుగా విజ్జ్వలునకిమ్మని ప్రార్థించెను. పిమ్మట భగవంతుం డావచనముల నాకర్ణించి యారాజేంద్రునితో నిట్లనియె.

ఓరాజేంద్రా! యావిజ్జ్వలునిఁ దండ్రియగు కుంజరుండు మిక్కిలి జ్ఞానవంతుండు గావున నన్నుఁ బ్రతిదినమందును నీ వాసుదేవ స్తోత్రముచే నారాధించు చుండును. అందువలన స్వల్పకాలములోనే, భార్యాపుత్రాన్వితుండై నన్నుఁ బొందఁ గలఁడు. ఈవాసుదేవ స్తోత్రమును గృతయుగమందుఁ బఠించు వారు తత్క్షణమందే విముక్తి నొందఁగలరు. త్రేతాయుగమందు మాసమాత్రము చేతను, ద్వాపరమందు మాసషట్కముచేతను గలియుగమం దొకవత్సరంబుచేతను, పరమసిద్ధిం బడయుదురు. బ్రాహ్మణుం డేకకాలమందుగానిఁ, ద్రికాలమందుగానిఁ బఠిం

చిన సర్వకామార్థంబులను, క్షత్రియుండు శత్రుజయంబును, వైశ్యుండు ధనసమృద్ధిని, శూద్రుండు సుఖమును బొందఁగలరు. శ్రాద్ధకాలమునందు బ్రాహ్మణులు భుజించు సమయంబున నీవాసుదేవస్తోత్రమును జపించిన యెడలఁ, బితృదేవతలు తృప్తులయి విష్ణులోకము నొందెదరు. పెక్కుమాటలేల, సకల సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వాదులందఱును, నీ వాసుదేవస్తోత్రముచే నభీష్టసిద్ధి నొందిరి. కామక్రోధ వర్జితులయి, జితేంద్రియులయి నన్ను నారాధించు మానవులు, బ్రహ్మహత్యాది మహాపాతక విముక్తులయి, దాహప్రళయ వర్జితంబైన నాలోకంబు నొందగలరని చెప్పి, భార్యతోఁగూడ నీవు నా లోకంబు నొందుమని హస్తావలంబనము నిచ్చి వైకుంఠమునకు దీసికొని వెళ్లెను. సుర ముని సిద్ధ సాధ్యులందఱును నపుడు జనార్దనుని స్తుతిచేసిరి. దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వు లతిలలితంబుగా గానము చేసిరి. అప్సర స్త్రీలు నృత్యము గావించిరి. దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి.

అటుపిమ్మట విజ్జ్వలుం డతిసంభ్రమంబుతో నర్మదా దక్షిణ కూలంబునకుఁ జనుదెంచి, తల్లిదండ్రులకు నమస్కరించి వాసుదేవస్తోత్ర మహిమంబువలన సుబాహు భూపాలుండు, భార్యతోఁగూడ క్షుత్పిపాసారహితుండై వైకుంఠ లోకంబున కేగెనని వారితో నీవృత్తాంతమును జెప్పెను. కుంజలుండు భార్యా పుత్రులతోఁ గూడఁ దద్వృత్తాంతము నాకర్ణించి, యమందానంద భరితహృదయుండై, పుత్రుని గాఁగిలించుకొని, యో పుత్రకా! నీవు వాసుదేవస్తోత్రమువలన రాజేంద్రునకు మహోపకారమును గావించితి వని శ్లాఘించి, యాశీర్వ

డించి యతిరమ్యంబైన యా వటవృక్షమందు భగవంతుని హృదయకమలంబున ధ్యానించుచు, సుఖముగాఁ గూరుచుం డెను. ఇత్తెఱంగున నీ కుంజరవృత్తాంతమును మహావిష్ణువు వలన వేనభూపాలుండు విని, యీ కథామృతము నెంతగ్రోలిన నాకుఁ దనివి లేకున్నది. ఈ కథాశ్రవణ కుతూహాల ముప్పతిల్లుచున్నది. కావున కుంజర చతుర్థ తనయుండైన కపింజ లుండు చెప్పిన వృత్తాంతమును జెప్పుమనిన నపుడు మహా విష్ణువు కపింజలోక్త వృత్తాంతమును జెప్పుట కుపక్రమించెను.

## అశోకసుందరి చరిత్ర

ఓ వేనభూపాలోత్తమా! కపింజలోక్త వృత్తాంతమును భక్తిశ్రద్ధలతో వినువారు, గోసహస్ర దానఫలము నొందఁ గలరు. తద్వృత్తాంతమును నీకుఁ జెప్పుచున్నాను సావధాన చిత్తుండవై వినుము.

తదనంతరం బాకుంజరుండు చతుర్థ తనయుండైన కపింజలుని బిలిచి నీవెక్కడెక్కడ సంచరించితివి. ఎట్టి యపూ ర్వవృత్తాంతమును జూచితి వనినఁ, గపింజలుండు తల్లిదండ్రుల లతో నిట్లనియె. మీరలు పూజ్యులు గావున మీకు నమస్కా రము గావించి, నేను జూచిన యపూర్వవృత్తాంతమును జెప్పు చున్నాను. మీరలు సావధానచిత్తులరై వినుండు. నానా ధాతు సమాకీర్ణంబును, దివ్యవృక్ష విరాజితంబును, గంగాజల ప్రవాహాన్వితంబును, నదీసహస్ర సంకులంబును, నానారత్న సమన్వితంబును, చంద్రమండల సన్నిభంబును, శుద్ధస్ఫటిక సంకాశంబును నగు కైలాసంబను పర్వతశ్రేష్ఠంబు కలదు.

ఆ పర్వతమందలి వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత పద్మరాగ మౌక్తికమయ సప్తప్రాకార పరివేష్టితంబును, స్ఫటికమయ కుడ్యాన్వితంబును, పద్మరాగ మణిమయ సోపానాన్వితంబును, స్యమంతకమణిబద్ధవిహారదేశాన్వితంబును మరకతరత్న తోరణసమంచితంబును, నానావిధ రత్నమయ కవాట దేహళీవిరచితంబును, నవరత్న శోభిత తప్తజాంబూనద మయంబునునగు దివ్యభవనమధ్యంబునఁబార్వతీపరమేశ్వరులు, సంతత భజనపరాయణులును, సుందరీ సహచరులును, నగు వైమానికుల పూజావందనాదులను గ్రహించుచు, ననవరతానందమయులై యుండిరి. అచ్చట నుమామహేశ్వర పాదారవింద సేవాపదిలబ్ధ నవరత్నపరిశోభిత హేమమయ విమానారూఢులై, విహరించు శివభక్తజనసేవితంబును, ననేక కామధేను కల్పవృక్ష చింతామణి సమలంకృతంబును, సర్వర్తుధర్మాన్వితంబును, సౌగంధిక నామంబున నభిరామంబై తేజరిల్లు నొక యుద్యానవనంబు గలదు.

అచ్చట మేరుపర్వత శిఖరమునుండి కైలాస పరిసర భూమియందుఁ బ్రవహించు విమల పుణ్యజలప్రవాహాన్వితంబును, దశయోజన విస్తీర్ణంబును, దివ్యహంసాన్వితంబును, నగు మహాహ్రదం బొకటి కలదు. తత్తీరమందలి శిలోపరి భాగంబున, నిరుపమ వయోరూపలావణ్యాన్విత యగు నొక కాంతామణి ముక్తకేశయై, సర్వాలంకార భూషితయై కూర్చుండి, దుఃఖాకులిత స్వాంతయై, రోదనము చేయుచున్నది. ఆకన్యకామణి రమారతులను, నాకీసరస్వతులను, శచిరోహిణి మొదలయిన దేవతాస్త్రీలను, నతిక్రమించిన సౌందర్యముకలది. అప్సరస్త్రీ గణంబునందుఁగూడ నక్కాంతా

మణి సౌందర్యంబు లేదు. ఆకన్యకానేత్రజలబిందువు లామహా ప్రవాదంబునంబడి, నానావర్ణాన్వితంబులయిన పద్మంబులయి హంసబృందంబులతోఁగూడ నాపద్మంబులు భాగీరథీజలము నుండి పోవుచున్నవి. అచట రత్నగిరియందు రత్నేశ్వరుండను పేరుగల శివలింగముకలదు. తత్పరిసరంబున జటాభార సమాక్రాంతుండును, దిగంబరుండును, నిరాహారుండును, గృశాంగుండును, శల్యావశిష్టుండును నగు నొక మహాయోగీశ్వరుండు, దుఃఖాకులిత స్వాంతుండై, యక్కన్యకాశ్రు జాతంబులును సుగంధాన్వితంబులును గంగాప్రవాహ పరిప్లుతంబులును నగు పద్మంబులను బ్రభాతకాలమందు స్వీకరించి, యారత్నేశ్వరుని బూజించి యాదేవదేవుని ద్వారసమీపంబున సుస్వరలయాన్వితంబైన గీతనృత్యంబులచే నాదేవుని సేవించుచు శివోపాసనాపరుండై యుండెను. యాకన్యకావృత్తాంతంబును, యోగీశ్వర వృత్తాంతంబును, జెప్పుమనిన గపింజలునితోఁ గుంజరుం డిట్లనియె.

పుత్రకా! నీవు సావధానుండవై వినుము. పూర్వకాలమం దొకప్పుడు, పార్వతీపరమేశ్వరులు నందనోద్యానవన విహారోత్సుకులయి, కింకిణీజాల మాలాన్వితంబును, హంసచంద్రప్రతీకాశంబును, భాస్వన్మౌక్తిక మాలికావిరాజితంబును, సర్వాభరణ భూషితంబును, నానావిధ పుష్పమాలా శోభితంబును, నగు వృషభ వాహనము నధిష్ఠించి కాంచనదండ మండితంబును, నానారత్న విశోభి హేమకలశాన్వితంబును, పూర్ణేందుబింబ సన్నిభంబును, నగు శ్వేతఛత్రంబును, ధరియించి శరదిందుమరీచి గౌరవర్ణంబును, మణిముక్తా విలసత్సు

వర్ణ దండాన్వితంబును, నగు విచిత్ర చామరంబులచే వీజితు లయి, సనకసనందన సనత్సుజాతాది బ్రహ్మర్షి బృందంబుల చేతను, నారదాది దేవర్షి బృందంబులచేతను, సంస్తూయమాను లగుచు, సకల ప్రమథగణ పరివృతులయి, నందనవనంబున కేగిరి.

అటుపిమ్మట మల్లికా మాలతీ వకుళచంపకాది పుష్ప శోభితంబును, నింద్రనీల మణిమయ సోపానాంచిత కమల కల్హార నీలేందీవరాది ప్రసూన పరిశోభిత సరోవరాలంకృతం బును, శుకపిక శారికా నినాద సంకులంబును, సకల సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వ సమాకీర్ణంబును, నప్సరోగణ నృత్తగీత లయాన్వితంబును, నగు నందనవనోద్యాన వైభవం బును, జూచి యానందించుచు బృందారక బృంద నమస్కృ తులయి, మందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన వాటికలమధ్య భాగంబున సంచరించుచు, నొక కల్పవృక్షంబును జూచి, శివుండు పార్వతితో నిట్లనియె. ఓ తరుణీమణీ! దేవత లలో మధుసూదనుండును, నదులలో భాగీరథియు, నాహ్లాద కరంబులలోఁ జంద్రుండును, విద్యలలో నధ్యాత్మవిద్యయు, నుత్కృష్టంబులయిన చందంబున, వృక్షంబులలో నీకల్ప వృక్షంబు బృందారక బృందభోగ్యంబైన సకలాభీష్టార్థంబుల నొసంగుటచే సర్వోత్కృష్టమైనదనిన, తద్వచనముల నాక ర్ణించి పార్వతి శివునితో నిట్లనియెః

ఓ దేవదేవా! పరమేశ్వరా! నీ వానతిచ్చినయెడల భవదనుజ్ఞ వడసి, నిరుపమ వయోరూపలావణ్యాన్వితమైన నొక సుందరాంగిని చిత్తంబున సంకల్పించి యీకల్పవృక్షంబు

వలన జనింపఁజేసి యాసుందరాంగిని గూతునుగా భావించెద ననిన, నప్పరమేశ్వరుండు వల్లెయని యంగీకరించెను. అప్పు డాసర్వమంగళ, సర్వమంగళాస్పదంబైన వయోరూప లావణ్యంబులచేఁ దేజరిల్లు నొక సుందరాంగినిఁ గల్పవృక్షంబు వలనఁ జనింపఁజేసి, యక్కాంతామణికి నశోకసుందరియను నామకరణంబుచేసెను. పిమ్మట నాకాంతామణి వారికి నమస్కరించిన, నాశీర్వదించి యభినందించి వారిరువురు నీవు మాకుఁ బరమప్రేమాస్పదంబైన పుత్రికవు గావున సోమవంశ సముద్భవుండును, బురందర సముండును, నగు నహుషుని భర్తగా బొంది, దివ్యభోగంబుల ననుభవింప గలవు. కాఁబట్టి నీవు యథావిధిగా యమనియమాద్యష్టాంగ యోగంబులతోఁ దపం బాచరింపు మని చెప్పి యంతర్హితులయి కైలాసంబున కేగిరి. అటుపిమ్మటఁ గస్తూరి తిలకాంచిత ఫాలప్రదేశాన్వితయుఁ, బద్మాననయుఁ, బద్మకరయు, బిల్వఫలతుల్య పీన వృత్త పయోధరాన్వితయు, నిరుపమ వయోరూప లావణ్యాన్వితయు, గానవిద్యా విశారదయు నగు నశోకసుందరి తీవ్ర తపోనియమాన్వితయై దేవకన్యలతోఁ గూడ నందనోద్యాన వనంబున నివసించి సుఖముగా నుండెను.

అటుపిమ్మట నతిరౌద్రుండును, స్వేచ్ఛాచార పరుండును, నతికాముకుండును, బృహత్కాయుండును, విప్రచిత్తి పుత్రుండును, నగు హుండాసురుండను పేరఁ బ్రసిద్ధుండగు నొక రక్కసుండు, నిరుపమ వయోరూపలావణ్యాన్వితయు, సర్వాలంకార భూషితయు, నగు నశోకసుందరిని జూచి, మదన బాణ హతుండై యోతరుణీమణీ, నీవెవ్వతెవు. ఇచట నివసిం

చుటకుఁ గారణంబెయ్యది. నీ వృత్తాంతమును జెప్పుమనిన, నా మాటను విని నేనుఁ బార్వతీపరమేశ్వరుల మనస్సంకల్పంబు వలనఁ గల్పవృక్షంబునుండి వారికిఁ గూతునై జనించి దేవ కన్యకలతోఁగూడ నీయుద్యాన వనంబున నివసించి యుంటిని. నీ వెవ్వండవు? ఏకారణంబుచే నిచట కరుదెంచితివి? నీ వృత్తాంతంబును జెప్పుమనిన నా రక్కసుం డశోకసుందరితో నిట్లనియె.

నేను విప్రచిత్తి పుత్రుండను. హుండాసురుండను పేరు కలవాఁడను. నిరుపమ శౌర్యధైర్య గాంభీర్యాది సుగుణ లక్షణ కలితుండను. ధనభాగ్య భోగ్యంబులచే నాతో సమానుండు స్వర్గమర్త్య పాతాళంబులం దెచ్చటను లేఁడని తెలిసికొనుము. నీ దర్శనంబుచేఁ గందర్ప మార్గణవిద్ధుండనై, నిను శరణంబు నొందితిని. నీవు సుప్రసన్న ముఖహృదయాన్వితవై నాకు భార్యవు కమ్ము. నిన్నుఁ బ్రాణసమంబైన ప్రియురాలునుగా భావించెద నని చెప్పెను. ఆమాటలను విని యశోక సుందరి, యా రక్కసునితో నిట్లనియె. ఓరాక్షసోత్తమా! శివుని యనుజ్ఞచేఁ బార్వతి, కల్పవృక్షమునుండి నన్ను జనింపఁ జేసి, యాగౌరీశంకరు లిరువురు, సోమవంశ సముద్భవుండును, సర్వధర్మజ్ఞుండును, మహాప్రాజ్ఞుండును, ధర్మాచరణ తత్పరుండును, దేజంబుచేఁ బావక సముండును, వీర్యంబుచే విష్ణు సముండును, ధన సమృద్ధిచేఁ గుబేర సముండును, రూప లావణ్యంబులచేఁ గందర్ప తుల్యుండును, నాహితాగ్నియు, సుగుణశీలుండును, నగు నహుషుండు, నీకు భర్త కాఁగలఁ డనియు, నతనివలన నింద్రోపేంద్ర సముండును, సకలజనవల్లభుండును నగు యయాతి యను పుత్రునిం బడసి, నిరుపమ

విఖ్యాతిం జెందఁగలవనియు, నాకు వరంబు లొసంగి, యంత ర్హితులయి కైలాసంబునకుఁ జనిరి. నే నీశ్వర సంకల్పంబుచేఁ బరభార్యను, పతివ్రతను, నాయందలి వ్యామోహమును బరిత్యజించి, నీగృహంబున కరిగి, సుఖముగా నుండుమనిన, నా మాటలను విని యారక్తనుండు, మందస్మిత ముఖారవిందుండై, శివకన్యకతో నిట్లనియె.

ఓ సుందరీమణీ! లోకమందు సకల కాంతామణులు యౌవనబలంబుచే రూపవతులయి, పురుషులకు వల్లభత్వము నొందుచున్నారు. తారుణ్యంబు యువతీమణుల కమూల్యంబైనది. కాఁబట్టి నారీమణులందఱు, తారుణ్యంబు చేతనే మనోభీష్టంబైనదివ్యభోగంబుల ననుభవించుచుందురు. నీ దర్శనంబువలనఁ గుసుమ శరసాయక విద్ధుండనై కామాకులితస్వాంతుండ నైతిని. నన్ను భర్తనుగాఁ జేకొని నాతోఁగూడి దివ్యభోగంబుల ననుభవించి నీ తారుణ్యంబును సఫలంబుగాఁ జేసికొనుము. అట్లుకానియెడల నీ తారుణ్యంబు వ్యర్థంబుగా నశించిపోవును. అదియునుంగాక, పురుషుండు జ్యేష్ఠుండును, నారీమణి కనిష్ఠయు నగుట శ్రేష్ఠంబు. స్త్రీకంటె బురుషుండు కనిష్ఠుండగుట లోకవిరుద్ధంబు. నపురుషుండు మాతృగర్భంబున నవమాసంబులునివసించి దశమమాసంబున జనించిబాల్యకౌమారావస్థల నతిక్రమించిన పిదప, యౌవనవంతుండై నపుడు భావికాలంబున నీకు సుఖమును గలుగఁ జేయు నని తలంచుచుంటివి. అది యుక్తము గాదు. యౌవన ప్రారంభ కాలము మొదలుకొని భోగముల ననుభవించుటకుఁ బ్రయత్నించినచోఁ, దారుణ్యమంతయు సఫలంబు కాఁగలదు. దానం

జేసి నాకు భార్యవైనయెడల, సకలభోగంబుల ననుభవింపఁ గలవనిన, నా యసురునితో నశోకసుందరి యిట్లనియెను.

రాక్షసోత్తమా! రైవతుండనురాజు తొల్లి కృతయుగంబున జనించిన రేవతియను తనకూతును రెండుయుగంబులు గడచిన పిమ్మట, ద్వాపరాంతంబున విధాతృ నానతిచే వసుదేవతనయుండైన బలరామునకిచ్చి వివాహము గావించెను. గంధర్వ పుత్రికయైన మాయావతి ప్రద్యుమ్నుని బెంచి యా ప్రద్యుమ్నుండు శంబరుని వధించిన పిమ్మట నతనిని భర్తనుగాఁ జేసికొనెను. కావునఁ బూర్వకర్మానుసారంబుగా నీశ్వర సంకల్పితంబులయిన భావిభావంబు లతిక్రమింప శక్యంబులు కావు. దేవబ్రాహ్మణ ముఖారవింద నిస్సృతంబైన వాక్యంబు నన్యథాచేయుటకు నెవరికిని శక్యంబుగాదు. పతివ్రతాచిత్తము నెవరు చలింపఁ జేయుటకు సమర్థులు? కాఁబట్టి నాయందలి మోహంబును విడిచి, స్వస్థలంబున కరిగి సుఖముగా నుండుము. అట్లు కానియెడల నాపాతివ్రత్య బలముచే నిన్నును శపించెద ననినఁ, దద్వచనముల నాకర్ణించి శాపభయంబుచే విప్రచిత్తి పుత్రుం డంతర్హితుం డయ్యెను. పిమ్మట నారక్కసుండు మాయాబలంబుచేఁ గన్యకారూపంబును దాల్చి యశోకసుందరీ సమీపంబున కేగెను. తత్సమీపంబున నాకన్యక దుఃఖాకులిత స్వాంతయై యతి నమ్మకముతో నివసించెను. అపు డశోకసుందరి నీవెవ్వతెవు. ఏకారణంబుచే నిచట కరుదెంచితి వనిన, నాభర్తను విప్రచిత్తి పుత్రుండు వధించెను. దానం జేసి ఈమందాకినీ సమీపంబునఁ దపం బాచరించి వానిని

వధించెదననిన, నామాటను విని శివకన్యక సమ్మతించి యధిక విశ్వాసకుతో సఖ్యంబు నొందెను.

ఇట్లు కొన్ని దినంబులు గడిచిన పిమ్మట నాకపట కన్యా కారూపుండైన రక్కసుండు, మాయాబలంబుచే నశోకసుందరిని మేరుపర్వత శిఖరాగ్ర స్థితంబును, బహుపుష్ప ఫలోపేత నానావృక్ష విరాజితంబును, వాపీకూప తటాకాన్వితంబును, సంతప్త కాంచన మయానేక రాక్షసగృహ పరివేష్టితంబును, హేమమయ రత్నప్రాకార పరివేష్టితంబును, హేమమయ రత్నకలశ విరాజిత తుంగప్రాసాద సంకులంబును, వైడూర్య పద్మరాగాది మణిమయ సోపానసమన్వితంబుననగు కాంచన పురమందలి స్వభవనంబునకుఁ దీసికొనివచ్చి యయ్యాలయందు గూర్చుండ నియమించెను. అపు డాశివనందిని, సఖియను విశ్వాసకుతో నాకన్యకను నిరుపమ వైభవాన్వితంబైన యీ భవనం బెవరిది యని యడిగెను. అపు డాసుందరుండు నిజరూపంబును దాల్చి కరసంపుటాస్ఫాలనంబుచేసి, కామబాణపీడితుండై, నేవిప్రచిత్తి పుత్రుండైన హుండాసురుండను నీదర్శనంబుచేఁ గామాకులిత స్వాంతుండనై, కపటోపాయంబుచేఁ నిచటకు నిన్నుఁ దీసికొనివచ్చితిని. నాకు ముల్లోకములందును, దుష్ప్రాపంబైన వస్తువులేదు. కావున నీవెద్దానిఁ గోరినఁ దానిం దెచ్చి నీకిచ్చెద ననిన, నామాటలను విని రోషారుణిత లోచనయై, యగ్నిజ్వాలవలెఁ బ్రజ్వలించుచు, నాహుండాసురునితో నిట్లు పలికెను.

ఓరాక్షసాధమా! దేవదానవులుకూడ నన్నుఁ జలింపఁజేయ సమర్థులు కారు. కృష్ణసర్ప శిరోరత్నంబును, నగ్ని

జ్వాలను, గ్రహించు పగిది, నన్నును గ్రహింప నిచ్ఛయించు చుంటివి. కావున నీకులమును, జీవితమును, ధన పశు పుత్ర మిత్ర కళత్రాభివృద్ధిని, నాపాతివ్రత్య బలంబుచే నశింపఁజేసెదను. నన్నును భార్యగాఁ జేకొనుటకును, మద్గాత్రావలోకనంబునకును, నీశ్వరవర ప్రభావంబుచే నహుషుండు సమర్థుండుగాని, యితరులు సమర్థులుగారు. ఇతరులు మద్గాత్రావలోకనంబుచేఁ గామపీడితులయ్యెదరేని, మచ్ఛాపానలంబుచే దగ్ధులయ్యెదరు. గర్జించుసింహము ముఖస్థిత కేశంబులను బెరికివేయుట పురుషునికి దుష్కరంబైన చందంబునఁ గపటోపాయంబుచే నన్నిచటకుఁ దీసికొనివచ్చినను, నన్ను స్వాధీనముచేసికొనుట నీకు మిక్కిలి దుష్కరంబు. ఇంతకుముందుఁ బతికామనచేఁ దపం బాచరించితిని. ఇటుపిమ్మట నహుషుండు నిను వధించుటకై తపంబాచరించెదను. నహుషుం డతినిశితంబులును, నాశీవిష తుల్యంబులును, వజ్రసంకాశంబులును నగు బాణంబులచే నిను రణరంగమందు వధింపఁగలఁడు. ముక్తకేశంబును, నహుష బాణహతంబును, రక్తసిక్తంబును, రణభూపతితంబును, నగు నీ కళేబరంబు నవలోకించి, యపుడు నహుషుని భర్తనుగా గ్రహించెదనని చెప్పి చివాలునలేచి బయలువెడలి యామందాకినీ సమీపంబున నందనోద్యానవనమందు, నసుర ప్రతారణంబుచే దుఃఖించుచు, వానివధకొఱకై తీవ్రముగాఁ దపం బాచరించుచుండెను.

అపు డాయసురపుంగవుండు కంపనుండను నమాత్యుని బిలిచి,తచ్ఛాపవృత్తాంతమును నతనితో చెప్పెను.అమాత్యుం డావృత్తాంతమును విని, ఓ రాక్షసేంద్రా! నీవు గర్భవతి

కాకుండగనే, యాయుపత్నియైన యిందుమతిని, నపహరించుటకు నుద్యమింపుము. గర్భవతియైన యెడల గర్భమును నశింపఁజేయు మని చెప్పెను. ఆ మాటను విని యాయసురపుంగవుండు, నహుషుని వధించుటకై ప్రయత్నించు చుండెను. అట్టియెడఁ బురూరవ పుత్రుండును, సోమవంశ విభూషణుండును, శమదమ తపస్సత్యశౌచాన్వితుండును, నమితవీర్యాన్వితుండును, సర్వ ధర్మజ్ఞుండును నగు, నాయువను సార్వభౌముండు, పుత్ర సంపద్విహీనుండై దుఃఖించుచుఁ బుత్రలాభోపాయంబు నాలోచించి తన మాయాబలముచే మద్యమాంసాశన పరునివలె కనబడుచున్నవాఁడును, స్త్రీజన పరివృతుండును నగు దత్తాత్రేయుని సమీపంబున కేగి, యతని పాదంబులకుఁ బ్రణామంబు గావించి, సుగుణాన్వితుండైన పుత్రునొసంగు మని యనేక సంవత్సరంబులు తత్పాద లగ్నహస్తుండై, యామహామహునిఁ బ్రార్థించెను. అపుడు దత్తాత్రేయుండు, నేను మద్యమాంసాశన పరుండను, స్త్రీజన పరివృతుండను అజితేంద్రియుండను, బ్రాహ్మణ విహిత సదాచార విహీనుండను. కావున నన్ను విడిచి, మఱియొక యోగీశ్వరు నాశ్రయింపు మనిన, నా సార్వభౌముండు, దత్తాత్రేయునితో నిట్లనియె.

ఓ దేవదేవా! నీవు శంఖచక్ర గదాపద్మధరుండును, విశ్వ పరిపాలకుండును, విశ్వమయుండును, భక్తవత్సలుండును, గరుడధ్వజుండును, శరణాగత వత్సలుండును, నగు మధుసూదనుండవు. నిన్నును శరణంబు నొందితిని అత్రిపుత్రుండైన దత్తాత్రేయునిగా నిన్ను నేనెఱుంగుదును. నీవు సర్వకామప్రదుం

డవు. కావునఁ గామితార్థంబుల నొసంగి రక్షింపు మని ప్రార్థించిన, నతని మాటలను విని బహుతిథియుక్తంబైన కాలము గడచినపిమ్మట, దత్తాత్రేయుండు, ప్రసన్నుండై యో సార్వభౌమోత్తమా! నీ భక్తి శుశ్రూషణంబుచే సంతోషించితిని. అభీష్టంబయిన వరము నొసంగెద, వేడుమనిన, నారాజన్యుండు, సర్వధర్మజ్ఞుండును, సుగుణాన్వితుండును, దేవదానవ గంధర్వాదుల కజేయుండును, న్యాయముగాఁ బ్రజలం బరిపాలించువాఁడును, శరణాగత వత్సలుండును, వదాన్యుండును, నిరుపమ వయోరూపలావణ్యాన్వితుండును, ధనుర్వేద నిష్ణాతుండును, వేదశాస్త్ర పారగుండును, సమరాంగణమం దపరాజితుండును, దివ్యభోగానుభవ సమర్థుండును, వంశాభి వృద్ధికరుండును, నగు పుత్రునిఁ బ్రసాదింపు మనిన, నామాటలను విని దత్తాత్రేయుం డొక చూతఫలంబు నిచ్చి దీనిని నీభార్యచే భుజింపఁ జేయుమని చెప్పి, పిమ్మట నింద్రోపేంద్ర సముండైన పుత్రుండు నీకుఁ జనింపఁగలఁడని వరంబిచ్చి,యా సార్వభౌముని నాశీర్వదించి, నీవు స్వగృహంబున కరిగి సుఖముగా నుండుమని యానతిచ్చి, తా నంతర్హితుండయ్యె.

## నహుషుని జననము

అటుపిమ్మట నాయువు, కుబేర దేవేంద్రాది భవన సన్నిభంబయిన స్వభవనంబున కేగుదెంచి, స్వర్భాను రాజపుత్రికయైన యిందుమతి యనుపట్టమహిషికి దత్తాత్రేయదత్తంబైన చూతఫలంబు నొసంగి, యామెచే భుజింపఁ జేసి యాపట్టమహిషింగూడి సకల భోగంబుల ననుభవించుచు

రాజ్యంబును బాలించుచుండెను. అపు డిందుమతి తత్ఫల భక్షణంబువలన దివ్యతేజస్సమన్వితంబైన గర్భంబును దాల్చె. ఆ సమయంబున నిందుమతి కొక స్వప్నంబు దృష్టంబయ్యె. శంఖ చక్ర గదాపద్మధరుండును, హార కంకణ కేయూరాది శోభితుండును, జంద్రమండల సన్నిభ శ్వేతఛత్ర విరాజితుండును, దివ్యకుండలాలంకృత కపోల శోభితుండును, సూర్య సన్నిభుండును, దివ్యగంధానులిప్తుండును, దివ్యమాల్యాంబర ధరుండును, సర్వాలంకార సహితుండును, నగు నొక విప్రుండు హంసవర్ణంబును, గాంచనమయ రేఖాన్వితంబును, నగు శంఖంబునందలి క్షీరంబుచే నిందుమతినిం బ్రోక్షించి, యొక మౌక్తిక హారంబును శ్వేతపద్మ మాలికను నిందుమతి హస్తమందుంచి కంఠమందు ధరింపుమని చెప్పి, యదృశ్యుండయ్యె. అటు పిమ్మట శిరస్సహస్ర శోభితుండును మృణాళ ధవళ వర్ణశోభితుండును, నగు ననంతుండు, గూడఁ బ్రత్యక్షమయి యదృశ్యుండయ్యె.

ఈ ప్రకారముగా, నుపలబ్ధంబయిన స్వప్నవృత్తాంతమును నిందుమతీదేవి, తన భర్తతోఁ జెప్పెను. ఆ వృత్తాంతమును విని యాయువను సార్వభౌముండు, సర్వధర్మజ్ఞుండును గురుండును నగు శౌనకుని బిలిచి, యతనికి నమస్కరించి, యా స్వప్న వృత్తాంతమును జెప్పెను. శౌనకుం డాస్వప్న వృత్తాంతమును విని దత్తాత్రేయునిచే నీయఁబడిన చూతఫలంబును నీ భార్య భక్షించుటవలన నింద్రోపేంద్ర సముండును, సర్వధర్మజ్ఞుండును, ధనుర్వేద కోవిదుండును, వేదశాస్త్ర పారంగతుండును వైష్ణవాంశ సమన్వితుండునునగు, పుత్రుండు

జనింపఁ గలఁడు. మహావిష్ణు సందర్శనముచేతను, ననంతావ లోకంబుచేతను నట్టి స్వప్నము శుభోదర్కమయినదని తెలిసికొనుము మని పలికి, స్వాశ్రమంబున కరిగెను. రాజేంద్రుండయిన యాయువు భార్యతోఁగూడ శౌనకోక్త వచనంబులను విని మహాహర్షము నొందెను. అటుపిమ్మట నా దంపతు లిరువురు నుగుణాకరుండైన పుత్త్రుండు జనింపఁగలఁడని సంతోషించుచు స్వస్థ చిత్తులయి సకలభోగముల ననుభవించుచు సుఖముగా నుండిరి.

అటుపిమ్మట రాజభార్యయైన యిందుమతి సఖురాండ్రతోఁగూడ నందనోద్యానవనమం దొకప్పుడు విహరించుచుండగా, "నీ యిందుమతీ పుత్త్రుండు మహాబలుండై సకల శస్త్రాస్త్ర సంపన్నుండై హుండాసురుని వధింపఁ గలఁ" డని యశరీరవాణి గగనమార్గమునుండి బయలు వెడలెను. ఆ మాటను విని యిందుమతి యాశ్చర్యభరిత హృదయయై యీ వృత్తాంతమును దనతండ్రితోఁ జెప్పెను. అవుడతం డశోకసుందరీ శాపంబును జనులవలన విని తచ్ఛాపంబును స్మరించుచు, నీశ్వరచరితంబు దుర్విభావ్యంబని మనంబునఁ దలంచి, యూరకుండెను. పిమ్మట నాహుండాసురుండు ప్రచ్ఛన్నుండై, తద్గర్భనాశము కొఱకు ననేకవిధంబులఁ బ్రయత్నించినను, దత్తాత్రేయ ప్రసాదంబువలనఁ, దత్ప్రభావ రక్షితంబై యాగర్భంబు దినదిన ప్రవర్ధమానంబై యుండె. అవుడు వాఁడు విఫలమనోరథుండై, యాగర్భంబును నే నెట్లు వధింతెదనని యహోరాత్రంబులు చింతించు చుండెను. ఈ ప్రకారముగా బహుకాలము గడచిన పిమ్మట, నొకరాత్రియందు

నిశీథ కాలంబున సూతికాగృహంబునుఁ బ్రకాశింపఁ జేయుచు, నొక బాలకుం డుద్భవించెను.

ఆరాత్రి నిశీథ కాలంబున సర్వజనము, నిద్రించుసమయంబున, నాదానవాధముండు, సూతికాగృహంబునం బ్రవేశించి యాబాలకు నపహరించి, స్వగృహంబున కరుదెంచి, భార్యను బిలిచి, యీబాలకుండు మత్కృతాపరాధంబుచే నాకు శత్రుపుగావున, వీనిని దాసీహస్తముచే వధింపఁజేసి, సూదహస్తముచేఁ బచనంబు చేయింపు మని యామెతోఁ జెప్పెను. అతిసుందరుండును, తేజస్వియు, నగు నీబాలకుని వధించుటకుఁ గతంబేది సవిస్తరంబుగా నీవృత్తాంతమును జెప్పుమనిన, నాహుండాసురుం డిట్లనియె.

ఓ సుందరీమణీ! పూర్వకాలంబున, నందనోద్యాన వనంబున విహరించు నశోకసుందరి యను శివకన్యక నవలోకించి, తత్సౌందర్యాపకృష్ట చిత్తుండనై గాంధర్వవిధిచేఁ బరిణయంబునకుఁ బ్రయత్నించితిని. అపుడు శివకన్యక సోమవంశ విభూషణుండైన యాయునందనునిచే మరణము నొందఁగలవని శపించెను. ఆ యాయునందనుం డే యీ బాలకుండు. వీఁడు జీవించినయెడల, వీనివలన నాకు మరణము సంభవింపఁ గలదు. కాఁబట్టి వీనిని వధించి పచనము చేయింపుమని చెప్పితిననిన, నప్పలుకుల నాలకించి యా భార్య తనమనంబున నిట్లు చింతించెను. వీఁడు బాలకుండని జాలిపడి వీనిని వధింపనియెడల, నా భర్తకు మరణంబు సంభవింపఁగలదని తలంచి, యీ బాలకుని దాసీహస్తమందుంచి వీనిని వధించి సూదహస్తంబుచేఁ బచనంబు సేయింపుమని దాసితోఁ జెప్పెను. ఆ దాసి యా బాల

కుని గైకొని “వీనిని వధించి పచనము చేయింపుమని రాజా
జ్ఞచే రాజభార్య నాతోఁ జెప్పెను. సర్వలక్షణ సంపన్నుండైన
యీ శిశువును నే నెట్లు వధింపఁ గలను? నాకుఁ జేతు లాడ
కున్నవి. నా దేహము కంపించు చున్నది. వీనిని వధించుట
న్యాయము గాద”ని పాచకునితోఁ జెప్పి దుఃఖించెను.
అపుడు పాచకుం డాతెఱంగెఱిగి,— ఓ భామినీ నీవు చెప్పిన
మాట యథార్థము. ఈ దానవాధముండు పరమ పాపాత్ముండు.
కావున వీనిని వధించి భుజింపఁ దలంచు చున్నాఁడు. సర్వప్రా
ణులు నదీప్రవాహ పతితులయినను, వహ్నిజ్వాలా మధ్యం
బునఁ బడినను, బూర్వాచరిత సుకృతకర్మ సహాయమువలన
జీవించెదరు. కాలకర్మ స్వభావంబులచేఁ బీడితుండైన పురు
షునిఁ దల్లిదండ్రులు గాని, స్వజన బాంధవులుగాని రక్షింపఁ
జాలరని చెప్పి, యా దాసి నూరార్చెను.

అంతట వారిరువురు నాలోచించి, యా బాలకుని
గైకొని వసిష్ఠాశ్రమంబున నొక పర్ణకుటీరమందుంచి మరల
స్వగృహంబునకుఁ జనుదెంచి హరిణమాంసంబును బచనంబు
చేసి, యాహుండాసురునికిఁ బెట్టిరి. తదనంతరం బా రక్క
సుండు, హరిణమాంసంబును భుజించి వాఁడే కపటంబు నెఱుం
గక యాయునందనుండు మృతుం డయ్యెను. శివకన్యకా
శాపంబు విఫలంబయ్యెనని భావించి మరణ భయ రహితుండై
యమందానందంబు నొందెను. అచ్చట వసిష్ఠుం డా పర్ణకుటీర
మందు మరునాఁ డుదయ కాలంబున రాజలక్షణ సంపన్నుం
డును గందర్ప సమాన సుందరుండును నగు, నా బాలకుని
గాంచి, సకల సురముని సిద్ధసాధ్య గంధర్వగణంబులతోఁ గూడ

విమర్శించి, యతండు దివ్యదృష్టిచే నాబాలక వృత్తాంతంబును, హుండాసుర వృత్తాంతమును, దెలిసికొని, యా బాలకునకుఁ గాలక్రమంబున జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయ నాది సంస్కారంబులను యథావిధిగా నాచరించి,సకలవేదంబులను, నీతిశాస్త్రంబును, సాంగోపాంగ ధనుర్వేదంబును, నుపదేశించి, నీవు నహుషుండను నామంబుచేఁ బ్రఖ్యాతుండవై సకల శత్రువులను జయించి, దివ్యభోగంబుల ననుభవింపఁ గలవని యాశీర్వదించెను. అంత నా నహుషుండు శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుండై యా మునీశ్వరునకు శిష్యభావంబు నొంది, మిక్కిలి గురుభక్తియుతుండై, యా యాశ్రమంబున వసిష్ఠానుగ్రహంబుచే సకల సిద్ధులం బడసి, యకుంఠిత పరాక్రముండై యుండె.

అటుపిమ్మట నాయుభార్యయైన యిందుమతి సూతికా గృహంబునఁ దనపుత్రుని గానక రోదనంబు సేయుచు నిట్లు దుఃఖించెను. హాపుత్రకా! హావత్సా! జ్యోతిష్టోమాది యాగంబులచేతను, ననేక నియమాన్వితంబులయిన వ్రతంబులచేతను, దానంబులచేతను, దత్తాత్రేయ వరప్రభావంబుచేతను, జనించి యొకపర్యాయము ముఖమును గనబరచి యదృశ్యుండవైతివి. హాబాలకా! నేనెంత యదృష్ట విహీనురాల నైతిని. పుత్ర లాభము నొందియుఁ బుత్రదర్శనాలింగనాది సుఖంబుల నొందనైతిని. హాసుగుణమందిరా! నినుం గానక నేనెట్లు జీవింతును. ఎవరతిప్రేమతో దాచుకొన్న రత్నముల నపహరించితినో, నా పుత్రరత్నం బపహృతంబయ్యె. ఎవరికి యాచ్ఞావైఫల్యము గావించి దుఃఖమును గలుగఁజేసితినో, పూడ్చిపెట్టిన ధనము

నపహరించి యెవరికి దుఃఖమును గలుగఁజేసితినో, యెట్టి పాప కర్మం బాచరించితినో యిప్పుడు పుత్ర విరహంబుచే దుఃఖించు చున్నానని, శోకాకులిత స్వాంతయై భూతలమందుఁబడి పొర్లా డుచు మరల లేచి యుష్ణంబులయిన దీర్ఘనిశ్వాసంబులను విడుచుచు వత్సరహితంబైన ధేనువు పగిది మూర్ఛనొందుచుఁ, బరితపించు చుండెను.

అపు డాయువుకూడ నీవృత్తాంతమును దెలిసికొని, మహాదుఃఖాన్వితుండై నేనాచరించిన యాగ దాన తపంబు లన్నియు విఫలంబులయినవి. దత్తాత్రేయుండు నాకుఁ బ్రస న్నుండై సకల శత్రుజయాన్వితుండును నఖిల కల్యాణ గుణా న్వితుండును నగు పుత్రునిఁ బ్రసాద సుముఖుండై వరంబుగా నొసంగెను. ఆవరంబునకుఁగూడ విఘ్నంబు సంప్రాప్తంబయ్యె. నే నేమిచేయుదును. ఎక్కడికిఁబోవుదు నని ధైర్యమును విడిచి ముక్తకంఠుండై రోదనము చేయుచుండెను.

అపుడు నారదుండు స్వర్గలోకమునుండి యా రాజ సమీపంబున కరుదెంచి యతనిచేఁ బూజితుండై సూతికా గృహమందుఁ బుత్రుండదృశ్యుండైన వృత్తాంతమును నా రాజేంద్రునివలనఁ దెలిసికొని, యధైర్యముచే ముక్తకంఠుండై రోదనముచేయు రాజేంద్రునితో నిట్లనియె.

ఓరాజేంద్రా! నీపుత్రుండు కాలమృత్యు తుల్యుండైన హుండాసురునిచే సూతికాగృహమునుండి యపహృతుండై, వధించి భక్షించుటకు నుద్యమించినను, దైవరక్షితుండై వసిష్ఠోపదేశంబుచే సకలవిద్యానిష్ణాతుండై కామితార్థ సిద్ధుం డగుచు తదాశ్రమంబున సకల సురముని పాలితుండై, సుఖ

ముగా నివసించి యుండెను. స్వల్పదినంబులలో నింద్రోపేంద్ర సమానతేజంబుచేఁ బ్రకాశించుచు, సకలశత్రువులను వధించి యశోకసుందరి యను శివకన్యకను యథావిధిగాఁ బరిణయంబై నీభవనంబునకు రాఁగలఁడు. తదనంతరంబ నిజకర్మంబులచే నింద్రపదంబు నొందఁ గలఁడు. కావున స్వస్థచిత్తుండవై ధైర్యముతో సుఖముగా నుండుమని చెప్పి నారదుండు స్వర్గలోకంబున కేగెను. ఈ వృత్తాంతమును విని యెంతేని సంతసంబు వహించి నారదవాక్యములను భార్యతోఁ జెప్పెను. పిమ్మట నాభార్యయైన యిందుమతి, తద్వచనంబుల నాకర్ణించి యమందానంద పరిపూరిత స్వాంతయై, దత్తాత్రేయ వరప్రసాదంబుచే నాపుత్రుండు దీర్ఘాయుష్మంతుండై సుఖముగా నుండెనని, తలంచి, యా దత్తాత్రేయునకు ననేక ప్రణామంబుల నాచరించి, యతిధైర్యముతో స్వస్థచిత్తయై, సుఖముగా నుండెను.

అచ్చట వసిష్ఠుం డొకప్పుడు వనంబునకుఁ జని సమిత్కుశ ఫలంబులను దెమ్మని నహుషున కాజ్ఞాపించెను. అతండు వనంబునకుఁ జని సమిత్కుశ ఫలంబులం దెచ్చు సమయంబున, "సూతికా గృహమందుఁ దన పుత్రుండు హుండదానవాపహృతుండగుటచే నాయు భార్యయైన యిందుమతి పుత్రశోకముచే దుఃఖించుచున్నది. ఈ పుత్రుండు నహుషుండను పేర విఖ్యాతుండై యావనమందు సపరివారంబుగా యా దానవుని వధించి యశోకసుందరియను శివకన్యకను బరిణయంబై యా కన్యకతోఁగూడ స్వగృహంబునకుఁ జని తల్లిదండ్రుల నానందింపఁ జేయఁగలఁడ"ని యంతరిక్షమందు సంచరించు చారణుల భాషితంబును విని, వసిష్ఠాశ్ర

మంబునకుఁ జనుదెంచి బద్ధాంజలి పుటుండై యతనికి నమస్కరించి సమిత్కుశ ఫలంబులను సమర్పించి, చారణ భాషితంబును నా వసిష్ఠునకుఁ దెలియఁజేసి, యాయుపుత్రుండైన నహుషుండన నెవరు? నహుషుండన పేర విఖ్యాతుండు మఱియొకండు కలఁడా యేమి? ఇందుమతి యన నెవరు? అశోకసుందరీవృత్తాంతం బెట్టిది? యనిన వసిష్ఠుండు నహుషునితో నిట్లనియె.

ఓ రాజోత్తమా! నీవే యా నహుషుండవు. నీవు జనించినపుడు సూతికాగృహమునుండి హుండాసురుం డపహరించి నిన్నును వధించి పచనంబు సేయింపుమని, తన భార్యకిచ్చెను. ఆభార్య సూదహస్తముచేఁ బచనము సేయింపుమని దాసికి నిచ్చెను. అపుడు దాసియు సూదుండును బాలకవధ యన్యాయంబని తలంచి, యర్ధరాత్రమందు నా యాశ్రమంబున నొక పర్ణకుటీరమందు నిన్నుఁ బరుండఁబెట్టి, హరిణమాంసంబుచే నారక్కసుని సంతసింపఁ జేసిరి. వాఁడది యెఱుంగక యశోకసుందరి శాపంబు విఫలంబయ్యెనని యానందించెను. ఉమామహేశ్వరు లిరువురు నందనవనమందు విహరించు సమయంబున, నొక కల్పవృక్షంబువలన మనస్సంకల్పంబుచే నిరుపమ వయోరూప లావణ్యాన్వితయైన యశోకసుందరి యను కన్యకను నిర్మించి, సోమవంశ విభూషణుం డును, నాయు పుత్రుండును, నగు నహుషుండు నీకు భర్త కాఁగలఁడని చెప్పి వారు కైలాసంబునకుఁ జనిరి. పిమ్మట నశోకసుందరి గంగాతీరమందు భర్తృసమాగమమును బ్రతీక్షించుచుఁ దపం బాచరించుచుండెను.

అపుడు హుండాసురుండు తద్రూప లావణ్యములను గాంచి కామాకులిత స్వాంతుండై నీవునాకు భార్యవు గమ్మని ప్రార్థించెను. అప్పు డాకన్యక తద్వచనంబుల నాకర్ణించి యా రక్కసునితో నిట్లనియె. రాక్షసోత్తమా! నేను పరభార్యను పతివ్రతను. నాయందలి మోహంబును విడిచి, స్వస్త్రీరక్తుండవై స్వగృహంబునకు జని, సుఖముగా నుండుమని చెప్పెను. వాఁ డామాటలను విని యాకన్యకా మోహమును విడువలేక యొక కన్యకారూపమును ధరించి యాకన్యకతో సఖ్యముచేసి కపటముచే నిజగృహంబునకుఁ దీసికొని వెళ్ళి యుయ్యాలపై కూర్చుండ నియమించి, యామచు నిజరూపంబును ధరియించి, మరల నాకు భార్యవు గమ్మని బలాత్కరించెను. అపుడు శివ కన్యక యతిక్రోధ రక్తాంత లోచనయై యాయు నందనుండైన నహుషునిచే నీవు మరణము నొందగలవని శపించి, నందనో ద్యానవనమందలి మందాకినీ తీరంబున నతినియమాన్వితయై తీవ్రతపం బాచరించు చున్నది. అని చెప్పి ఇటుపిమ్మట నీవు ధనుర్బాణ ధరుండవై హుండాసురుని వధించి, యాకన్యక నూరార్చి తద్దుఃఖ ప్రమార్జనంబుచేసి యథావిధిగా నాకన్య కను బరిణయంబు చేసికొనుము.

ఈ వృత్తాంతమును వైమానికులయిన చారణాదులు సంభాషించు చుండగ నీవు వింటివని, వసిష్ఠుం డీవృత్తాంతమును సమగ్రంబుగా నహుషునితోఁ జెప్పి వివరించెను. నహుషుండు తద్వృత్తాంతమును విని యత్యాశ్చర్య భరితహృదయుండై హుండాసురుని వధింపఁ దలఁచి క్రోధావిష్ట చిత్తుండయియుండె.

అపుడు కాంచనపురమందు స్వగృహంబున నా హుండా సురుండు సూదపరివేషితంబయిన హరిణ మాంసంబును భుజించి, యెంతేని సంతసించి, యతిరయంబున నందనోద్యాన వనమందలి మందాకినీ తీరంబున కేగి, యచ్చట నశోకసుంద రిని గాంచి సుందరీమణీ! యాయునందనుండైన నీ భర్తను సూతికాగృహంబునుండి తీసికొనివచ్చి పాచక హస్తముచేఁ బచనంబు చేయించి నే నిపుడు భక్షించి వచ్చితిని. ఆయు నందనుని యందలి మోహమును వదలి, నాకు భార్యవు గమ్మని మరల ప్రార్థించెను. ఆ మాటలను విని యా శివకన్యక క్రోధారుణలోచనయై, యాయునందనుండు సకల సుర ముని గణరక్షితుండై నాకు భర్తకాఁగలఁడు. నీవు యథాగతముగా స్వగృహంబునకుఁ జని సుఖముగా నుండుము. అట్లు చేయని యెడల నా పాతివ్రత్యముచే నిను భస్మము గావించెద నని చెప్పెను.

ఆ మాటలను విని వాఁ డతిభీతుండై స్వగృహంబు నకుఁ జనెను. అటుపిమ్మట నా యశోకసుందరి – దానవు లతి క్రూరులు వివిధోపాయంబులచే సకలప్రాణులను వధింపఁ గలరు. నాకు వాఁడు వక్కాణించిన మాటలవలన నాయు నందన జీవిత సందేహము గలుగుచున్నది. భావి కర్మపరిపాకం బెట్లున్నదో యీశ్వరుం డేమి చేయునో తెలియ దని చింతించు చుండెను. అట్టియెడ దేవగణ ప్రేషితుండైన యొక గంధర్వుండు భార్యతోఁగూడ విమానారూఢుండై యశోక సుందరీ సమీపంబున కరుదెంచి, యో చిన్నదానా! నీవు చింతింపకుము. హుండాసురుం డిందుమతీ పుత్రుని సూతికా

గృహంబునుండి దెచ్చి భార్యను బిలిచి వీనిని వధించి పచనము చేయింపుమని చెప్పి భార్య కిచ్చెను. ఆ భార్య పాచకునకు దాసిచే రాజాదేశమును దెలియఁ జేసెను. ఆ సూదుండు కరుణామయుండై, యర్ధరాత్రంబున నా శిశువును, వసిష్ఠాశ్రమ మందలి యొక పర్ణశాలయందుంచి, మరల మహానసంబున కరుదెంచి, హరిణ మాంసంబును బచనంబు గావించి, యా రక్కసుని భుజింపఁ జేసెను. వాఁ డదియెఱుంగక యిందుమతీ తనయుని వధింపఁజేసి పచనముచేయించి భక్షించితినని తలంచి నీ కా వృత్తాంతమును జెప్పెను. మంత్ర తంత్ర యంత్రంబులును, శస్త్రాగ్ని విషబంధనంబులును, దేవగణ రక్షితుండైన పురుషుని వధించుటకు సమర్థంబులు కాఁజాలవు. హుండ దైత్యుం డతి క్రూరుండైనను, మాయావంతుండైనను, నా బాలకుని పూర్వసుకృత కర్మసహాయముచే వాని ప్రయత్న మంతయు విఫలంబయ్యెను.

ఆయు నందనుం డిపుడు మునిజన పరివృతుండై సకల విద్యాపరిపూర్ణుండై సాంగోపాంగ ధనుర్వేదంబు నభ్యసించి, విష్ణుతేజోరక్షితుండై, సుఖముగా నున్నవాఁడు. అతండు శస్త్రాస్త్రబలంబుచే హుండాసురుని సపరివారంబుగా వధించి యథావిధిగా నినుఁ బాణిగ్రహణము చేసికొని, యేకఛత్రాధి పతియై, నీతోఁగూడఁ జిరకాలము దివ్యభోగముల ననుభ వించి, యయాతి యను పుత్రునిఁ బడసి, నతనివలన నతివిస్తృ తంబైన వంశాభివృద్ధి నొందఁగలఁడు. నీ పాణిగ్రహణానంతరం బున నీతోఁగూడ హస్తిపురంబునకుఁ జని తల్లిదండ్రులకు నమస్కరించి, వారి నానందింపఁ జేయగలఁడు. నీవు విచా

రింపకు మని పలికి, యా గంధర్వుండు భార్యతోఁగూడ విమానారూఢుండై, స్వర్గలోకంబున కరిగెను. పిమ్మట నా శివ కన్యక, శుభోదర్కంబులయిన గంధర్వ వచనంబులను విని యమందానందము నొంది స్వస్థచిత్తయై పూర్వమువలె మందాకినీ తీరంబున సుఖముగా సంచరించు చుండెను.

## నహుషుండు దేవత లందరివలన వివిధాస్త్రములం బడయుట

అచ్చట వసిష్ఠాశ్రమంబున, నాయుపుత్రుండైన నహుషుండు, సకల సురముని యక్షగంధర్వాదులకు నమస్కరించి, వారి యాశీర్వచనంబు నొంది, దేవేంద్రాజ్ఞచే మాతలి సమానీతంబైన సంక్రందన రథము నధిష్ఠించి, హుండ దైత్యవధోత్సుకుండై బయలు వెడలెను. అపుడు దేవేంద్రుండు మాతలిని బిలిచి నీవు నహుషునకు, జాగరూకుండవై, విజయము కలుగునట్లు, సారథ్యమును జేయుమని, యానతిచ్చి, హుండాసురుని శీఘ్రముగా వధింపుమని, సహస్రాక్షుండు నహుషునితోఁ జెప్పెను. ఆమాటను విని నహుషుండు దేవేంద్రునకు నమస్కరించి మీ యనుగ్రహంబువలనను, వసిష్ఠాది మునిగణాశీర్వచనంబువలనను, హుండాసురుని వధించి జయము నొందఁగలనని చెప్పెను.

అపుడు దేవేంద్రుం డతిసముత్సుకుండై, వజ్రాయుధమును, నొక శక్తిని, మహావిష్ణువు తనసుదర్శనంబువలన మఱియొక సుదర్శనంబును, బుట్టించి యా సుదర్శనచక్రంబును, శివుండు శూలంబును, వాయువు వాయవ్యాస్త్రంబును, వైశ్వానరుం డాగ్నేయాస్త్రంబును, వరుణుండు పాశంబును,

పితామహుండు బ్రహ్మాస్త్రంబును, నితరదేవతలందఱు తమ దివ్యాస్త్రంబులను, నహుషున కొసంగి, హుండాసురుని సపరివారంబుగా వధించి జయము నొందుమని సకలదేవత లాశీర్వదించి, నహుషోపరిభాగంబునఁ బుష్పవర్షమును గురిపించిరి. దేవదుందుభులు మ్రోగినవి. రంభాద్యప్సరోగణంబులు మంగళగీతి యుక్తంబైన నాట్యమును జేసిరి. అట్టియెడ నహుషుండు మాతలి ప్రేషితంబైన దివ్యస్యందనము నధిష్ఠించి తేజోరాశిచే రెండవ సూర్యునివలెఁ బ్రకాశించుచు, దివ్యస్త్రీ గణపరివృతుండై సకలరాక్షస సంకులంబై యొప్పు కాంచనపురంబును బ్రవేశించి, తత్పరిసరోద్యాన వనంబున, దివ్యస్త్రీ నృత్తగీత వాద్యంబులచే నానందించు చుండెను.

## నహుషుండు హుండాసురుని మీదికి యుద్ధంబున కేగుట

ఆ కాంచన పురంబునందు హుండ దానవ భవనసమీపంబున, బహుపుష్ప ఫలోపేత నానావృక్ష లతాసంకీర్ణంబును ననేక మృగపక్షి సంచారాన్వితంబును, సమద కోకిల రవాన్వితంబును, శుక పిక శారికాది సుమనోహర నినాద సంకులంబును, కమల కుశేశయ కల్హార నీలేందీవర శోభిత పద్మరాగ మరకత మణిమయ సోపానాంచిత హంసకారండవాకీర్ణ సరోవర విరాజితంబును, ననేక ప్రాసాద భాసురంబును, రాక్షస విహార యోగ్యంబును, నగు నొక యుద్యానవనంబు గలదు.

ఆయుపుత్రుం డాయుద్యానవనంబున, సూత మాగధ వంది సంస్తూయమానుండై, యక్షకిన్నర గంధర్వ గానంబులను దివ్యస్త్రీ నృత్యగీత వాద్యంబులను సేవించుచు, మాతలితోఁ

గూడ దివ్యరథమందు దేవేంద్రునివలెఁ బ్రకాశించుచు సుఖముగాఁ గూరుచుండెను.

అటుపిమ్మట నా యశోకసుందరి, యక్షకిన్నర గంధర్వకృత మంగళగీతంబులను, దివ్యస్త్రీ నృత్తగీత వాద్యంబులను విని తదాకృష్ట స్వాంతయై తపంబును బరిత్యజించి, యాసనంబువలన లేచి మహోత్సాహాన్వితయై యా యుద్యానవనంబునకుఁ జనుదెంచి, దేవరాజ సంకాశుండును, దివ్యలక్షణ లక్షితుండును, దివ్యగంధాను లిప్తుండును, దివ్యమాల్యాంబరా భరణాలంకృతుండును, సూర్య సంకాశుండును నగు నహుషు నవలోకించి, యమందానంద పరిపూరిత స్వాంతయై సుర సిద్ధ సాధ్య యక్ష కిన్నర గంధర్వ గణంబులలో నిట్టి సౌందర్యంబును నే నెన్నఁడును జూడనైతి నని తలంచి, తత్సౌందర్యంబున కచ్చెరువొంది, రంభాద్యప్సరోగణంబులతో సంభాషించి వసిష్ఠాది మునిజన కృతంబులయిన యాశీర్వచనంబులును, నింద్రాది దేవతా విశ్రాణితంబులయిన దివ్యాస్త్రంబులును నతనికి సంభవించిన విధంబును వారివలనఁ దెలిసికొని, మందస్మిత ముఖారవిందయై, తద్వైభవంబును జూచి సంతసించుచు నహుష సమీపంబున సుఖముగా నుండెను. అపుడు రంభ యశోకసుందరిని జూచి ఓ తరుణీమణీ! నీవు మహాపతివ్రతవు. నీ మనంబును జలింపఁ జేయుటకు దేవ దానవులకైన శక్యంబు గాదు. తపంబు విడిచి నీ విచటకుఁ జనుదెంచి, యత్యాదరముతో నహుషుని జూచుచున్నావు. తత్కారణం బెయ్యది యనిన, నశోకసుందరి రంభతో నిట్లనియె.

ఓ సఖీ! నేను జనించిన సమయంబున, సుమహామహే శ్వాసు లాయువుత్రుండైన నహుషుండు నీకు భర్తకాఁగలఁడు. అతనితో దివ్యభోగంబుల ననుభవింపఁగలవని వరమొసంగి, యంతర్హితులయి కైలాసంబునకుఁ జనిరి. అదిమొదలుకొని నహుష కామనచేఁ దపంబాచరించుచు నతనియందు సంసక్త చిత్తనై తిని. ఇతని సందర్శనమువలన, నామనంబు చలించి యితనితోఁగూడి స్వచ్ఛందనాది భోగంబుల ననుభవింప వలె నని కుతూహలాన్వితంబైన దనిన, నాశివకన్యకతో రంభ యిట్ల నియె. పరమేశ్వరుం డచింత్య శక్తియుక్తుండును, సత్య సంక ల్పుండును గావున, నా మహామహుని వరంబే యానహుషు నందలి మనోభిలాషకు ముఖ్యకారణంబు కాఁబట్టి నేను నహుష సమీపంబున కేగి యతనితో నీవృత్తాంతమును జెప్పెద నని పలికి, తత్సమీపంబునొంది రంభ నహుషునితో నిట్లనియెను.

రాజేంద్రా! అశోకసుందరీప్రేరణంబుచే నేనీ సమీపం బునకుఁ జనుదెంచి, తదభిప్రాయంబును జెప్పుచున్నాను. సావ ధాన చిత్తుండవై వినుము. అశోకసుందరి యను శివకన్యక పరమేశ్వర వరంబుచే నిను భర్తనుగాఁ గోరి మందాకినీ తీరం బునఁ దీవ్రంబుగాఁ దపం బాచరించి, నీ సమీపంబున కరుదెం చినది. సకల సుర ముని సిద్ధ సాధ్య యక్ష కిన్నర గంధర్వాదు లకు దుష్ప్రాపంబును, త్రిలోక దుర్లభంబును నిరుపమ వయో రూప లావణ్యాన్వితంబును, నగు భార్యారత్నంబును బరిణ యంబుచే గ్రహించి, నీవు దివ్యభోగంబుల ననుభవింపు మనిన, నప్పలుకుల నాలకించి నహుషుండు రంభతో నిట్లనియె. తరుణీమణీ! యీ యశోకసుందరి నా నిమిత్తమయి నందనో

ద్యానవనమందలి మందాకినీ తీరంబునఁ దీవ్ర నియమముతోఁ దపం బాచరించుచున్న దనియు, నాకు విధికృతంబయిన భార్య యనియు, వసిష్ఠమహాముని వలన నింతకుముందు సమగ్రంబుగా నీ వృత్తాంతమును నే నెఱింగితిని. హుండాసురుండు సూతికా గృహమునుండి నన్ను నపహరించి వధించుటకుఁ బయత్నిం చెను. నేను దేవగణ రక్షితుండనై జీవించితిని. అందువలన హుండాసురుని సపరివారంబుగా వధించి, గురువైన వసిష్ఠుని యనుజ్ఞను బొంది, పిమ్మట శివకన్యకను వివాహము చేసికొనెద నని చెప్పెను. అప్పు డా వృత్తాంతమును విని రంభ, శివకన్యా సమీపంబునకుఁ జనుదెంచి, నహుషాభిప్రాయమును నామెకుఁ దెలియఁ జేసెను. అపు డా శివకన్యక తదభిప్రాయమును రంభ వలనఁ దెలిసికొని, మహాహర్షమును జెంది రంభతోఁగూడ నహుష వీర్యావలోకన కుతూహలముచేఁ దత్పరిసరంబున సుఖముగా నుండెను.

## నహుష హుండాసురుల యుద్ధము

అటుపిమ్మట నచ్చటనుండు దానవు లందఱు రంభా నహుష సంవాదంబును విని, హుండాసురునితోఁ జెప్పిరి. వాఁ డామాటల కచ్చెరువొంది యీశ్వరచరిత్రము దురవగాహం బని తలంచి పిమ్మటఁ గ్రోధరయంబుచే రక్తలోచనుండై యొక దూతను బిలిచి నీవు నహుషునితో నిట్లు చెప్పుము. " నీవు ధనుర్బాణధరుండవై మాపురంబునం బ్రవేశించుటకుఁ గారణం బెయ్యది ? నేను సకలదేవతలను మర్దించి జయించిన వాఁడను, గావున నీకు జీవితాశ కలదేని నీ గృహంబునకుఁ బొమ్ము. లేని

యెడల శివకన్యకతోఁగూడ నిను వధించెదను". అని మద్వ చనంబులను జెప్పి యతి శీఘ్రంబుగా నాసమీపంబునకు రమ్మని యానతిచ్చినఁ దద్వచనంబుల నాకర్ణించి, యాదూతి నహుష సమీపంబున కేఁగి యతనితో హుండాసురుండు చెప్పిన వచ నంబులను బలికెను. ఆమాటనువిని యాదూతితో నహుషుం డిట్లనియె.

నీవు సూతికాగృహమునుండి నన్నపహరించి సూద హస్తముచేఁ బచనంబు చేయింపఁ దలంచితివి. నేను దేవగణ రక్షితుండనై జీవించితిని. నన్ను వధించుటకు నుద్యమించుట వలనను, శివకన్యకా శాపంబువలనను, నిన్ను వధింపఁ దలఁచి వచ్చితినని చెప్పుమనిన, నాదూత తద్వచనమును విని హుండా సురునితోఁ జెప్పెను. ఆమాటను విని హుండాసురుండు క్రోధారుణ లోచనుండై సేనాధ్యక్ష రక్షితంబులయిన చతు రంగ బలంబులతో యుద్ధసన్నద్ధుండై పర్వతంబునందు మేఘం బులు వర్షించు చందంబునఁ గొందఱు రాక్షస వీరులతోఁగూడ నహుషోపరి భాగంబున బాణవర్షమును గురిపించెను. మఱి కొందఱు రాక్షసవీరులు మిక్కిలి గర్జించుచు శక్తి శూల పాశ ఖడ్గ పరశ్వధంబులచే నహుషునిఁ గొట్టిరి. అపుడు నహుషుం డా యభిఘాతంబును సహించి యింద్రచాప తుల్యంబైన ధనుస్సునందు సూర్యరశ్మి సన్నిభంబులును నతి తీక్ష్ణంబులును నగు దివ్యాస్త్రజాలంబులను సంధించి యస్త్రాగ్నిజ్వాలలచే రాక్షస వీరులను దహించి ప్రళయకాలానలంబు జగంబును నశింపఁజేయుచందంబున సకల దానవ సైన్యంబును నశింపఁ జేసెను.

## హుండాసురుడు మృతిఁ బొందుట

అటుపిమ్మట నహుషపరాక్రమును సహింపలేక కొందఱు రాక్షసపుంగవులు, మృతులయిరి. మఱికొందఱు పర్వత గుహాలయుందు దాగిరి. కొంద ఱనభిజ్ఞాత వృత్తాంతు లయిరి. అపుడు మహాతేజస్వియు మహాప్రాజ్ఞుండును దానవ నాశకుండును సూర్య సంకాశుండును నగు నహుషునిం గాంచి హుండాసురుండు, రాజాధమా ! నా యెదుట నిలు! నిలు! నిన్ను తీక్ష్ణబాణంబులచే యమసదనంబు నొందించెద నని పలికి, పది శాణాంబులచే శిరఃకంఠ బాహుమూల వక్షంబులందుఁ గొట్టెను. నహుషుం డపుడు రుధిర దిగ్ధదేహుండై యతిక్రోధంబుతోఁ దిరస్కరించుచు, నా యెదుట నిలునిలు, నీశరీర మాంసంబును కాక కంక గృధ్రాదులు భక్షించునట్లు నిను వధించెదనని పలికి, మేఘంబు వర్షించు చందంబున బాణవర్షంబును గురిపించి, రాక్షసేంద్రుని దేహ కాంతిని హరించి పుష్పితాశోకంబువలె రక్త సిక్తాంగునిఁ గావించి, మూర్ఛనొందించెను. పిమ్మట నా దనుజాధముండు ముహూర్త మాత్రము చైతన్యవిహీనుండై నేలం గూలెను. అపు డంతరిక్షమందు సురముని సిద్ధసాధ్య యక్షకిన్నర గంధర్వులును, దివ్యస్త్రీగణంబులును, విమానారూఢులయి, జయధ్వనులను శంఖ భేరీ మృదంగాది మంగళధ్వనులను జేయుచుఁ, బుష్పవర్షమును గురిపించిరి.

అట్టియెడ దేవగణ ప్రయుక్తంబయిన తుములంబగు కోలాహలధ్వనిని విని, నేను మృతుండనుగాను, నా పరాక్రమంబును జూడుము. ఇపుడు నిన్ను సంహరించెద దని యా

విషతుల్యంబులయిన బాణంబులను గ్రహించి, నాలుగు బాణంబులచే నాలు గశ్వంబులను, నొక బాణంబుచే ఛత్రంబును, రెండుబాణంబులచే ధ్వజంబును, రెండుబాణంబులచేశిరంబును, రెండుబాణంబులచే నురంబును, మూడుబాణంబులచే సారథిని గొట్టెను. ఆదనుజేశ్వరుండు, శరసంధాన మోక్షంబులం దతిలాఘవంబును గనబరచుచు, నహుషోపరి భాగంబున నతినిశిత శరవర్షంబును గురిపించెను. అపుడు దేవత లాశరసంధాన మోక్షణలాఘవంబు జూచి యతి విస్మయంబు నొందిరి. నహుషుండు దానవేంద్రుని శరసంధాన మోక్షణ కౌశలంబునుజూచి యో రాక్షసరాజా! నీవు మిక్కిలి శూరుండవు. కృతవిద్యుండవు. ధీరుండవు. రణమందు మహాపండితుండవు. అని శ్లాఘించుచు, లఘువిక్రముండై మూడుబాణంబులచే ధ్వజంబును, నొకబాణంబుచే ఛత్రంబును, నటికి రెండుతునుకలు చేసి, నేలఁగూల్చెను. అటుపిమ్మట నాలుగు సాయకంబులచే గుఱ్ఱంబులను, నాలుగుబాణంబులచే సారథిని, పదిబాణంబులచే దనుజేశ్వరుని కవచంబును, సర్వాంగంబులను గొట్టెను.

అపుడు హుఁడు విదలీకృత శరీరుండును, హతాశ్వుండును, హతసారథియు, నగుచు నతిక్రోధంబుతో నిశిత సాయకంబులను వర్షించుచు, చర్మఖడ్గధరుండై దక్షిణదిగ్భాగంబున, మండలగతులచేఁ బరిభ్రమించుచు, ఖడ్గంబుచే నహుష వక్షస్థలమును గొట్టెను. నహుషుం డాదెబ్బను సహించి, యాఖడ్గంబును రెండుతునుకలుగాఁ జేసి, యతినిశిత సాయకంబులచే దనుజాధిప ఫాలంబును నొప్పించెను. అపుడు కొంతతడవు గదాహస్తుండై యుద్ధము చేసెను. ఆయునందనుం డాగదను

రెండుతునుకలుచేసి వాడిములుకులు పెక్కు లాతనిమేన నింప నహుషుండు క్రోధోద్దీపిత మానసుండై, యా దనుజేశుని కలికుటమ్ముల నాటించి, నొప్పించెను. ఇట్లు కడుం దడవు పోరిపోరి రథంబుల నభిముఖంబుగాఁ జేసి, దివ్యాస్త్ర ప్రయోగంబుల నితరేతర జిగీషాయత్త చిత్తులయి మెత్తంబడక పోరుచో నామాయకాని మాయలను వసిష్ఠదత్త దివ్యాస్త్రంబులచే బొలియించెను. అపుడు హుండాసురుండు, రుధిర దిగ్ధాంగుండై భుజాస్ఫాలనంబుచేసి, గర్జించుచు నతిక్రోధావిష్ట చిత్తుండై, యతిరయంబున, నహుష పార్శ్వంబున కరిగి, మ్రింగుటకు నుద్యమించెను. పిమ్మట నహుషుండు క్రోధ తామ్రాక్షుండై, దేవేంద్ర దత్తంబైన శక్తిని వక్షస్థలంబునం బ్రయోగించెను. దానిచే వజ్రాహత పర్వతంబువలె నతిశీఘ్రంబుగా నేలంగూలి, బుడబుడ నెత్తురు గ్రక్కుచుఁ, గన్నులం గిరగిరం ద్రిప్పుచుఁ, బండ్లు గీటుకొనుచు, దైత్యేశ్వరుండు ప్రాణంబులను విడిచె. అట్టియెడ హతావశిష్టులయిన దానవులు కొందఱు, గిరిగుహాలయందును, మఱికొందఱుఁ బాతాళమందును బ్రవేశించిరి. పరమ పాపాత్ముండైన, హుండాసురుని నహుషుండు వధించెనని, సుర ముని సిద్ధ సాధ్య యక్ష కిన్నర గంధర్వాదు లందఱు, నతని పరాక్రమమును గొనియాడుచు, రాజేంద్రా! నీవు సకలాభీష్టంబులం బొంది సుఖముగా నుండుమని యాశీర్వదించుచు, మహాహర్షము నొందిరి.

## శివకన్యకా నహుషుల పరిణయము

అటుపిమ్మట నశోకసుందరి పరమానంద భరిత స్వాంతయై నహుష సమీపంబునకుఁ జనుదెంచి నేను నీకు దైవకృతంబైన పరిచారికను. నీ పాదసేవను జేయుటకై చిరకాలము నుండి మందాకినీ తీరంబునఁ దపం బాచరించితిని. నన్ను యథావిధిగా వివాహము చేసికొని ధర్మపత్నిగా గ్రహింపుమని ప్రార్థించెను. నహుషుండు తద్వచనంబుల నాకర్ణించి, ఓసుందరీమణీ! నీవు చిరకాలమునుండి నన్ను భర్తనుగా భావించి తపం బాచరించుచున్న వృత్తాంతమును వసిష్ఠోపదేశంబువలనఁ దెలిసికొంటిని. ఆమహామహుని యానతిం బడసి, నీపాణిగ్రహణము చేసెద నని పలికి, రంభతోఁగూడ నా శివకన్యకను రథము మీఁదఁ గూర్చుండబెట్టుకొని, వసిష్ఠాశ్రమంబున కరిగి శివకన్యకతోఁగూడ సకలమునిజన పరివృతుండైన వసిష్ఠునకు నమస్కరించి, హుండాసుర వధవృత్తాంతంబును, శివకన్యకాభిప్రాయంబును, నతనితో విన్నవించెను.

అపుడు వసిష్ఠుండు తద్వృత్తాంతంబును విని యానంద భరితహృదయుండై సకల మునిజనంబులతోఁగూడ శివకన్యకనా నహుషునకిచ్చి వివాహము గావించి, యాశీర్వదించెను. అట్టియెడ, మేనక యను నచ్చర, దేవగణ ప్రేషితయై స్వర్గలోకమునుండి బయలువెడలి భూలోకంబునకుఁ జనుదెంచి, నహుష కుశలంబును, హుండాసుర చేష్టితంబును, దన్మరణంబును, నశోకసుందరీ పరిణయంబును, నహుషుని తల్లిదండ్రులకుఁ దెలియఁజేసి, వారికి నధికానందంబును గలుగఁజేసి మరల

స్వర్గలోకంబున కేఁగెను. పిమ్మట వసిష్ఠానుమతంబున నింద్ర రథమందు రంభాద్యప్సరోగణంబులతోడను, నశోకసుందరి తోడను, నధిష్ఠించి కరిపురంబున కరుదెంచి, తల్లిదండ్రులకు నమస్కారము గావించి, భార్యతోఁగూడ స్వస్థచిత్తుండై యుండె. అపు డాయుమహారాజు, దత్తాత్రేయవరప్రసాదలబ్ధ మహావీర్యాన్వితుండు గావున, మన పుత్రుండు పాపచిత్తుండైన హుండాసురుని సంహరించి శివకన్యకను బెండ్లియాడి మన సమీపంబునకుఁ జనుదెంచెనని భార్యతోఁబలికి మహోత్సవంబులు చేయించి, యెల్లపుడును దత్తాత్రేయు నారాధించుచు మహాహర్షాన్వితుండై యుండె.

అపుడు నహుషుండు తల్లిదండ్రులకుఁ బ్రణామంబు గావించి, స్వప్నవృత్తాంతంబును సమగ్రంబుగా వారికిఁ దెలియఁజేసి, స్వభవనంబున భార్యతోఁగూడఁ గుతూహలాన్వితుండై సకల భోగంబుల ననుభవించుచు సుఖముగా నుండెను. ఇట్లు కొన్నిదినములు గడచిన పిమ్మటఁ, దల్లిదండ్రుల యానతిఁ బొంది, వరనారీ పురుష శోభితంబును, నానావిధ ధ్వజపతాకాలంకృతంబును, వీణావేణుగాన ధ్వనియుక్తంబును, మృదంగాది వాదిత్రసంకులంబును, సకల శోభాస్పదంబును, నగు స్వభవనమునుండి బయలువెడలి, ధనుర్బాణ ధరుండై సప్తద్వీపయుతంబయిన వసుంధరామండలంబును జయించి, యమితంబులయిన సువర్ణ రజతమణి ముక్తాధనంబుల నార్జించెను. అటుపిమ్మట నా ధనంబుల నవలోకించి తల్లిదండ్రులు పులకోద్గమాంచిత దేహులయి, యానంద పరిపూరిత హృదయులగుచుఁ, బుత్ర శిరంబు నాఘ్రాణించి గాఢాలింగనము చేసికొనిరి.

అనంతర మాపుత్రుం డనేక నియమాన్వితంబులయిన వ్రతంబులను, మహాదానంబులను, రాజసూయాశ్వమేధాది మహాక్రతువరంబులను, దల్లిదండ్రులచేఁ జేయించి, భార్యతోఁ గూడఁ దా నాచరించి, చిరకాలము దివ్యభోగంబుల ననుభవించుచు సుఖముగా నుండెను. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట సకల సురముని సిద్ధసాధ్యయక్షకిన్నర గంధర్వప్రేరణంబుచే నాయుమహారాజు నహుషునకుఁ బట్టాభిషేకంబు సేసి, యింద్రాది దేవగణప్రార్థితుండై భార్యతోఁగూడ దివ్యవిమానము నధిష్ఠించి మహోహర్షంబుతో, బ్రహ్మాదిలోకంబులకుఁ జని, చిరకాలము దివ్యభోగంబుల ననుభవించి, పునరావృత్తి రహితంబైన మోక్షసామ్రాజ్యంబు నొందెను. పిమ్మట నహుషుండు శివకన్యకతోఁగూడఁ జిరకాలము రాజ్యంబును బాలించి సకల సుఖంబుల ననుభవించి, జ్ఞానవిజ్ఞాన సంపన్నుండై యయాతియను పుత్రునిఁ బడసి, చంద్రవంశమును మిక్కిలి వృద్ధినొందించి, సపత్నీకుండై పరమపదము నొందెను. ఈ నహుషచరిత్రమును వినువారు, వంశాభివృద్ధి నొంది, సకల భోగంబుల ననుభవించి స్వర్గలోకంబు నొందఁగలరు. అని చెప్పి కుంజరుండు విరమించెను.

## హేమారవింద వృత్తాంతము

అటుపిమ్మట వేనభూపాలుండు శ్రీ మహావిష్ణువునకు నమస్కరించి కపింజలుం డడిగిన కన్యకా నేత్రాశ్రుకణ సంజాత హేమారవింద వృత్తాంతంబును, రత్నేశ్వరాలయ గత సిద్ధపురుష చరిత్రంబును కుంజరుం డేమని చెప్పెనో విన కుతూ

హాల పడుచుంటిని. తద్వృత్తాంతమును సెలవిమ్మనిన శ్రీమహా విష్ణువు మఱియు వేనభూపాలునితో నిట్లనియె. పిమ్మట కపింజ లుండు నీవు నన్నడిగిన చందంబుననే తండ్రి నడుగ నాతఁడిట్లు చెప్పఁ దొడంగెను. పుత్రకా! ఈ చరిత్రంబు సకల పాప నివర్తకంబు. కావున నేఁ జెప్పెద. సావధాన చిత్తుండవై వినుము.

ఆయువుత్రుండును, ధీరుండును, బలవంతుండును నగు నహుషునిచే నమాత్య భృత్యవర్గ సహితుండై తన తండ్రియైన హుండాసురుండు నిహతుండయ్యె నని తెలిసికొని పుత్రుండైన విహుండుండను దైత్యుండు ఘోరతపం బాచరించి తపస్సిద్ధిని బడసి సమరాంగణమం దింద్రాది సకలదేవతలను జయించి దేవలోకము నాక్రమించెను. అపుడు దేవతలందఱు దైత్య ప్రతాపాగ్ని సంతప్తులై తత్పరాక్రమంబును సహింపలేక పితా మహ సహితులై వైకుంఠ లోకంబున కరిగి శంఖ చక్ర గదా పద్మధరుండును, నాశ్రిత కృపాసాగరుండును, శ్రీలలనా సేవిత పాదారవిందుండును నగు మహావిష్ణువును శరణంబు నొంది, విహుండ దైత్యుని వలన సంభవించిన భయంబును దెలియ జేసి యా దైత్యుని ఘోరకృత్యంబుల వలన మమ్ములను రక్షింపుమని ప్రార్థించిరి. ఆశ్రితజన రక్షకుండైన పుండరీకాక్షుం డా మాటలను విని పాపచిత్తుండును, దేవబ్రాహ్మణ కంటకుం డును నగు నా దైత్యాధముని వధింపఁ గలను. వానివలన భయమును విడిచి స్వస్థచిత్తులయి సుఖముగా నుండుడని యానతిచ్చి, యోగమాయాబలంబుచేఁ బీనవృత్త పయోధరా న్వితయు రూపలావణ్య శాలినియు నగు నొక జగన్మోహిని

యను యువతీమణిని సృజించెను. ఆ జగన్మోహిని రూప లావణ్యాన్వితంబైన సఖీజనంబుతోఁగూడ నందనోద్యాన వనంబున సుఖముగా సంచరించుచుండెను. అట్టియెడ ఈ రక్కసుండు తప్త హేమప్రభా భాసురంబైన జగన్మోహినీ శరీర కాంతి నవలోకించి మదనబాణ హతుండై — యోతరుణీమణీ! నీ నామధేయం బెయ్యది? ఈ నందనవనంబున విజనప్రదేశమందు నీవొకెతవు నెందు కొఱకు సంచరించు చున్నావు. నీ రూపంబును జూచి కామాకులిత స్వాంతుండనైతిని. నీవు నాకు భార్యవై నీ తారుణ్యంబును సార్థకంబుగాఁ జేసికొనుము. నీ సౌందర్యము దర్శనమాత్రముచేతనే నా చిత్తమును మథించు చున్నది. నాకు సంగమాలింగన సుఖంబులను గలుగఁజేసి నను రక్షింపుము. ఇతర దుష్ప్రాపంబైన వస్తువులలోఁ త్రైలోక్యంబున నీ వెద్దానినిఁ గోరిన నద్దానినిఁ దెచ్చి నీ కిచ్చెద ననిన నా దైత్యపుంగవునితో జగన్మోహిని యిట్లనియె.

రాక్షసోత్తమా! నేను జగన్మోహిని యను నామధేయము కలదానను. నాకుఁ గాంక్షితార్థముల నొసంగు పురుషుని వరించుటకుఁ బ్రయత్నించు చున్నాను. మత్సంగమాలింగనాది సుఖాభిలాష నీకు కలదేని సకలకామదంబైన కల్పవృక్షం బొకటి యుత్తరదిగ్భాగంబునఁ గలదు. ప్రభాతకాల భాసమాన భాస్కర బింబసన్నిభంబులు, నమ్లానంబులును, సుగంధాన్వితంబులును, నతి మనోహరంబులును, దేవ దానవ దుష్ప్రాపంబులును నగు కుసుమంబు లాకల్పవృక్షంబువలనఁ బుట్టుచుండును. ఆకల్పవృక్ష కుసుమకృతంబైన మాలికను దెచ్చి నాకంఠమందు ధరింపఁజేసి సప్తకోటి పరిమితంబులైన

సరోవర జలోత్పన్న హేమారవిందంబులచే రత్నేశ్వరుండను పేర విఖ్యాతుండైన శంకరునిఁ బూజించితివేని, నీకుఁ బ్రియ భార్యను గాఁగలనని చెప్పెను. అపుడు రక్కసుం డామాట లను విని నీవుచెప్పినట్లు చేసెదనని పలికి,యా విహుండాసురుం డనేకారణ్యంబులం దిరిగితిరిగి యాకల్పవృక్షంబును గానక గురువైన శుక్రాచార్యుని, సమీపంబునకుఁ జని, యతనికి నమస్కరించి, జగన్మోహినీ వచనంబులను జెప్పి, యాకల్ప ద్రుమం బెక్కడ నున్నదో హేమారవిందంబు లెచ్చట లభిం చునో కరుణతో నాకుఁ దెలియజేయు మని ప్రార్థించెను. ఆభార్గవుండును దివ్యదృష్టిచే సర్వవృత్తాంతంబును దెలిసికొని వీని సంహారమునకై గావింపఁబడిన మహావిష్ణు మాయా తంత్రమునుగూడ గుర్తెఱింగి, దానిని దప్పించుటకై ప్రయ త్నము చేసినయెడల వామనావతారమందలి పరాభవముభంగి జరుగునని భయపడి భార్గవుండు విహుండ దైత్యునితో నిగూఢంబుగ నిట్లనియె.

ఓరాక్షసపుంగవా! తద్వృత్తాంతమును జెప్పుచున్నాను. సావధానచిత్తుండవై వినుము. ఉత్తర దిగ్భాగంబునఁ గామ ప్రమోదంబను పురవరంబు గలదు. అయ్యది కుబేర నివాసం బైన యలకాపురమునకు సమీపంబగుటచే, యక్ష శ్రేష్ఠు లచ్చటఁ దఱచుగా సంచరించు చుందురు. ఆపురవరంబున సకల కామదంబును, నతిమనోహర కుసుమాన్వితంబును నగు కల్పవృక్షం బొకటి కలదు. ఆ కల్పద్రుమ ప్రఫుల్ల పరిమళ మిళిత కుసుమస్తబకంబులు నేలరాలి యుల్లంబుల నుల్లసింపఁ జేయుచుండును. మేరుపర్వత శిఖరమునుండి కైలాసపర్వత

పరిసర ప్రదేశమందలి వేగముగా బ్రవహించు విమల పుణ్యా జలంబులతో నిండి దశయోజన విస్తీర్ణంబును, దివ్యహంసా న్వితంబును నగు మహాసరోవరం బొకటి గలదు. ఆసరోవరోప కంఠంబున నొక నారీరత్నము కూర్చుండెడిని. ఆమె నేత్రాశ్రు వుల వలన హేమారవిందంబు లుత్పన్నంబు లగుచుండును. ఆ కన్యకను బరిహాసోక్తులచే నవ్వింపఁజేసిన యెడలఁ, దన్నే త్రాశ్రు జలబిందు నిర్గతంబులయిన హేమారవిందంబులు పూర్వోక్త సరోవరజల ప్రవాహ పతితంబు లయి తేలిపోవు చుండును. ఆ కమలంబుల దెచ్చి శంకరునిఁ బూజించువార లభీష్టార్థ సిద్ధిం బడయఁ గలరని యారాక్షసునితో భార్గవుండు పలికి విరమించెను.

అపుడు విహుండాసురుండు, హర్షాశ్రువులచే జనించిన హేమారవిందంబుల కొఱకుఁ బ్రయత్నించు సమయంబున, మధుసూదనుండు నారదుని బిలిచి నీ వాదైత్యుని సమీపంబు నకుఁ జని, మోహావిష్టచిత్తునిం జేసి వానికార్యంబునకు విఘ్నం బాచరింపు మనినఁ, దద్వచనంబుల నాకర్ణించి వల్లెయని, తత్సమీపంబునకు జని, నారదుండు వారితో నిట్లనియె— ఓ రాక్షసరాజా! నీ వతి సంభ్రమాన్వితుండవై యెక్కడికిఁ బోవుచున్నావు. నీవు చేయు కార్యమును నాకు సవిస్తరం బుగాఁ జెప్పుమనిన, వాఁ డతివినయంబుతో నారదునికి నమ స్కరించి స్వవృత్తాంతం బంతయుఁ జెప్పెను. నారదుండు తద్వ చనంబులను విని విహుండాసురునితో నిట్లనియె.

ఓ రాక్షసేంద్రా! నీవు దేవదానవులను మర్దించిన మహా పరాక్రమశాలివి. అయిన నీదానవశ్రేణికి వైకుంఠుండు కృతావ

రాధుండు కావున యక్షేశ్వరులతోఁగూడ మహావిష్ణువుచే రక్షితంబైన యాకల్పవృక్ష సమీపంబునకు నీ వేఁగితివేని, నీ కార్యంబునకు విఘ్నంబు సంభవింపఁగలదు. కావున నీవు రత్నేశ్వర సమీపంబున నియమాన్వితుండవై జలప్రవాహాలబ్ధంబులయిన హేమారవిందంబులను గైకొని శంకరుని బూజింపుము. ఆ సరోవరజలము రత్నేశ్వరాలయ సమీపంబున నదీరూపంబై ప్రవహించుచున్నది. నీవు కోరిన హేమారవిందంబులన్నియు నచట లభింపఁగలవు. సకల కామదంబులును, గల్పవృక్ష ప్రసూతంబులును నగు దేవకుసుమంబులు కూడ సరోజలప్రవాహ పతితంబులయి తేలిపోవుచుండును. ఆ కుసుమంబులను గైకొని మాలికను జేసి యా తరుణీమణికి సమర్పింపుము. ఇట్లు జేసితివేని, నీవు కాంక్షితార్థ సిద్ధిం బడయఁగలవని మధుసూదన ప్రేరణంబుచే మహామోహమును గలుగఁజేసి నారదుండు స్వర్గలోకంబున కేగెను. అటుపిమ్మట రత్నేశ్వర దేవాలయ సమీపంబున సరోవర జలప్రవాహమందుఁ దేలిపోవుచున్న హేమారవిందంబులను గని, యారక్కసుండు, నారదోక్త వాక్యంబులను విశ్వసించి, రత్నేశ్వర సమీపంబునకుఁ జనుదెంచి, సుస్నాతుఁడై యమనియమ ప్రాణాయామాది సహితుండై, జటాభారసమన్వితుండై, యస్థిచర్మావశిష్టంబైన బ్రాహ్మణశరీరంబును దాల్చి యా హేమారవిందంబులచే రత్నేశ్వరునిఁ బూజించుచు జగన్మోహినీ విరహానల సంతప్తుండై శివలింగమస్తకోపరిభాగంబున దుఃఖజన్యంబులయిన నేత్రాశ్రువులను జాఱవిడచుచుండెను.

అపుడు స్వకృతాపరాధంబువలనఁ దత్పాగ్స్వమునుండి రత్నేశ్వర ప్రేరణంబుచే మహాకాళి యను నొక మహాశక్తి బయలు వెడలి వానితో నిట్లనియె. అమంగళంబులును, నపవిత్రంబులును, దుఃఖజన్యంబులును నగు నేత్రాశ్రువులు శివలింగోపరిభాగంబునఁ బడుచున్నవి. శోకాకుల మానసుండవై పూజించితివేని నీవు మహానర్థంబుల నొందఁగలవు. మానవుండు కామ క్రోధ లోభ మోహాది విక్షేప రహితుండై ధ్యాన పూజా వందనాదులచేఁ బరమేశ్వరుని నారాధింపవలయు. పురుషుండు నిశ్చలచిత్తుండై చిత్తవిక్షేప రహితుండై పరమేశ్వరు నారాధించినయెడల సకలకాంక్షితార్థముల నొందఁగలడు. ఓ రాక్షసాధమా! నీవు దురాచారుండవు. చిత్తశుద్ధి రహితుండవు. చిత్తశుద్ధితో చేసిన పుణ్యంబు స్వల్పంబయిన నది యధిక ఫలప్రదంబగు. నీ గురుండైన భార్గవుండు చెప్పిన ప్రకారంబుగా హర్షాశ్రు సంజాతంబులయిన హేమారవిందంబులను, హర్షాన్వితుండవై భక్తిశ్రద్ధలతోఁ బూజించినయెడల నీ కభిమతార్థంబు సిద్ధించెడిని. కాని నీవు సకలలోక కంటకుండవు. కావున నీసంహారమునకై విష్ణుమాయాబలంబుచే గల్పితంబైన యా కాంతామణియొక్క దుఃఖాశ్రు సంజాతంబులయిన హేమారవిందంబులను గ్రహించి, మోహినీవిరహ దుఃఖంబుచేఁ గామాకులిత స్వాంతుండవై శివలింగ మస్తకంబున దుఃఖాశ్రువులతోఁగూడఁ బూజించితివి. ఈశ్వర పూజాపరాధంబుచేఁ దదనుగ్రహ విముఖుండవైతివి. కావున నిన్ను వధించెదనని ఖడ్గమెత్తెను. వాఁడపుడు కడు భీతుండయ్యును నంతలో ధైర్యమూని యుద్ధసన్నద్ధుండై దివ్యాస్త్రంబులను

ప్రయోగించి, మహాకాళిపై బాణవర్షంబును గురిపించెను. అప్పుడా పరాశక్తి హుంకారమును జేసెను. ఆ హుంకారముచే బాణవర్షము నశించెను. రక్కసుండును దత్కాలమందు మృతుండై వజ్రాహత శైలంబువలె నేలఁగూలెను. దానం జేసి యింద్రాదిదేవతలందఱు అమితానందభరితులై యా మహాదేవిపైఁ బుష్పవర్షము గురిపించిరి. ఇట్లు నీ వడిగిన వృత్తాంతంబును జెప్పితినని పలికి కుంజరంబను వృద్ధశుకంబు విరమించెను.

## వృద్ధశుక చరిత్రము

అటుపిమ్మట నా వటవృక్షాధోభాగంబునఁ గూరుచుండి చ్యవనుం డీవృత్తాంతంబునువిని యాశ్చర్య భరితహృదయుండై యోవృద్ధశుక శ్రేష్ఠమా! సురముని సిద్ధసాధ్య యక్ష కిన్నర గంధర్వులలో నీవెవ్వండవు? ఏకారణంబుచేఁ బక్షియోనినిఁ బొందితివి? నీ కతీంద్రియజ్ఞానం బెట్లుకలిగెను? నీ వృత్తాంతంబును నాకు సవిస్తరంబుగాఁ జెప్పుమనిన, నాచ్యవన మహర్షితో వృద్ధశుకం బిట్లనియె—ఓ మునికులోత్తమా! బ్రహ్మమానస పుత్రుండును బ్రహ్మసముండును నగు భృగుమహర్షి వలన భార్గవుండు జనించె. అతనివలన జనించి విద్యాతపంబులచే విఖ్యాతుండవైన చ్యవనుండను బ్రహ్మర్షినిగా నిన్నె నే నెఱుంగుదును. సురముని సిద్ధసాధ్యాదులలో నేనెవ్వండనుగాను. నా పూర్వవృత్తాంతమును జెప్పెదను. సావధానచిత్తుండవై వినుము.

తొల్లి కులశీల వృత్తాన్వితుండును, దపఃప్రభావ సంపన్నుండును, నగు విద్యాధరుండను నొక విప్రుండు కలఁడు.

అతనికి వసుశర్మ యనియు, దేవశర్మయనియు, ధర్మశర్మ యనియు ముగ్గురు పుత్రులు గలరు. వారిలో జ్యేష్ఠసోదరులిరువురు వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞులును, సుగుణ శీలాన్వితులును సదాచార పరులునునై యొప్పుచుండెడివారు. వారిలో నేను ధర్మశర్మయను కనిష్ఠసోదరుండను, గుణశీల వర్జితుండను, మూర్ఖుండను. మాతండ్రి గురు గృహంబునకుఁ జని విద్యనభ్యసింపుమని చెప్పినను, నామాటలను జెవిని బెట్టక యోతండ్రీ! గురుకృతంబైన తాడన శాసనంబులును, క్రోధాది భ్రూవికారంబులును సుదుస్సహంబులు. కావున నే నాతాడన శాసనంబులను సహింపఁ జాలను. విద్యాభ్యాసంబు దివారాత్రంబులందు నిద్రాసుఖంబునకును, సవయస్కులతోఁ గ్రీడించుటకును, స్వేచ్ఛా సంచారంబునకును, ప్రతిబంధకమయినది. అపేక్షిత సమయంబున నన్నము భోగ్యపదార్థంబులును, లభింపవు. సవయస్కులయిన బాలకులతో స్వేచ్ఛగా దిరుగుచుఁ గ్రీడించెదను గాని గురుగృహంబునకుఁ బోయి విద్య నభ్యసింపననిన, నామాటలను విని మాతండ్రి నాతో నిట్లనియె.

ఓ పుత్రకా! నీవు గురుగృహంబునకుఁ బోయి ముఖ్యముగా విద్య నభ్యసింపుము. విద్వాంసులు సర్వకాలములయందును, సర్వదేశములయందును, సభలయందు రాజన్యులచే సన్మానము నొందుచుందురు. విద్య ధనంబును, యశంబును, స్వర్గ మోక్షంబులను గలుగఁ జేయును. విద్యావిహీనుండు పశుతుల్యుండు. విద్యాభ్యాసంబు దుఃఖకరంబైనను, ఫలకాలమందు హృద్యంబగుననిన, నా పితౄపదేశంబును లెక్కింపక వ్యర్థముగాఁ దిరుగుచు నొకప్పుడు ధనవ్యయమునుగూడ

గలుగఁజేయు చుండెడివాఁడను. అపుడు తల్లిదండ్రులును బంధువులును నిందించు చుండెడివారు. తన్నిందావాక్యంబులను విని లజ్జాభరాక్రాంత హృదయుండనై దుఃఖించు చుండెడి వాఁడను. అట్టియెడ నొకప్పుడు విద్యావిహీనుండ నైతిననియు, తల్లిదండ్రుల హితవాక్యంబులను విననైతిననియుఁ దలంచి, యొక దేవాలయంబున నేను గూర్చుండి దుఃఖించుచుంటిని.

ఆ సమయంబున జితేంద్రియుండును, జితాహారుండును, నిస్పృహుండును, సదానందమయుండును, నాత్మజ్ఞాన సంపన్నుండును నగు నొక సిద్ధపురుషుండు దైవప్రేరితుండై యచటికిఁ జనుదెంచెను. ఆ మహామహునింగాంచి భక్తిచే నమితకంధరుండనై, దీనుండనై తత్సమీపంబున నుంటిని. అపుడతండు నా దైన్యంబు నవలోకించి, నీకు దైన్యకారణం బెయ్యది? నీ వెందుకు దుఃఖించుచున్నావనిన, నా వృత్తాంతంబును, దుఃఖకారణంబును, నా సిద్ధపురుషునితోఁ జెప్పితిని. తద్వృత్తాంతంబును సిద్ధపురుషుండు తెలిసికొని, నాయందు మిక్కిలి దయావంతుండై నా కిట్లు పరమార్థతత్వము నుపదేశించెను.

ఓ విప్రోత్తమా! పరమాత్మతత్వమును నీకు బోధించుచున్నాను. సావధానచిత్తుండవై వినుము. పరమాత్మ పాణిపాద విహీనుండును, త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాది వర్జితుండును గావున ప్రత్యగాత్మ యనియు, కూటస్థుఁడనియు, సర్వసాక్షి యనియుఁ జెప్పఁబడును. పగలు ప్రకాశించువాఁడు సూర్యుండు. రాత్రి ప్రకాశించువాఁడు చంద్రుండు. గృహమందు సకలవస్తువులను బ్రకాశింపఁజేయునది దీపంబు. రాత్రింబగళ్ళయందును

లయిన నామిత్రులవలన విని, తీవ్రదుఃఖ పీడితుండనై మూర్ఛుండ నైతిని.

ఇట్లు మోహజాలబద్ధుండనై పరితపించుచు నో శుక శ్రేష్ఠమా ! సంస్కృతశ్లోకంబులను, గద్యంబులను నెల్లపుడును బఠించి నన్నానందింపఁ జేసెడిదానవు. ఇపుడు నేనేమి చేయుదును ? ఎక్కడికిఁ బోవుదును! నిను విడిచి క్షణమైన నుండఁ జాలను అని పరితపించుచుండెడివాఁడను. ఇట్లు విలపించుచు, మోహాక్రాంత చిత్తుండ నగుటచే సిద్ధపురుషోపదిష్టంబైన తత్త్వంబు విస్మృతంబయ్యె. అప్పటప్పుడు మరల ఈ మనోహరోద్యాన వనంబును విడిచి యెక్కడికి బోయితివని పరితపించుచు, నొకప్పుడు ముక్తకంఠుండనై రోదనము చేయుచుండెడివాఁడను.

ఇత్తెఱంగున విలపించుచు నా చిలుకను, దచ్చేష్టలను బ్రేమచే దలంచుచు మరణము నొందితిని. "భావోహి భవ కారణం" అను శాస్త్రముచే మరణకాలిక మనోభావంబు, భావిజన్మ కారణంబు గావున శుకయోనియందుఁ బుట్టితిని. అచ్చట జనించినప్పటికి సద్గురువైన సిద్ధపురుషుని బ్రసాదంబు వలన తత్త్వజ్ఞానవంతుండ నైతిని. తత్త్వజ్ఞానప్రభావంబుచే దేశ కాల విప్రకృష్ట వృత్తాంతంబులను నే నెఱుంగుదును. జ్ఞాన దీపప్రదుండైన గురునియందు మర్త్యుండను. బుద్ధి గలదేని వాని సకలధర్మంబులు వ్యర్థంబులగును. కాఁబట్టి గురుండును, జన్మ జరామరణ రోగాది సకలదుఃఖ నివర్తకుండు. దానంజేసి తత్సమంబైన తీర్థంబు లేదని తెలిసికొనవలెను. బాహ్యంబు లయిన గంగాది శరీర మలమును నశింపఁజేయుచున్నవి. గురూప

దిష్ట వాక్యంబులు గామక్రోధాది చిత్తమలంబు నశించు చున్నది. చిత్తశుద్ధివలన నపరోక్ష జ్ఞానవంతుడై ముక్తి నొందఁగలఁడు. గురునికంటే సంసార దుఃఖవినాశకుండు మఱి యొకండు లేఁడని తెలిసికొని, గురువును భజించినయెడలఁ, జన్మాంతరకృతంబులయిన సకల పాపంబులు నశించుచున్నవని, యా వృద్ధ శుకంబు భృగువంశోద్భవుండైన చ్యవనమహా మునితో నిట్లుపలికి, విరమించెను.

అటుపిమ్మట చ్యవనుండు సంతుష్టాంతరంగుండై స్వాశ్రమంబునకు నరిగి సుఖముగా నుండెను. ఓ వేనభూపాలో త్తమా! యిట్లు నీకు సకల ధర్మంబులను జెప్పితిని. అభీష్టం బైన వరమును గోరుము. నీ కిచ్చెద ననిన నపుడు వేనభూపా లుండు నిరంతరము నీపాదారవింద భక్తినిఁ గలుగఁజేసి దివ్య శరీరముతోఁగూడ వైకుంఠ లోకనివాసమును బ్రసాదింపు మనిన, నా మధుసూదనుండు వేనభూపాలునితో నిట్లనియె.

ఓ రాజేంద్రా! నీవు రాజసూయాశ్వమేధాది క్రతువుల నాచరించి గో భూ తిల హిరణ్యాది దానంబులను, నన్నోదక దానంబులను జేసితి వేని సకల భోగంబుల ననుభవించి మోక్షంబు నొందఁగలవు. నీవు నిష్కాముండవై దానంబుల నాచరించితివేని బ్రహ్మహత్యాది మహాపాతక విముక్తుండవై మత్పదంబు నొందఁగలవు. ఋషీశ్వర సందర్శనంబులచేతను, మదంశంబైన పృథుచక్రవర్తి నీకు పుత్రుం డగుటచేతను, నీవు శుద్ధుండ వైతివి. నీవు కొంతకాలము దివ్యభోగంబుల ననుభ వించి పిమ్మట నీ వాచరించిన యాగదాన హోమాది సుకృతంబులచేత, దివ్యవిమానంబు నధిష్ఠించి వైకుంఠ

లోకంబు నొందఁగలవని వేనభూపాలునితోఁ జెప్పి జనార్దనుం డంతర్హితుం డయ్యె.

## వేనుడు రాజసూయాది క్రతువులం జేసి వైకుంఠమును బొందుట

అవుడు వేనభూపాలుం డమందానంద తుందిల స్వాంతుండై కుమారుండైన పృథుచక్రవర్తిని బిలిచి నీవు జనించుటవలనఁ బవిత్రుండ నైతిని. నేను రాజసూయాశ్వమేధాది యాగంబులను విష్ణుప్రీతికొఱకు నాచరించి విష్ణు ప్రసాదంబుచే, దివ్యదేహాన్వితుండనై, వైకుంఠ లోకంబు నొందగలను. కావున నీవు క్రతూపయుక్త సంభారముల సంపాదించి, ఋత్విగ్గణంబులను బిలిపించి, ధనుర్బాణ ధరుండవై నాకు సహాయుండవు కమ్మని చెప్పెను. పృథుచక్రవర్తి తద్వచనంబుల నాకర్ణించి, సంభారంబులను సంపాదించి, ఋత్విగ్గణంబులను బిలిపించి, వారితో తండ్రిచేత నశ్వమేధమును సమగ్రముగాఁ జేయింపవలెనని పలికి, పిమ్మట దన తండ్రితో మీరలాజ్ఞాపించిన ప్రకారము సర్వకార్యములను జేసితి నని చెప్పెను. పిదపఁ దత్సహాయంబుచే రాజసూయాశ్వమేధాది క్రతువులను భక్తిశ్రద్ధలతో నాచరించి, బ్రాహ్మణుల కనేక దానంబులను జేసి, వేనభూపాలుండు పార్షద ప్రవరశోభితంబును, దివ్య హంస విరాజితంబును నగు నానావిధ మణిప్రవర శోభిత కాంచనమయ విమానంబు నధిష్ఠించి, దివ్యదేహాన్వితుండై, వైకుంఠ లోకంబు నొందెను. అటుపిమ్మట పృథు చక్రవర్తి యాగదాన హోమాదులను, విష్ణుధ్యాన పూజా

వందనాదులను, స్వయముగా నాచరించుచు, ననవరతము తీవ్ర శాసనంబుచే లోకుల నాచరింపఁజేయుచు న్యాయ్యముగ రాజ్యమును బరిపాలించుచు, వివిధ భోగంబుల ననుభవించి, విష్ణులోకంబు నొందెను.

## భూమిఖండ శ్రవణ ఫలము

ఓ శౌనకాదిమునివరులారా! మహావిష్ణు వేనభూపాల సంవాదరూపంబైన పృథూపాఖ్యానంబును మీకుఁ జెప్పితిని. భూమిఖండ శ్రవణఫలంబును జెప్పుచున్నాను. మీరలు సావధాన చిత్తులరై వినుండు. ఈ భూమిఖండంబును వినువారును, బఠించువారును, సకల పాపవిముక్తులయి గోసహస్ర దాన ఫలంబును, భార్యా పుత్ర క్షేత్ర విత్తాది సుఖంబులను బొందఁ గలరు. పద్మపురాణమును సమగ్రంబుగా వినువారు రాజసూయాశ్వమేధాది క్రతుఫలంబును, గంగాది సకలతీర్థ స్నాన ఫలంబును బొంది దివ్యవిమానంబు నధిష్టించి స్వర్గలోకంబు నొందఁగలరు. పురాణ శ్రవణంబు సకలపాపనాశకరంబును, చిత్తశుద్ధి కరంబును గావున శ్రేయస్కాములయిన పురుషులు పురాణశ్రవణమును జేయవలయును. సకలపురాణంబులలో నీ పద్మపురాణంబు సర్వోత్కృష్టమయినది. ఈ పురాణ శ్రవణంబువలన వర్ణాశ్రమధర్మంబులును, విష్ణుధ్యాన పూజా వందనాదులును, సంపూర్ణంబుగాఁ దెలియఁగలవు.

ఈ పురాణ శ్రవణము చేయువారు, గణాధిపతిని సరస్వతిని ముందుగాఁ బూజించి, పిమ్మటఁ బురాణవాచకుని బూజించి నియమాన్వితులయి వినవలయు. పురాణ శ్రవణాం

మందు వాచకుని గో భూ తిల హిరణ్య వస్త్రాది దానంబులచేఁ బూజింపవలయు. వాచకుండు సంతసించినయెడల, సకల దేవమయుండగు నారాయణుండు సంతసించును. కావున వాచకుని ముఖ్యముగాఁ బూజింపవలెను.

శ్లో॥ శ్రీకృష్ణం మనసా ధ్యాత్వా శ్రీకృష్ణం సంప్రణమ్యచ
భూమిఖండాంధ్ర వచనం ప్రణీతం కృష్ణ తుష్టయే॥

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మార్పణ మస్తు.

## గద్యము

ఇది పేరూరుగ్రామ సంస్థానాస్థాన పండితుండును, అమలాపుర శాఖానగర బుచ్చమ్మాగ్రహార వాస్తవ్యుండును, శ్రీపదవాక్య ప్రమాణ పారావార పారీణ సద్గురు కరుణా కటాక్ష సంప్రాప్తేష్ట దేవతాప్రసాద సమాసాదిత కావ్యనాటక న్యాయ మీమాంసాలంకార శాస్త్ర జ్ఞానాన్వితుండును, శ్రీ రాజరాజేశ్వరీ గర్భశుక్తి ముక్తాఫలాయమానుండును, మరువాడ సాంబశివశాస్త్రి యను శంభన్నశాస్త్రిచేఁ బ్రణీతంబైన శ్రీ వేదవ్యాస మహాముని ప్రణీత పద్మపురాణమందలి భూమిఖండాంధ్ర వచనము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ